శ్రీరాజేశ్వరాయనమః.

శైవప్రచారిణీ గ్రంథమాల. ౧౮

సంపాదకులు. కొటికెమేల రాజలింగాచార్యులు.

# శివయోగసారము.

## ప్రథమ సంపుటము.







గ్రంథకర్త

కోలనియాది గణపతి దేవుడు.

# శైవప్రచారిణీ కార్యాలయమున వెలకు దొరకు గ్రంథములు.

| | గ్రంథమాల చందా దారులకు | | ఇతరులకు |
|---|---|---|---|
| 1 కాశీసారము. | 0-1-3 | ... | 0-2-0 |
| 2 భద్రాయురుపాఖ్యానము. | 0-8-0 | ... | 0-12-0 |
| 3 విద్యాస్థాన నిర్ణయము. | 0-8-0 | ... | 0-12-0 |
| 4 శైవసిద్ధాంత దర్పణ. | 1-4-0 | ... | 1-8-0 |
| 5 ఉపదేశ కాండము. | 3-0-0 | ... | 3-8-0 |
| 6 సరస హృదయానురంజనము. | 1-8-0 | ... | 2-0-0 |
| 7 స్కాందమహాపురాణము సంభవ కాండము సంస్కృతము తాత్పర్య... | | | |
| [illegible] | 3-0-0 | ... | 3-8-0 |
| [illegible] | 2-0-0 | ... | 2-8-0 |
| [illegible] | 1-0-0 | ... | 1-8-0 |
| [illegible] | 1-0-0 | ... | 1-0-0 |
| [illegible] | 0-3-0 | ... | 0-4-0 |
| [illegible] | 0-8-0 | ... | [illegible] |
| [illegible] | [illegible]-1-3 | ... | [illegible] |
| [illegible] | [illegible]-3-0 | ... | 0-[illegible] |
| [illegible] | [illegible]-0-0 | | 2-[illegible] |
| [illegible] | | ... | |
| [illegible] | [illegible]-8-0 | ... | 0-8-[illegible] |
| [illegible] | 0-3-0 | ... | 0-4-0 |





# శైవప్రచారిణి.

సం॥౧కి		పక్షపత్రిక.		చందా 2-0-0

---

ఇయ్యది నిజాము రాష్ట్రమున నేటి తెలుగున సులభ శైలి [illegible] ప
త పత్రికలు లేని కొరంతను బాపబడుటలు వెడలిన యమూల్యమగు [illegible]
క పత్రిక కారాజము.

ఇందు నీతిబోధకములగు కధలు_ ఆరోగ్యదాయకములగు [illegible]
వ్యవసాయములు లాభకరములగు వర్తక విషయములు విజ్ఞాన మ[illegible]
డజల్లు భాషాపద్ధతులు వివేకమును గలిగించు చక్కనివిమర్శన[illegible]
ధర్మములు వ్యవహారరీతులు స్వదేశవిదేశ వృత్తాంతములు సర్వ[illegible]
చు హాస్యములు తల నూగించు చమత్కారములు వేయేల! సర్వ[illegible]
యములు ప్రకటింపబడును.

వలయువారు

శైవప్రచారిణీ పత్రికా కార్యాలయమునకు

వరంగిల్.

# విన్నపము

పాఠకమహాశయులారా!

సర్వేశ్వరుని లీలలు విచిత్రములు. అవాఙ్మానస గోచరములు. ఆ మహానుభావుని యాజ్ఞ నుల్లంఘింప నెవరితరము? ఆ మహాత్ముని యాజ్ఞానుసారముగనే వాయువు వీచుచున్నది. అగ్ని ప్రకాశించుచున్నది. సూర్యచంద్రు లుదయించుచున్నారు. అస్తమించుచున్నారు. ఇదియది యననేల సర్వప్రపంచము నా పరాత్పరుని యధీనమై యున్నదనుట సత్యము.

అట్టి పరమేశ్వరుని నారాధించి తరించుట, ఈ ప్రపంచంబున జన్మించి సంసార కూపమునఁబడి తెన్నుగానక పరితపించు మానవులందఱికానవశ్యకము. పరతత్త్వబోధకములగు గ్రంథములు పాటలు, మొదలుకొని భాష్యముల వరకనేకములు గలవు. అందులో నీశివయోగ సారమొకటి. శైవగ్రంథంబులలో నిట్టి గ్రంథమిది వరలో ముద్రింపఁబడలేదు. ఇందుగల పద్యరత్నములు పండిత పామరులకు సులభముగ దెలియును. అందు కుపయుక్తముగ సంగ్రహముగ తాత్పర్యము కూడ వ్రాసి ముద్రించితిమి. ఇందలి విషయసూచిక మూలగ్రంథమున లేదు. లేకున్నను పాఠకుల సులభబోధకై యిందుఁ జేర్చితిమి.

మా గ్రంథమాల యందిది పదునాల్గవ కుసుమము. ఇది నాలుగు సంపుటములుగ ముద్రింప నెంచితిమి. ప్రథమ సంపుటము ప్రకటించుట కింతటి యాలస్య మగుటకుఁదగిన గారణము లేక పోలేదు.

అమూల్యమగు నీగ్రంథము ముద్రింపఁ దలచి మాయొద్దగల తాళపత్ర గ్రంథమును వ్రాయించితిమి. రెండవ ప్రతి మా యొద్ద లేకపోవుటచే, నాంధ్ర సాహిత్య పరిషత్తు వారికి వ్రాసికొని, వారియొద్ద గల ప్రతులతో మా వ్రాతప్రతి సంప్రతింపు చేయించితిమి.

ఈ కార్యము సమాప్తమగు నప్పటికి గొంత విలంబము గలిగినది. సకాలమునకు కాగితము దొరుకక గొంత యాలస్య మైనది. ఎట్టులైన నేమి కొంత యాలస్యము గలిగిన మాట సత్యము. ఇదిమా పాఠకులకు సహింపక దప్పదు. రాబోవు సంపుటముల సాధ్యమైనంత త్వరలో బ్రచురింప బూనుచున్నారము.

ఈ గ్రంథమును దమకున్న ప్రధాన కార్యము లున్నను, అతిప్రేమతో, దమ యొద్దగల తాలపత్ర గ్రంథములతో సవరించి యిచ్చిన బ్ర॥ శ్రీ॥ క్రొత్తపల్లి సూర్యారావు గారికి మా కృతజ్ఞతా పూర్వక నమస్కృతు లాచరించు చున్నారము.

ఈ గ్రంథకర్తృ కాల నిర్ణయము, కవితా కౌశల్యము సర్వేశ్వర భక్తి మొదలగు విషయములును,ఇందలి యద్వైత సిద్ధాంతమును నాల్గవ సంపుటమున విపులముగా జర్చించి మాపాఠకుల కందజేయగలమని విన్నవించుచు నింతటితో విరమించు చున్నారము.

సంపాదకులు.

శైవప్రచారిణీ గ్రంథమాల ౧౮

# శివయోగ సారము



ప్రథమ సంపుటము.

ఇది

బ్ర. శ్రీ. విద్వాన్ ముదిగొండ వీరేశ లింగ శాస్త్రిగారిచే

దాత్పర్యము వ్రాయబడి,

బ్రll శ్రీll కొడిమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవ ప్రచారిణీ ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁ బడియె.

కాపీలు. ౧౦౦౦

చందా దారులకు 1927 ఇతరులకు

వెల 1-0-0 వెల 1-4-0



శ్రీరాజేశ్వరాయనమః

# శివయోగసారము

## ఉత్తరభాగము.

### ప్రథమాశ్వాసము.





గురు చెన్న సదా శివ
యోగీంద్ర కులాబ్ధి చంద్ర! యోగి వినుత! శై
వాగమ సారార్థజ్ఞ!
నాగార యుడూరి నూక! నారాధ్య వరా. ౧

అ. శ్రీకర గుణ రాజివిరాజితుండగు గణపతియోగి, తానురచింపఁ దలఁచిన శ్రీశివయోగ సారమున కాదియందుఁ గవిజనసాంప్రదాయమునను సరించి "యాశీర్వాదనమస్కార వస్తునిర్దేశ క్రియములలో వస్తునిర్దేశ రూపమయిన కృతిభర్తృ ప్రశంసను జేయుచు, "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషకాణ్యాయుష్మత్పురుషకాణిచభవంత్య ధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి" యనుచు మహాభాష్య కారుల వచనమును శిరసావహించుచున్న వానివలె, సర్వమంగళా సమేతుండగు సదాశివస్వరూపునిగా నూకనారాధ్యు నిస్తుతించుచున్నాఁడు.

౧ తా. శ్రీగురు చెన్నసదాశివ స్వరూపుఁడవగును, యోగీంద్ర సానందప్రమదమువును

యోగి పూజితుండవును, శివాగమ సారములగు వాతూల- కారణాద్యుత్తర తంత్రములయర్థమును గుర్తెఱిగిన వాఁడవు. "నాగార యుక్తి" యను గృహ నామము గలవాఁడవునగుదువో నూకనారాధ్య వర్యా!

వి. శ్రీకార మగ్రంథాది యందుఁ బ్రయోగించుటచే సర్వదోషములు నివర్తించును.

శ్లో. దేవతా వాచకాశ్శబ్దా। యేచభద్రాది వాచకాః।
తేసర్వేనైవ నింద్యాస్యు। ల్లిపితోగణతో పివా॥

అనియు,

కం. శ్రీకార మగ్రకృత్యాదిని। బ్రౌకటముగ నున్నఁ జాలు, బహుదోషములం।
బోకార్చి శుభములొసఁగును। బ్రాకృత కృతిగ నిసుమసోపు పనసముభంగిన్

తే. వేదముల కెల్ల నోంకార మాదియైన। కరణిగృతులకు నెల్ల శ్రీకార మాది।
గానగవివరులెల్లరు దానిదక్క।ని తగవర్ణంబులిడరు సత్కృతుల మొదల॥

అనియు నుండుటచేత సమస్త దోషములు తొలఁగి కృతికర్త - కృతిభర్త లకుఁగీర్తియుఁ బ్రతిష్ఠయును సంభవించుటయ గాక, నిర్విఘ్నముగా గ్రంథపరి సమాప్తియు నగును సనిస్ఫురింపఁజేసెను.

ఆ. శైవ యోగ శాస్త్ర, సార సముచ్చయ
ప్రకరణముల యర్థ, భావ మెల్ల
తెనుఁగు కవిత తేట, తెలివి గానే భవ
దాజ్ఞ విన్నవింతు, నవధరింపు. ౩

తా. ఓ ఆరాధ్య శిఖామణీ! శివయోగ శాస్త్రంబుల నన్నిటి నవలోకించి, యందలి సారంబును- మధువ్రతంబు మకరందమును బోలె గ్రహించి మీయాజ్ఞను శిరసా వహించి తేటతెలుఁగు బాసయందు విన్నవించెద. అవధరింపుము

వి ఇందు "భవదాజ్ఞ" యనుటచే నూకనారాధ్యుఁడు తానొక గ్రంథంబును గృతినొందఁ దలఁచి "గణపతి యోగి" ని బిలచి సభసమ్ముఖము టిక సువర్ణ కర్పూర వీట్యంబు లొసంగి తనపేర శైవగ్రంథ రత్నమొకటి కృతిగ నీయుమని కోరుటయు, నాతఁడటులనే సర్వవేదాంత సారంబగు శివయోగ శాస్త్రంబు కృతిగనొసంగి యిటులను దోఁచెడిని.

అ. కవితన కీర్తిమహా ప్రబంధ రచన యందుఁ దనకుఁ గల్గునై పుణ్యమును వక్కాణించు చున్నాఁడు.

## — * గ్రంథప్రశంస. * —



చ. *గణపతియోగి నామమునఁ గల్గిన యీశివయోగసారముం
బ్రణుతి మహాప్రబంధమునఁ బల్కితి నాక్రియ పూర్వభాగముం
గ్రిణయన భక్తులౌనఁగఁ దెంతు సదాశివయోగినాథ ధీ
మణి యనసాక్షికెక్క నగరమాబున నుత్తరభాగ మేర్పడన్. 3

తా. మహాత్మా! "గణపతి యోగి" యని పిల్వఁబడు నేను, శివయోగ శాస్త్రము నం దుఁబూర్వభాగమును సర్క్కవిజనంబులు మహాప్రబంధ మనిశ్లాఘింపఁగ వచించితి. ఇప్పుడు శివభక్తులందఱు "మేల్ మేల్- భళాభళా-" యని కీర్తింపుచు- "సదాశివయోగి నాథధీ మణి" యనినాతఁడుగ నుత్తరభాగంబు రచించెను.

వి. సదాశివ యోగినాథ ధీమణి" యను చోట, "సదాశివ" అను మాటకృతి భర్తను సంబోధింపవచ్చును. అందుకు మొదటి పద్యమున నూక నాథాఖ్యుని సదాశివయోగిఁ జెప్పుటయే కారణము. "యోగినాథ ధీమణి" యన యోగీంద్రులలో బుద్ధి చాతుర్యము గలవాఁడని భావము.

మఱియు, "సదా శివయోగి నాథధీ మణి" యని యేకపదము చేయవచ్చును. ఆ ప్పుడు శివయోగులలో నుత్తముఁడని యర్థము. లేక "సదా" యనునది వేఱుఁ జేసి "కథింతు" అను క్రియలో నన్వయింప వచ్చును. అటుల నన్వయించిన" ఎల్లప్పుడు శివ యోగులు స్తుతింపుచుండ "మనోహరముగ వచించుచున్నని భావము

అ. కవి శివ యోగ సార పూర్వ భాగ మందలి విషయ ముకు సంగ్ర హాము గా వచింపు చున్నాఁడు.

శా. విశ్వేశ స్థిర భక్తివర్ధిలఁగ నుర్వీంబూర్వ భాగాప్తసం
ఖ్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞముఁ దపోయజ్ఞ ప్రకారంబు న
శ్వైశ్వర్య ప్రదమై తనర్చు జపయోగజ్ఞాచారముం గూడఁగా
విశ్వ స్తుత్య గతిం బ్రబంధ మమరెంగే విద్వత్సరి గ్రాహ్యమై. ౪

తా. ఈశివయోగసారమనుమహాప్రబంధము పూర్వభాగమనియుత్తరభాగమనియు రెండు

* గణపతి దేవనామమున గల్గిన

ధము. ఈగ్రంథమునఁ బూర్వభాగమున నెనిమిదియాశ్వాసములు గలవు. మతియును సర్వేశ్వర ప్రీతికారణంబులగు కర్మయజ్ఞ తపోయజ్ఞ జప యజ్ఞంబులు - విశ్వేశ్వర భక్తివృద్ధిఁ బొందునటుల - విద్వాంసులు పరిగ్రహించునటుల - ప్రపంచముకొని యాడునటుల - చెప్పఁబడినవి.

అ. శివ ఉత్తర భాగమునఁ గలవిషయమును జెప్పుచున్నాఁడు.

క. ఈ యుత్తర భాగంబున
నాయతి రచియింతు నాలుగాశ్వాసములం
బాయక ధ్యాన జ్ఞాన మ
హాయజ్ఞ ద్వయము యమిజనానందముగన్. ౫

తా. ఇప్పుడు నేను చెప్పఁబోవుచున్న యీయుత్తర భాగమున - యతీంద్రులు సంతసించు నటుల ధ్యాన యజ్ఞమును - జ్ఞానయజ్ఞమును - నాలుఁగాశ్వాసముల యందు వర్ణించెద.

అ. శివలింగమును నుతించుటకుఁ గారణము వచించుచున్నాఁడు.

క. శివయోగ మిందు నెంతయు
నవిరళమై వెలయుటం దదనుకూలముగాఁ
బ్రవిమలమతి నాత్మస్థిత
శివలింగముఁ గొలుతు మొదలఁ జిన్మయ లీలన్. ౬

తా. ఈయుత్తర భాగమున శివయోగమే మిక్కిలి వివరింపఁ దలచుట చేతఁ దదనుకూల ముగ నాశివయోగమున కాధారభూతము - చిన్మయస్వరూపము ఆత్మగతమునగు శివలింగ మును మొదట నుతించెద.

* ఆత్మలింగప్రశంస. *



వ. తత్ప్రకారం బెట్లనిన. ౭

తా. అదియెట్టులన.

అ. దహరాకాశాంతర్గతమగు నాశివలింగమును ప్రశంసించుచున్నాఁడు.

శా. ఆకాశోజ్జ్వల నీలవారిధరమధ్య *స్థైక విద్యుత్ప్రభా
నీకాశంబయి సర్వభూతమయమై నీవార శూకాతి సూ

* స్థైర్య

ఓంకారంబున శంభురూపమున బ్రత్యక్షంబు నై యున్నవే
దైక స్తుత్యము నాత్మలింగము బ్రవి యంచె బారంగ భావించెదన్. ౮

తా. ఏలింగ మాకాశమునఁ బ్రకాశించుచున్నయల్లని మేఘముల మధ్యయందలి మెఱుపుతో సదృశమై ప్రకాశించుచుండునో; ఏదిసర్వభూతస్వరూపమో; ఎయ్యది నివ్వరిముల్లు యొక్క యగ్రమువలె విరాజిల్లుచుండునో; భక్తులకెయ్యది శివస్వరూపమున సాక్షాత్కరించుచుండునో; ఏది చతుర్వేదములచే నుతింపఁబడుచుండునో; అట్టిజ్యోతిరూపము-సచ్చిదానందాత్మకమునగు శివలింగమును నేనుభక్తితో ధ్యానించెద.

వి. ఇచ్చట ఆత్మలింగమనఁగా శివలింగమనియే భావము శు॥ ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే। స ఆత్మా స విజ్ఞేయః (మాండూక్యే) అను శ్రుతి యందు "స ఆత్మా" అనుపదమువలన శివుడే వచింపఁబడెను. కాన ఆత్మశబ్దవాచ్యుఁడు పరశివుడ నియే సిద్ధాంతము.

ఇందు శ్రు॥ నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా। నీవార శూకవ త్తన్వీ పీతా భాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః॥ అనఁగా నాజ్యోతి, నీలాకాశ మధ్యమున మెఱుపుతీఁగవలెఁ బ్రకాశించుచుండును. అది నివ్వరి ముల్లువలె మహాసూక్ష్మమై పచ్చనై నిరుపమానమై విరాజిల్లు చుండును. ఆవహ్ని శిఖాగ్రమధ్య యందు పరమాత్మయుండు నని నారాయణోపనిషచ్ఛ్రుతి పాదితమగు యర్థమే నిర్వ చింపఁబడినది.

మఱియు- ఆకాశమనఁగా నిట దహరాకాశమునకే యర్థము. శు॥ దహ్రం విపాపం పరమేశ్మ భూతం యత్పుండరీకం పురమధ్య సగ్గ్ధం। తత్రాపి దహ్రం గగనం విశోకస్తస్మిన్ యదంతస్తదుపాసితవ్యం॥ పుండరీక పురమధ్య యందేది యల్పమై పాప రహితమై పరమేశ్వర గృహమై యున్నదో, ఆగృహముకంటెను నత్యల్పమై శోకరహితమై ఆనంద రూపమై వెలయుచు చిదాకాశ మధ్యమునందే తత్త్వము దివ్యకాంతుల విరాజిల్లుచున్నదో అట్టిశివతత్త్వమే యుపాసింపఁదగినదని భావము. కావున "ఆకాశోజ్వల" అనువచనమునసర్వజనులు- దహరవిద్యోపాసనఁజేసి ముక్తినొందుటకును, కవితనకు దహరవిద్య యందుగల నిరుపమానచాతుర్యమును దెలుపుటకును నీపద్యము వచించి యుండునని తోఁచెడిని.

మఱియు- నీయర్థము బ్రహ్మబిలము నందలి యాక్రిందిపద్యముచేబోధింపఁబడినది.

సీ. నీలతోయదమధ్య, నీవార శూకవ, త్పరిపూర్ణ కాంతిచేఁ బ్రబలియుండు
శంపాలతలభాతిఁ బటులప్రకాశమై చంచ రీకగురుతిఁ జెలఁగుచుండు
---

థము. ఈగ్రంథిలోఁ బూర్వభాగమున నెనిమిదియాశ్వాసములు గలవు. మఱియు సర్వైశ్వర్య కారణంబులగు కర్మయజ్ఞ తపోయజ్ఞ జప యజ్ఞంబులు- విశ్వేశ్వర భక్తివృద్ధిఁ బొందునటుల- విద్వాంసులు పరిగ్రహించు నటుల- ప్రపంచముకొని యాడునటుల-; పేర్కొనఁ బడినవి.

అ. శివుఁడుత్తర భాగమునఁ గలవిషయమును జెప్పుచున్నాఁడు.

కం. ఈ యుత్తర భాగంబున
నాయతి రచియింతు నాలుగాశ్వాసములం
బాయక ధ్యాన జ్ఞాన మ
హాయజ్ఞ ద్వయము యమిజనానందముగన్. ౫

తా. ఇప్పుడు నేను చెప్పఁ బోవుచున్న యీయుత్తర భాగమున- యతీంద్రులు సంతసించు నటుల ధ్యాన యజ్ఞమును- జ్ఞానయజ్ఞమును- నాలుగాశ్వాసముల యందు వర్ణించెద.

అ. శివలింగమును నుతించుటకుఁ గారణము వచించుచున్నాఁడు.

కం. శివయోగ మింపు నెంతయు
నవిరళమై వెలయుటందుఁ దనుకూలముగాఁ
బ్రవిమలమతి నాత్మస్థిత
శివలింగము గొలుతు మొదలఁ జిన్మయ లీలన్. ౬

తా. ఈయుత్తర భాగమున శివయోగమే మిక్కిలి విసరింపఁ దలచుట చేతఁ దదనుకూల ముగ నాశివయోగమున కాధారభూతము- చిన్మయస్వరూపము ఆత్మగతమునగు శివలింగ మును మొదట నుతించెద.

* ఆత్మలింగప్రశంస. *



వ. తత్ప్రకారం బెట్లనేని. ౭

తా. అదియెట్టులన.

అ. దహరాకాశాంతర్గతమగు నాశివలింగమును ప్రశంసించుచున్నాఁడు.

శా. ఆకాశోజ్జ్వల సీలవారి ధరమధ్య *స్థైక విద్యుత్ప్రభా
నీకాశంబయి సర్వభూతమయ మైనీవార శూకాతి సూ

* స్థైర్య

ఓంకారంబున శంభురూపమున ప్రత్యక్షంబు నై యున్న వే
దైక స్తుత్యము నాత్మలింగముఁ బ్రీతి యంత బాౕరంగభావించెదన్. ౧౮

తా. ఏలింగ మాకాశమునఁ బ్రకాశించు చున్నట్లుని మేఘముల మధ్యయందలి మెఱుపు తో సదృశమై ప్రకాశించు చుండునో; ఏదిసర్వభూతస్వరూపమో; ఎయ్యది నివ్వరిముల్లు యొక్క యగ్రమువలె విరాజిల్లుచుండునో; భక్తులకెయ్యది శివస్వరూపమున సాక్షాత్కరించుచుండునో; ఏది చతుర్వేదములచే నుతింపఁబడుచుండునో; అట్టిజ్యోతిరూపము-సచ్చిదానం దాత్మికమునగు శివలింగమును నేనుభక్తితో ధ్యానించెద.

వి. ఇచ్చట ఆత్మలింగమనగాఁ శివలింగమనియే భావము శ్రు॥ ప్రపంచోప శమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే। సఆత్మాసవిజ్ఞేయః(మాండూక్యే) అనుశ్రుతి యందు "స ఆత్మా" అనుపదమువలన శివుడే వచింపఁబడెను. కానఆత్మశబ్దవాచ్యుఁడు పరశివుడ నియే సిద్ధాంతము.

ఇందు శ్రు॥ నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా। నీవార శూకవ త్తన్వీపీతా భాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మావ్యవస్థితః॥ అనఁగానాజ్యోతి,నీలాకాశ మధ్యమున మెఱుపుతీగవలెఁ బ్రకాశించుచుండును. అది నివ్వరి ముల్లువలె మహా సూక్ష్మమై పచ్చనై నిరుపమానమై విరాజిల్లు చుండును. ఆవహ్ని శిఖాగ్రమధ్య యందు పరమాత్మయుండు నని నారాయణోప నిషచ్ఛ్రుతి పాదితమగుయర్థమే నిర్వ చింపఁబడినది.

మఱియు- ఆకాశమనఁగానిటదహరాకాశమునకే యర్థము. శ్రు॥ దహ్రం విపాపం పర వేశ్మభూతం యత్పుండరీకం పురమధ్య సగ్గ్ధసం। తత్రాపిదహ్రం గగనం విశోకస్తస్మిన్యదంత స్తదు పాసితవ్యం॥ పుండరీక పురమధ్య యందేది యల్పమై పాప రహితమై పరమేశ్వర గృహమై యున్నదో, అగృహముకంటెను నత్యల్పమై శోకరహితమై ఆనంద రూపమై వెలయుచు చిదాకాశ మధ్యమునందే తత్త్వము దివ్యకాంతుల విరాజిల్లుచున్నదో అట్టిశివతత్త్వమే యుపాసింపఁదగినదని భావము. కావున"ఆకాశోజ్వల"అనువచనమునసర్వజనులు- దహరవిద్యో పాసనఁజేసి ముక్తినొందుటకును, కవితనకు దహరవిద్య యందుగలని రుపమానచాతుర్యమును దెలుపుటకును నీపద్యము వచించి యుండునని తోచెడిని.

మఱియు- నీయర్థము బ్రహ్మబిలము నందలి యాక్రిందిపద్యముచేబోధింపఁబడినది.

సీ. నీలతో యదమధ్య, నీవార శూకవ, త్పరిపూర్ణ కాంతిచేఁ బ్రబలియుండు
శంపాలతాలభాతిఁ జటులప్రకాశమై చంచ రీకఘురీతిఁ జెలఁగుచుండు

క॥ కరికుంభ మధ్యస్థ, ఘనమౌక్తికద్యుతుల్, వెలయుచు బ్రకాశమై యలరుచుండు
బుధశరత్కాలంబు, రూఢిగా వ్యాపించు, చంద్ర చంద్రికలీల, జెలగుచుండు.
గీ. పద్మగర్భప్రభ యనంబైన, భానుపగిది, పటిమదీపించు జటులహృత్పద్మమందు
పరమహంస విహారచిత్ప్రణవధార, పదులనైదింట శోభిల్లు బ్రహ్మబిలము.

తోయదము- అనగా, తోయము- ఉదకము-దాని ధరించినది తోయదము-కంటి శ్రేష్ఠమందు- ఎల్లప్పుడు నీరుండుటచే తోయదమన కంటిగ్రుడ్డు అని చెప్పబడును.

పద్మంబుల వికసింపజేయు సూర్యకాంతివలె మిక్కిలి పటుత్వమున బ్రకాశించు హృత్పద్మము (అనగా సహస్రారము) నందు బరమహంస (షడ్గుణలక్షణ సంపన్న)లగు శివయోగులు విహరించునట్టి చిత్ప్రణవ మార్గమై పదులనైదింట అనగా పంచాశద్వర్ణములచే విలసిల్లు బ్రహ్మబిలము-[బ్రహ్మరంధ్రము]వల్లనికంటి గ్రుడ్డు మధ్యయందు నివ్వరి ధాన్యపు మొల్లవలె నతిసూక్ష్మమై పరిపూర్ణ ప్రకాశమున వెలుగుచుండును.

ఆదిత్యశతసమమై మెఱుపుతీగబోలె వెలుంగుచు భ్రమరము పోలె ప్రవర్తించును. మత్తగజ కుంభస్థలము లందలి ముత్యాల కాంతులవలె కంటికి విభ్రమము గల్గించును. శరత్కాలము నందు నిర్మలమగు నాకాశమునందంతయు వ్యాపించి వెలుంగునట్టి పూర్ణిమ నాటి వెన్నెలవలె ప్రజ్వలించుచుండునని భావము.

చంద్రచంద్రికన్యాయము చెప్పుటచేత, ఆణవ- కార్మిక- మాయిక మాయేయ తిరోధానములను పంచమలములు లేక పరమేశ్వరునితో గూడి బ్రహ్మరంధ్రము నిర్మలమై విరాజిల్లుచుండునని భావము.

బ్రహ్మబిలమనగా నేమియో కొంచెము విచారించుదము. మనదేహము నందు మూలాధారము (గుదస్థానము) మొదలుకొని కపాల కుహరము వరకు నొక వెన్నెముక గలదు. అది వీణాదండము వలెనుండును. వీణకు మెట్లెట్లుండునో, అటులే వెన్నెముకకు గూడ ముప్పదిమూడు పూసలుండును. వీనిలో మొట్టమొదటి యేడు పూసలకు మెడపూస లందురు.

మిగిలిన యిరువది యారుపూసలను వెన్నుపూస లందురు. ఈ వెన్నెముకకే "మేరువ"యనియు- బ్రహ్మదండ యనియు నామములు. ఈ ముప్పది మూడు పూసల యందును నొక రంధ్రము గలదు. ఆ నాళమునకు- సుషుమ్నా నాళమని పేరు.

మఱియు- వెన్నెముక మధ్యయందు గొట్టమువలె సూక్ష్మరూపముగ సన్నరంధ్రమునకే బ్రహ్మనాడి యని పేరు. ఈ బ్రహ్మ నాడి ఇడా పింగళ నాడులకు మధ్య యందు

డి "సుషుమ్న" యనిపేరఁ బరగు చున్నది. ఈసుషుమ్నయే బ్రహ్మైక్య మునకుఁ గారణము. కావుననీనిని "బ్రహ్మనాడి" యనికూడ నందురు.

సుషుమ్నాంతర్గతమై "కుండలినీ"శక్తి గలదు. సుషుమ్నా నాళముకుండే సుషుమ్న యధోముఖముగ మూలాధార స్థానమునకు వచ్చి పదునాలుగు విషయముల యందు ప్రవర్తింపఁ జేసితాను యూర్ధ్వముఖముగ తిరిగి వెన్నుపూసలను మెదపూసలను దాటి పెద్దనాళముతో గలియును. ఈపెద్దనాళమునకే "బ్రహ్మబిల"మనియు "బ్రహ్మరంధ్ర"మనియును నామములు.

ఈసుషుమ్న- మిక్కిలికోమలమును- మిక్కిలిమృదువైనదియు గనుక, దేహపు దయు రాకుండునట్లుల ననలలయందలి కపాలపహరము- అనగా ఎముకలప్రైపైనుంచఁ బడి యతిబాగ రాకలతోఁ గాపాడ బడి వచ్చెను. ఈసుషుమ్న యుండె ముఖ్యస్థానము బ్రహ్మరంధ్రము. ప్రాణాధారమిది దేహగాని మరొక్కటి గాదు.

నవనీతమువలెనత్యంతకోమలమును- అతిసుకుమారమును నగుట నీసుషుమ్న యిడా పింగళలను నాడులతో కూడి మూలాధారము నుండి యూర్ధ్వ ముఖము గాఁ బోయి "కుండలీ శక్తి" యనునామమునఁ గపాలకు నారమునకుఁ జేరయక్కడి నుండి రసనాగ్ర మునకే తెంచి "సరస్వతి" యనునామమున వెలయుచున్నది.

ఈసుషుమ్నయే మూలధారమునుండి సహస్రార పర్యంతము వ్యాపించుచుఁ బశ్చిమాభిముఖియై భ్రూమధ్యయందు నిడాపింగళా నాడులతోఁ గలియు నుండును.

అటుల గలియు స్థానమే త్రివేణీ సంగమము- త్రికూటస్థానము- ఆజ్ఞాచక్రము- అను పేరులతో వ్యవహరింపఁ బడెను. సుషుమ్న తెల్లనిరంగు గలది గానశుక్లనాడి యనియు, పరశివజ్ఞానమునకు సాధకము గాన బ్రహ్మనాడి యనియుఁ జెప్పఁ బడును. ప్రయాగ క్షేత్రమున సరస్వతి యెటుల గుప్తగామినియై చరించు చుండునో, అటులే యీసుషుమ్నయు గుప్తగామినియై సంచరించునని భావము.

శ్రోత్రములు- నేత్రములు- నాసిక- నాలుక- యను చోటుల నుండి 7 నాడులు మేదస్సుఁ (BRAIN) నందు సుషుమ్నతోఁ జేరును. ఆస్థానమునే బ్రహ్మబిలమనియు- బ్రహ్మరంధ్ర మనియు- సప్తపథ యనియు వచించుదురు. అచ్చట నేసహస్రారముండును. చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణ ములనుండి పోవునాడులు కలియుస్థానము గనుక దీనినిచతుష్పథ మనియు- శృంగాటక మనియుఁ బలుకుదురు. బ్రహ్మకుని వాస మగుట బ్రహ్మ బిలమ నియు నుడువుదురు.

బ్రహ్మరంధ్రము- భూవలె నముకాగానే చంటిపిల్లల నడినెత్తి వ నొక గుంటయుం

డును. అదిచాలసూక్ష్మముగా నుండును. ఆగుంటకు దిగువనైపు నొక కమలము గలదు. దా
నికే సహస్రార కమలమని పేరు. శిశువుతల్లిగర్భములోనున్న పుడీ కమలము వికసించియుం
డును. కాబట్టియే గర్భములోని శిశువులకు నేడవ మాసము మొదలుకొని భూపతనము వ
రకు జ్ఞానమెక్కువగా యుండును. భూమిమీద పడినంతనే యజ్ఞానమను మాయచే నా
వృతమై యాకమలము మూసికొని పోవును.

గర్భములోనున్న ప్రాణాశిశువు యొక్క త్వక్చక్షు శ్రోత్ర జిహ్వ ఘ్రాణము లం
దు నాత్మ విస్తరించలేదు గావున, ఆయింద్రియములకు విషయము లందిచ్చుటయు లేదు. గ
ర్భనరకములో నున్నపుడు శిశువు జ్ఞాననేత్రముద్వారా సర్వమును దెలిసి కొనును.

నాభినుండి వచ్చెడు తీగగుండా తల్లిభుజించిన పదార్థముల రసమునను భవించు
ను. ఈబ్రహ్మరంధ్రము గుండనే యాత్మస్థూలశరీరమునఁ బ్రవేశించును.

బిడ్డలకు మాడున పసుపురాసి చమురు పెట్టుట యాచారముగా గలదు. ప్రతిదిన
మును నిటుల జమురు రాయఁగా రాయఁగా వడిసెత్తిన నుండెడిగుంట పూడిపోవును. పం
డ్రెండు వత్సరములు వచ్చునప్పటికి నెముక లన్నియు నతుకుకొని గుంట యేమాత్రము క
నపడక తలగట్టి పడిపోవును.

హృత్పద్మమును సహస్రార కమలము. సుషుమ్న మూలాధారమునుండి తెరగిపోవు
నపుడు తనతో నుండెడి యిడాపింగళ లను నిరుచేడియల నిరుప్రక్కల నైకొని నూరునా
డులతో సనాహతమునకు వచ్చి యానూరు నాడులను నక్కడ విడిచి యూర్ధ్వముఖ
వ్యాపినులై పోవుచుండును. మఱియు నీసహస్రార కమలము బ్రహ్మబిలమున గలదని త
త్త్వ వేత్తలు చెప్పుదురు. ఇంతవరకును బ్రసక్తాను ప్రసక్తిచే "నీలతోయద" అను వచన
మును సాధారముచేసికొని విచారించి యుంటిమి. ఇంకను యీవిషయమై చెప్పఁదగినది
చాలగలదు. అదిషట్చక్రముల విషయమువచ్చి నపుడు విస్తరించి వ్రాసెదము.

అ. పూర్వ పద్యమున ధ్యానించిన శివ లింగమును బూజించుచున్నాఁడు.

చ. నియతి మహానదీ విమలనిశ్చల చిత్తజలాభిషేక స
త్క్రియ లొనరించి నిత్యమును కేవలమైన సమాధిపుష్పసం
చయములఁ బూజసల్పెద లసన్మణివర్ణము నాత్మలింగముం
రయమున నింకఁ బుట్టువుల రాయిడికిన్నెడఁబాయ గోరుచున్.

తా. చిరకాలమునుండి వచ్చుచున్న జన్మపరంపర నెడబాయఁదలఁచియో మహాత్మా! నే
ను నియతియను మహానదియందలి నిర్మలమగు నిశ్చల చిత్తమను జలంబున నభిషేకాది
సత్క్రియలొనరించి నిరంతర సమాధియను దివ్యపుష్పనికాయంబునఁ బూజించెద.

వి. మణివర్ణము- అనగా చింతామణి స్వరూపమని భావము. "చింతామణౌ శివంధ్యా త్వా సర్వాన్కామానవాప్నుయాదితిస్మరణాత్" అనఁగా చింతామణి యందు శివుని ధ్యానించవలయునని భావము. ఈయర్థమునే నీలకంఠ విజయమున నీలకంఠదీక్షితులు "చింతామణి మయం కిమపి పారమేశ్వరం లింగమ్మని వచించెను,

మఱియు- మణి- యనఁగ శుద్ధస్ఫటికమని గ్రహింపవచ్చును. "శుద్ధస్ఫటిక సంకాశం సూర్యకోటి సమప్రభ" మ్మనియు శుద్ధస్ఫటిక మూర్తయే" యనియుఁబరమేశ్వరుని ధవళ స్వరూపునిగ వర్ణించుచున్నారు. కావునస్ఫాటికవర్ణ విభాసమానుఁడని భావము,

"శ్రీతా భాస్వత్యై రూపయా" అనుస్థలమున దహరాకాశాంత ర్వర్తి-యైజ్యోతిరూపమున వెలుఁగునా శివుఁడు- "పీత"వర్ణరూపముగల వాఁడుఁగా వర్ణించఁబడినను, మెఱుపుతీగతో సాదృశ్యము చెప్పుటచే లను, జ్ఞానస్వరూపము ధవళమే యగుటచేతను "అభాస్వర ముజ్జ్వలతే భాస్వరకమ్మం తేజసి" అనితేజస్సునకు తెలుపురూపము నైన యాయుక్తులు చెప్పుటచేతను- అభాసగా తేజస్సునందు పీతరూపము గనఁబడినను,తత్స్వరూపము ధవళ మేయని చెప్పవలయును.

సీ. పరమమహానంద రూపంబు బ్రహ్మంబని
యేమూర్తిఁ జెప్పుదురెల్ల బుధులు
ఐశ్వర్య మహిమకై యా బ్రహ్మవిష్ణువు
లర్చింతు రేమూర్తి నహరహంబు
మంత్రలయ హఠసమ మూన రాజప్రౌఢి
నొందుదు రేమూర్తి యోగివరులు
తెలియంగ లింగమం దే జగత్స్వాత్మక
ఘనత యేమూర్తికిఁ గలిగియుండు

తే. గీ. నట్టియాది మధ్యాంత శూన్యైకవర్తి
కలిత వేదాంత శాస్త్ర విఖ్యాత మూర్తి
నద్వయ జ్ఞానమయ పరమాత్మమూర్తి
శ్రీమహాలింగమూర్తిఁ గీర్తింతు నెపుడు. ౯౦

శా. లోకంబు నందలి పండితులెల్లరే మూర్తి నానంద స్వరూపంబగు బహ్మమని

ల్కడురో,బ్రహ్మవిష్ణ్వాదిదేవతలే మూర్తినిప్రతిదినము నైశ్వర్య ప్రాప్తికై పూజింతురో, యేమూర్తిని యోగీంద్రులు మనుయోగము- లయయోగము-హఠయోగము- రాజయోగము- అను నాల్గు విధములుగలయోగ మార్గమున నుపాసించి పరశివ సాయుజ్యము నొందుదురో, వేదాదిసమస్తశాస్త్రములు నహోరాత్రములు విచారింపగా, నేమూర్తికిలింగమందే జగంబు సర్వంబును గలద"ను ప్రతిజ్ఞ చేతూరియున్నదో, ఏమూర్తియాదిమధ్యాంతశూన్యమై వెలయుచున్నదో, ఏమూర్తి వేదాంతి ములగు ఉపనిషత్తులందును నాగమోత్తరము లందును బ్రతిపాదింపఁ బడినదో, జ్ఞానమయుండు,పరమాత్మమూర్తియునగు నాలింగమూర్తినే నెప్పుడు కీర్తించెదనని భావము.

వి. శు। అన ంబో బ్రహ్మేతిన్యజానాత్" అను శ్రుతియందు బ్రహ్మస్వరూపమానంద మేయని నిశ్చయింపఁ బడినది.

శ్లో॥ మల్లింగం మస్తకాద్యంగే ధృత్వా శక్ర పురోగమాః। సేసం మాం లింగ మధ్యస్థం ప్రాప్యస్వం స్వం పదం యయుః॥ ఉరస్థ లేహరి ర్లింగం ధృత్వాత్వామూర్ధ్ని పితామహః లింగస్థం మాంస మారాధ్య స్వం స్వం పదమవాపతుః॥ లక్ష్మీ సరస్వతీ ముఖ్యాదేవ్యో మల్లింగ మాదరాత్। ధృత్వాంజాంగే తల్లీన భావా జస్మః పరస్పరం॥ [శంకర సంహిత ౧౫3 అ॥] అనగా- శిరోహృద యాది స్థానములందు దేవేంద్రాది దేవతలు లింగముధరించి పూజించి తమతమ పదవుల పొందిరి- విష్ణుమూర్తి వక్షస్థలమున లింగమును ధరించియు- బ్రహ్మదేవుడు శిరస్సున లింగమును ధరించియు- తమయధి కారముల నొందిరి- లక్ష్మీ సరస్వతీ ప్రముఖులగు సుమతులు గూడ నాలింగమును ధరించి నిరంతర లింగనిలీన మనస్సు గలవారై కామితముల బొందిరని శంకరుడు కుమారస్వామికి వచించిన టుల శంకర సంహిత యందు గలదు.

కావున బ్రహ్మవిష్ణ్వాది దేవత లైశ్వర్య ప్రాప్తికై శంకరుని మతించి నటుల స్పష్టము.

యోగములు మూడని కొందరును నాలుగని కొందరును వచించు దురు, మూడను మతమున లయయోగము- హఠయోగమును రెండును గలసి హఠయోగము నందే గణించఁబడినవి. శివయోగులందరు రాజయోగము నాశ్రయించియే ముక్తి నొందిరి.

శ్లో॥ లీయతే గమ్యతే యత్రయే నసర్వం చరాచరం।
తదేతల్లింగ మిత్యుక్తం లింగతత్త్వ పరాయణైః॥

అనగా- లింగతత్త్వమును తెలిసిన మహాత్ములు- ఈ ప్రపంచ మంతయు దేనివలన

జనించుచున్నదో జనించును లీనమగుచున్నదో, ఆతత్త్వము నే లింగముగా భావించుచున్నా రు. "లింగమధ్యే జగత్సర్వం" సర్వము లింగమునందే గలదని భావము.

మహాలింగము. లింగములు- ఇష్టలింగము- ప్రాణలింగము- భావలింగము నని లింగములు త్రివిధములు- మూడింటిలోను- క్రమముగా నిష్టలింగమునుండి- ఆచార లింగము గురులింగమును, ప్రాణ లింగమునుండి చరలింగ శివలింగములును- భావ లింగమునుండి ప్రసాదలింగ మహాలింగములు నిర్భజించ బడినవి. అన్నియు- మహా లింగాంతర్గతములే, కావునట్టి షల్లింగాంతర్వర్తియైన మహాలింగమూర్తిని పూజించెదనని భావము

తొల్లి దేవ సభయందు బ్రహ్మ విష్ణులు జగత్కర్తృత్వవిషయమై తగవులాడగా నాసభలో నెవరును వారిరువురిలో నెవర ధికులో వచింప జాలక పోయిరి. అంతవారిరువురి మధ్య నొకజ్యోతిర్లింగము దృశించె. సభిక లెవరీజ్యోతిర్లింగము శిరోపాదములు కనుగొందురో వారధికులని తలంచెదమనిరి. బ్రహ్మ హంసవాహనమెక్కి- శిరంబుగనుగొనుటకు విష్ణువు వరాహము నెక్కి- పాదములు కనుగొనుటకు వెళ్లిరి.

కొంతకాలమునకు విష్ణువు దిరిగివచ్చి నేనెంత వరకు వెళ్లినను పాదములు గనుపడవని సత్యము వచించె. బ్రహ్మ కేవుకు వచ్చి నేను శిరంబును గనుగొని యభిషేకము చేసివచ్చితిననియు, అందుకు నీ మొగలిపూవును గామధేనువును సాక్ష్యమని పలికెను.

అంతవారు వాటిని జూచిసత్యమేనా? యని యడుగ నంతకుపూర్వమే బ్రహ్మచేత, నసత్యము చెప్పుటకు ప్రార్థింపబడితిని గనుక మొగలి పువ్వు సత్యమే యనెను. కామధేనువు మొగముతో సత్యమని పలుకుచు, పృష్ఠభాగము నూగించుచు నసత్యమని తెలియజేసెను.

అప్పుడీశ్వరుడు ప్రత్యక్షమై సత్యము చెప్పినందున విష్ణువునకు దేవాలయములు పూజలు నుండునటులను, నసత్యము చెప్పినందున బ్రహ్మకు దేవాలయములుగాని, పూజగాని, లేకుండునటులను, మొగలిపువ్వునకు తనపూజార్హత లేకుండునటులను, కామధేనువు మొగము చూచిన పంచమహా పాతకములు వచ్చునటులను, పృష్ఠము చూచిన ననంతపుణ్యము వచ్చునటులను వచించె. బ్రహ్మతిరిగి ప్రార్థింప యజ్ఞాదులయందు నీకు బ్రథమమున బూజ జరుగునని యనుగ్రహించి పరశివుడంతర్ధానము చెందెను.

కావున బ్రహ్మవిష్ణులకు దెలియని, వాడు గనుక యాదిరహితుడు శూన్యుడని వచింప బడినాడు.

ఈయర్థముసే శంకరాచార్యులవారు శివానందలహరిలో

శ్లో॥ సహస్రంవర్తంతాం జగతి విబుధాః క్షుద్రఫలదాః

సతుక్సేశ స్వక్షే వాసితమనః సరణాం లక్ష్యాతే ఫలతి
హరిబ్రహ్మాదీనామపి కిటభ్రూభాసులభం
చిరంయాచేళం భోశపతివపదాంభో జభజ నం॥ అనియు.

శ్లో॥ కాలీసర్వ నిరంతరావాపపుసం పాదాంబు జాదన్య శే
చక్రికనా దండయా సమస్తజగతాం నాథంతరో దృశ్యసే
మిథ్యా వాచమ పూజ్య మేవపతితం హంసస్వ రూపం నిధిం
తస్మిన్మేహృదయం సుఖేసరమశాంసాంబేపరబ్రహ్మణి అనిస్తోత్రములందునువచించిరి.

అ. పరమేశ్వరుఁ డష్టమూర్తి స్వరూపుఁ డగుటచే, అష్ట మూర్తులలోఁ బై పద్య మున "పరమానంద" అనువాక్యమున నాకాశ తత్వమును- "లింగపుండే బుగంబను వచనమున పృథివీ తనువును, "మంత్రలయు" అను వాక్యమునఁ దేజోమూర్తిని "మహాలింగ" అనుపదమున తదంతర్గత వాయుమూర్తిని వ్యంగముగా నుతించియవశిష్టములగు మూర్తులను నీపద్యమునందు స్ఫుటముగా నుతింపుచున్నాఁడు.

క. ఆపో జ్యోతీ రూపం
బై పర మాత్మ స్వరూప మన బ్రహ్మ మనన్
దీపించుచు సహజంబగు
నాపర శివ లింగ మూర్తి నవిశముఁ దలఁతున్. ౧౧

తా. జ్యోతి రూపుఁడును- జలస్వరూపుఁడునగు నేలింగమూర్తి పరమాత్మయనియు- బ్రహ్మమనియు, వచించుచున్నారో, అట్టిపరశివుని నేనవిశము భజించెద.

వి. ఇచ్చట జ్యోతిరాపు పదంబు సోమసూర్య సోయాజులకు పలకుకము.

అ. కవి గ్రంథరచనా కారణమును నిరూపించుచున్నాఁడు.

వ. అని యివ్విధంబున సగుణ నిర్గుణ తత్వ మహాత్మ్యంబు నంబ రంగు బ్రహ్మంబును ననంత కోటి బ్రహ్మాండ భాండ సముద్భవ స్థితి విలయకారణాది కారణంబును, నిరంత రాంతర్గ త్యాగధాన నిరత పరమయోగీంద్ర మనోదృష్టి నిరీక్షిత నిశ్చలజ్యోతిర్మయాకారంబును సదానందంబునైన శ్రీగురు సదా శివ లింగంబు నస్మదీయాంత రంగంబున భజియించుచు భవత్ప్రసాద లబ్ధ శివ యోగ జ్ఞాన సుఖానుభవ భరిత సహజ నైభవంబున సదా నందంబున్ ......

బొంది యనవద్య యోగ విద్యా విశేష నిరూఢ నిపుణతా నిరూ
ఢుండనై సకల శివయోగి జన మనో హరంబుగా నేసిన్న విషం
బూనిన ధ్యాన యజ్ఞ జ్ఞానయజ్ఞ లక్షణ వాఖ్యానం బెట్టి దనిన.

తా. ఎవఁడనంతకోటిబ్రహ్మాండములసృష్టి - స్థితి - లయములకు గారణుండో, ఎవఁడు సకల నిష్కల స్వరూపంబున వెలుంగు బ్రహ్మరూపంబున వచింపఁ బడు నో, ఎవం డునిరంతరము నంతర్లక్ష్యమునందు నాసక్తి గలిగినవోదృష్టిచేయోగీంద్రులచేఁజూడఁబడుచు జ్యోతిర్మయాకారంబున వెలుంగుచుండునో, అట్టి సదానంద స్వరూపుండగు గురుసదా శివలింగంబును మదీయమానస కమలంబున ధ్యానించుచు, ఓమూక నారాధ్యా! మీయ నుగ్రహము వలన గలిగిన శివయోగ జ్ఞానసుఖము ననుభవించి యానందితుఁడనై సమస్త శివ యోగులు మెచ్చునటుల వచింపబోవు నాగ్రంథారంభమునకు మూలకందములగు ధ్యాన యజ్ఞ జ్ఞానయజ్ఞ స్వరూపంబు వచించెద.

వి, అంతర్లక్ష్యము. మనోబుద్ధి చిత్తాహంకారముల యొక్క వృత్తులను సంకల్పవికల్ప య చంచలతాకర్తవ్యములయందు లక్ష్యముననిలుపుట.

గురుసదా శివలింగమును మదిలోఁ దలంచి " యనుట చేనీశఁడుగురువును, సకలశివనామా కింకరుఁడునగుమూక యారాధ్యునిగాను, త్రిలోక గురువగు పరశివస్వరూపునిగాని, తలంచి నాఁడని భావము.

అ. ధ్యానజ్ఞాన యజ్ఞ ప్రాశస్త్య మునుదెల్పుచున్నాఁడు

ఉ. కొందఱు కర్మ యజ్ఞ సుమ, ఖిల్ మదిఁజూడతపోర తాత్మకుల్
కొంద అలం జప క్రియులు, కొందఱు కొందఱు ధ్యానవైభవా
నందులు జ్ఞాన యజ్ఞ పరి, ణామ సుఖాత్ములు కొంద అెన్నగా.
నందు విశిష్టులైరిగురుదమార్య మతంబున నుత్తమోత్తముల్. ౧౩

తా. "లోకోభిన్నరుచిః" యనులోకోక్తి ప్రకారము లోకంబున ననేకులకు ననే కపదార్థములు - లేక - కార్యములం దిష్టముండును. కొందఱు కర్మాచరణ మే యుక్త మందురు. మఱికొంద ఱు తపఁచే మంచి దందురు " జపాత్కరు జపతో నాస్తి పాతకమ్మని జపము చేసి న పాతకము లేదని గల దుగాన సర్వదాజపముచే యుట యోగ్యమ్మందు రు. మఱొకరు పరమేశ్వర ధ్యానమే ముఖ్యమందురు. కొందఱు జ్ఞాన మేనన్నిటి కన్న మేలందురు. వీటిలోఁ గ్రమముగా నొకదానికం టెయొకటియుత్తమము.

## — * కర్మయజ్ఞస్వరూపము. * —

సీ. కర్మ యజ్ఞము కామ, కామనా రహిత భే
దములను రెండు వి, ధంబు లయ్యె
గామి యథోక్త భో, గ ప్రాప్తిఁ జెందుచు
నిష్కామ కర్మైక, నిరతుఁ డగుచు
నట రుద్ర లోక భో, గానుభవంబు డిగ్గి
మఱి తపో యజ్ఞ సా, మగ్రి మెరసి
తపోభోగ ములఁ బొంది, తన జప ధ్యానము
జ్ఞానస్వరూపుండై ధాత్రి, యందుఁ బుట్టి
తే. గీ. యయ్యుభయ యజ్ఞ విభవ స, మగ్ర మహిమ
వలన వేగమ సుజ్ఞాన, వైభవంబు
గలిగి పరశివ సాయుజ్య, గౌరవమును
బొందు మర్త్యుండు లేదిందు, సందియంబు. ౧౪

తా. కర్మ యజ్ఞము సకామము(కోరికతోఁ జేయుట)అని,నిష్కామము[కోరిక లేకుండఁ జేయుట] అని రెండువిధములు. మొదట కోరికతోఁ ధర్మములనాచరించు కామి మరలనాభోగంబులను భవించి నిష్కామకర్మ సక్తుండగును. పిమ్మట రుద్ర లోకంబుఁ జేరి "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" అను న్యాయమునఁ బుణ్యక్షీణముగాఁ గనే, భూమి కివచ్చి తపస్సులనాచరించి తపోభోగముల జెంది జపధ్యానపరాయణుఁ డగును. ఆజపధ్యాన ప్రభావమున సుజ్ఞానము నొంది దాని వలన నాతఁడు పరశివ సాయుజ్యంబు నొందును. ఇందు కొంత మాత్రము సందియము లేదు.

వి. అందరు యాగాది కర్మ లాచరించిన స్వర్గలోకమునకేగి తత్ఫలము ననుభవించుదురని చెప్పగా, గణపతి యోగిరుద్రలోకమునకేఁ బోదురని చెప్పుట వింగారణమే మన గా, శైవులు శివభక్తులు శివోపాసకులు రుద్రలోకంబునకే వెళ్లుదురనియు,నదదితరులు స్వర్గలోకమునకు వెళ్లుదురనియు సూచించుట యనిభావము

ఆ కర్మయజ్ఞముకన్న ధ్యానజ్ఞానములు సులభములని వచించుచున్నాఁడు.

ఉ. కావున (గర్మ యజ్ఞ మును, గారణ మా సమ్మతా ప్తికి మను
ష్యావలి కెల్ల నైన నది, యుందదు శీఘ్రము నందు ధ్యానమూర్
భావన జ్ఞానవ... భువిన, పార సుఖంబుల నిచ్చుట... నదీ
యా విధ... బు... సుభ, వాంబుధిదాట... శమంబునన్

తా. ఈవిధముగ కర్మాచరణ ము క్రమము. గా మోక్షప్రాప్తి కెల్లరకు, గారణమైన
ను, నామార్గము సులభముగా లభ్యమైనది కాదు. దీనికంటె ధ్యానజ్ఞానయోగములు శీఘ్ర
లో సాచరింప దగినవియు. ఫలప్రదములు నగుటచే మానవులు వాటి నేసు వలంబించిన
సంసార సముద్రమును సరిరకాలములో దాటుదురు.

## — * ధ్యాన యజ్ఞప్రశంస. * —

అ. ధ్యాన మహిమను చెప్పుచున్నారు.

క. పర హింసా దోషాదులు
పొరయవు చిత్త ప్రసాద, మునరు (గుదురు మో
క్షరమా ప్రదమతి శుద్ధము
పర మంబాధ్యాన యజ్ఞ, పదము ల్పంబే. ౧౭

తా. పరహింస లేక పోవుట చేతను, చిత్తంబునకు నిర్మలత నొసంగుట చేతను
మోక్షప్రద మగుట చేతను, ధ్యానయజ్ఞ ప్రభావము సామాన్యము కాదు.

ఆ. వె. వాజ పేయ మఖము, లోజమై శతములు
నశ్వ మేధములు స, హస్రములును
దక్ష్య మరయ నొక్క, ధ్యాన యోగములోని
షోడశాంశమునకు, నీడు గావు. ౧౮

తా. నూరు వాజపేయయాగములు గాని, వేయి యశ్వమేధములు గాని ధ్యా
యోగములోని పదునారవభాగమున కును సమానములు గావు.

తే. గీ. ధ్యాన యోగికి నతిసూక్ష్మ, మైన శివుని
యభి నవాకార మతిసూక్ష్మ, మైచె లంగు

గి. స్వ జనులకు మృచ్ఛిలా, కాష్ఠ ముఖ్య
వరనిమిత స్థూల కల్పిత, ప్రతిమ యట్లు. ౧౯

తా. కర్మయోగులకు శివస్వరూపము స్థూలము లైనమృచ్ఛిలా కాష్ఠాది ప్రతిమలందుగో చరించినటుల ధ్యానయోగికి నతిసూక్ష్మమైన శివాకారము నతిసూక్ష్మముగాఁ గన్పడును.

టి. స్థూల- సూక్ష్మభేద మున శివాకారము ద్వివిధము. స్థూలము మృచ్ఛిలాకాష్ఠాది కల్పితప్రతిమలనియు, సూక్ష్మము. సూక్ష్మ రూపమున దహరాకాశమున వెలింగెడి జ్యోతిరూపమని యభిప్రాయము.

చ. అరుదుగఁ ధ్యాన యజ్ఞరతు, లైన మహాత్ములు మృచ్ఛిలా మయా
విరచిత దేవ మూర్తుల న, తిప్రియ భావనఁ గొల్వ నొల్ల రం
తరమున సద్గురూక్త శివ, తత్త్వ మెఱుంగుటఁ జేసి యాత్మ మం
దిర శివ పూజకుండు వెలి, నిష్క్రియుఁ డైనఁగొరంత యున్నదే. ౨౦

తా. ధ్యానాసక్తులగు- మహనీయులు- గురూపదేశమున లోపల వెలింగెడి శివలింగము ను గాంచినవారగుటచేత, మృచ్ఛిలాది కాష్ఠములచే రచింపఁబడిన ప్రతిమల(విగ్రహము ల) మిక్కిలి ప్రేమతోఁ గొల్వరు. ఆత్మఁ బందిరశివపూజనొనర్చు నట్టిమహాత్ములు ప్రతి మాదులం బూజింపకున్నను లోపము లేదు.

క. ధ్యాన సమమైన తీర్థము
ధ్యాన సమంబైన యుగ్ర, తపము స్మృతిలో
ధ్యాన సమమఖము గలుగదు
గాన శివధ్యాన రతుఁడు, గడుపు న్యాయఁడగుఁ. ౨౦

తా. ధ్యానముతో సమానమైన తీర్థముగాని, ధ్యానముతో సమానమైనతపంబుగాని, ధ్యానముతో సమానమైన యజ్ఞముగాని, లేదు. కావున ధ్యానమున్నిటి కంటె గొప్పది. శివధ్యానము నెప్పుడెవరు చేయుదురో, వారుమహాపుణ్యులు.

క. జ్ఞానంబున ధ్యానంబును
ధ్యానంబున జ్ఞానమును ర, యంబున సగుట
న్యోన్య గుణ పరీతంబులు
గాన సదా ధ్యాన రతుఁడు, గాంచును మొదల౯. ౨౧

తా. జ్ఞానమున ధ్యానమును ధ్యానమున జ్ఞానమును గలుగును. ఈరెండును పరస్పరసంబంధము గలవి, కావున మొదట ధ్యానాసక్తుఁడు కావలయును.

తే. గీ. సకల పాప క్షయంబైన, సజ్జనులకు
ధ్యానమున జ్ఞానమునమరి, యూనినిలుచు
నఖిల పాపోప హత చిత్తు, లైన వారి
కట్టి వార్తయు వినుట న, సహ్యంబు జగతి. ౨౨

తా. మహానుభావులకు ధ్యానమునందును- జ్ఞానము నందును స్థిరబుద్ధి యుండును. పాపసహితులగు వారికి ధ్యానజ్ఞాన వార్తల వినుటయందును నసహ్యము జనించు.

క. సకలోపాధి విముక్తం
బకలంకము సుప్రసన్న, మమి తైకాగ్ర
ప్రకట జ్ఞానము శివయో
గికి నభ్యాసైక శీలికిని సిద్ధించున్. ౨౩

తా. నిర్మలము- సకలపురుషార్థముల కవస్థింపఁ దగినది- దుశ్చకము- నిశ్చలచిత్తంబునను తెలియఁదగినదియునగు జ్ఞానము,నిరంతరాభ్యాస కుశలుఁడగు శివయోగికే సిద్ధించును గానియితరులకు సిద్ధింపదు.

క. జలమయములు తీర్థములని
శిలమృద్వాది కములును వి, శిష్టామరులం
చిలువాని నొల్లరు యతీ
త్ములు శివుఁడాత్మ న్నిజముగ, దోఁచిన పిదపన్. ౨౪

తా. శివుఁడాత్మయందు గన్పట్టినపిదప, జలంబులు తీర్థంబులని, మృచ్ఛిలా కాష్ఠమయంబులగు దైవములు శిలలని తలంచి వానిపూజింపరు. గాని, సర్వముపరమాత్మ స్వరూపమునియే పూజించెదరు.

క. అల్ప జ్ఞానుల కొఱకుం
గల్పించిన ప్రతిమ లవియ, గన నెల్లరు సం
కల్ప పరులు యోగీంద్రులి
నల్పమహిమఁ జెలఁగు శివుని నాత్మనె తక్కన్. ౨౫

తా. యోగీంద్రు లనల్పమహిమా సంపన్నుఁడగు శివుని నాత్మలోపలనే గాంచు చున

గాని, అల్పజ్ఞాన విశిష్టులగు మానవుల కొఱకు గల్పించిన ప్రతిమ లందు గాంచరు.

వి. మాత్ర జ్ఞానమును సూక్ష్మ స్థూలజ్ఞానము కారణము. కావున మొట్టమొదటఅల్ప జ్ఞానుల కొరకు అనగా స్థూలజ్ఞానముగల వారికొరకు గల్పించ బడిన ప్రతిమాదులయందు సూక్ష్మజ్ఞులకు నిష్ఠయుండదు. ఏలయన అవసరము లేదు గనుక వారికి సూక్ష్మమందే దృష్టి యుండును. ఈయర్థమే శంకర సంహిత యందు "అంత ర్లింగాను సంధానే రుచిర్యస్య నజాయతే" అంతర్లింగాను సంధానముగలమహాత్మునకు బాహ్యలింగము నందురుచి తక్కువ గనుండునని వచింపబడినది.

క. సర్వగతు శాంతు శివునిన్
శర్వునిఁ గనఁ గలఁడె జ్ఞానచక్షులు లేకే
యుర్వి నరుఁ డెట్లు సూర్యుని
ఖర్వద్యుతిఁ బుట్టుచీకు గనఁగ నోపఁ గలఁడే. ౨౬

తా. సర్వవ్యాపకుఁడును శాంతుఁడును నగు సర్వేశ్వరుని బుట్టుగ్రుడ్డులు సూర్యునిగన లేనట్లు జ్ఞానచక్షుస్సులు లేనిజనులు గాంచఁ జాలరు.

తే. గీ. సర్వగతుఁడైన శాంతిరూపుని శివుఁ
జూచు నెవ్వఁ డధిక సూక్ష్మబుద్ధి
నతని యాత్మయందె యనవరతంబును
శివుఁడు వెలుఁగు చున్నవాఁడు నిజము. ౨౭

తా. ఎవఁడు సర్వవ్యాపకుఁడగు శివుని నాత్మలో మహాసూక్ష్మబుద్ధిచేజూచునో అతని యాత్మలో శివుఁడుదానే వసించునని భావము.

తే. గీ. విష్ణుఁడా శివుఁడంతటన్ వెలుఁగు బూర్ణుఁ
డై సదానంద మయుఁడయి యతనిసహజ
తత్త్వమెఱుఁగక పాషాణ దారుమయుఁడు
యని కొలుచు వాఁడు శివనిందకుఁ డగునట్లు. ౨౮

తా. సర్వవ్యాపకుఁడగు శివుడు సంపూర్ణుఁడై సదానందరూపుఁడై సర్వత్ర ప్రకాశించు చుండును. అతనిసహజమగు తత్త్వమును గుర్తెఱుఁగక పాషాణమయుఁడు - దారుమయుఁడు అనికొలిచెడి వాఁడు శివనిందకుఁడని భావము.

వి. శివుఁ - రాయి యని - వాఁడు నని కొలుచువాఁడు శివ నిందకుఁడు. కావున ప్రా

రప్రతిష్ఠ జయించినచో నట్టివాఁడు శివస్వరూపుఁడుగనే తలంచవలయునని భావము.

తే. గీ. అల్పబుద్ధులకును బ్రతిమాదులయందుఁ
గర్మ్మలకు నగ్నియందు నుదకంబులందు
సూరిజనులకు నభమున సూర్యునందు
యోగిజనులకు నాత్మయందుఁ దోచు శివుఁడు. ౨౯

తా. అల్పులకు ప్రతిమల యందును, కర్మిష్ఠులకు జలాగ్నులయందును, పండితులకు ఆకాశసూర్యులందును, యోగులకు నాత్మయందును, శివుఁడు ప్రకాశించును.

క. ఆత్మస్థుఁడై వెలుఁగు పర
మాత్ముఁడనఘుఁ యుని శివుని నాత్మను గనలే
కాత్మ పరిజ్ఞానవిరహి
తాత్ములు బాహ్యమునఁ గొల్తు రప్పరమేశున్. ౩౦

తా. ఆత్మయందుండెడి పరశివుని నాత్మ లోపల గాంచలేక యాత్మపరిజ్ఞానములేని మహనీయులు బాహ్యమునందే పరమేశ్వరుని నారాధింతురు.

వి. ఆత్మజ్ఞానము కుదరకున్నను గుడికిఁ బోవని పర్వదినముల లోలులగు మానవుల కంటె నాత్మజ్ఞానము లేని బాహ్యపూజకులే శ్రేష్ఠులని భావము.

ఆ. వె. ఐననేమి వారు లైనను సౌమ్యస్వ
భావులైన, జాలు భవభవముల
నచిరకాలమునను ధ్యానసుజ్ఞాన య
జ్ఞములఁ బరశివుని నిజముగ గంద్రు. ౩౧

తా. బాహ్యమునందు శివునారాధించినను వారు సౌమ్యస్వభావులైనచో జాలును. శీఘ్రకాలములోనే వారు భవసాగరమును దాటి ధ్యానజ్ఞాన యజ్ఞముల ననుష్ఠించి పరశివుని గాంచెదరు.

తే. గీ పూజచేత మహీరాజ్య భూతిగలుగు
నగ్నికార్యంబుచే సిరు లావహిల్లు
జపముచే పాతకము లెల్లనడలు నెపుడు
జ్ఞానమును ధ్యానమును మోక్షసౌఖ్యదములు. ౩౨

తా. శివపూజించుటచే భూమియు- రాజ్యమును- సంపత్తును గలుగును. అగ్నికార్య

ము స్చిన సంపదలు వచ్చును. జపముచే సర్వపాపములు నశించును. జ్ఞానధ్యానముల మోక్షము లభించును.

శివపూజా ఫలము.

వి. యద్ద్వారి మత్తమాతంగాః వాయువేగా స్తురంగమాః। పూర్ణేందు వదనానారీ శివపూజావిధేః ఫలం॥

ఎవని వాకిట యందుమత్త గజము లుండునో, వాయువే గముగలతు రంగము లుండునో, ఎవనికిఁ బూర్ణచంద్రుని బోలు నెమ్మోము గలకాంతా మణి లభించునో, వాఁడు పూర్వజన్మమున శివపూజ చేసిన వాఁడని భావము.

శ్లో. భవనాని మనోజ్ఞాని విభ్రమా భరణస్త్రియః

ధనంచ తృప్తి పర్యంతం శివపూజా విధేః ఫలం॥

తా. సుందర భవనములేమి? విలాసినులగు నారీరత్నములేమి? తృప్తి పర్యంతము ధనముండుట యేమి? ఇదియంతయు శివపూజా ఫలమే.

శ్లో. బ్రహ్మణ స్సృష్టి కర్తృత్వం విష్ణో ర్దానవ మర్దనం

స్వర్గాధిపత్యమింద్రస్య శివపూజా విధేః ఫలం॥

తా. బ్రహ్మకు సృష్టికర్తృత్వమును, విష్ణువుకు దానవసంహారమును, ఇంద్రునికి స్వర్గాధిపత్యము శివుని పూజించుట చేతనే గలిగినవి.

శ్లో సౌభాగ్యం కాంతిమద్రూపంసత్యం త్యాగః ప్రవక్తృతా।

శౌర్యం చజగతి ఖ్యాతిశ్శివ మర్చయతో భవేత్॥

తా. సౌందర్యముగాని, కాంతిగాని, సత్యముగాని, త్యాగముగాని, వాచాలత గాని శౌర్యముగాని, ఖ్యాతి గాని, శివుని పూజించుట వల్లనే గలుగుచున్నది.

(కార్మే)

క. అజ్ఞానముచేఁ బ్రబవిమల

విజ్ఞానము గప్పఁబడినవి విధమున మఱియా

సుజ్ఞాన మింతగలిగిన।

నజ్ఞానం బెంతమైన నంతయు నణఁగుకా. 33

తా. అజ్ఞానముచేతను విజ్ఞాన మెటుల నావరించ బడినదో, అటులే సుజ్ఞానము కొంచెము గలిగినను నజ్ఞానమంతయు నంతము చెందును.

క. సర్యోగతిఁ దమమెల్లను
బ్రభ్యోతమునకు దయమైనఁ బాయుగతిమహో
విఖ్యాతమమును విద్యా
పద్యోతనమునకు దయమైనఁ బాయురయముననె. ౩౪

తా. సూర్యోదయ మైన చీకటి యంతయు (బోవుఁటుల జ్ఞానోదయ మైన నజ్ఞానమంతయు నణగును.

తే. గీ. సరస నీరసములు మహాజ్వలనశిఖల
చేత వేగమ భస్మమౌ భాతిఁ గడఁగి
సఁశుభాశుభకర్మముఁ దృణముగోన
భస్మమౌనట్లు జ్ఞానాగ్ని పర్విబ్బకొనిన. ౩౫

తా. మహాగ్నియందు ఎండుకట్టెలు పచ్చికట్టెలు భస్మమై పోవునటుల జ్ఞానాగ్నియందు శుభాశుభ కర్మలు రెండును తృణములాగ బూడిదె యయిపోవును.

వి. ఇచ్చట శుభా శుభకర్మలు రెండును చెప్పుటకేమి కారణ మనగ, అశుభకర్మ నశించుట యందరికి నిష్టమే శుభకర్మ నశించకుండ నున్నచో దానుచేసిన పుణ్యకర్మకై తిరిగి జన్మించి తద్భోగము ననుభవింపక తీరదు. అప్పుడు తిరిగి యేదియో పాప కృత్య మొనర్పక యుండడు అప్పుడు చేయుపుణ్యపాప కార్యముల వలన మరల మరల జన్మయే చెప్ప టికి వచ్చుచుండును. కాని, తానుముక్తి చెంద నేరడు. శుభా శుభ కర్మలు రెండును నశించుజ్ఞానవంతుడగుచో (దిరిగి జన్మమెత్తడు. కావున నే ప్రతిక స్మాంతమందును-"శ్లో. కాయేనవాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మ నావాప్రకృతే స్వభావాత్। కరోమి యద్య త్సకలం పర స్మై సదాశివాయేతి సమర్పయామి.

శ్లో. ఆకాశాత్పతి తంతోయం యథా గచ్ఛతి సాగరం। సర్వదేవ నమస్కారః శ్రీకేశవం ప్రతిగచ్ఛతి- అనియు నీశ్వరార్పితము చేయబడు చున్నది.

క. జ్ఞానము ప్రభవించిన మఱి
తానెవ్వరియు మాయయుఁడియఁ దాకక్షనంబా
నేనాఁట నైననట్లను
హీనల కార్పాసములకు నైక్యముగలదే. ౩౬

తా. అగ్నియందు దూది నశించునటుల జ్ఞానముకలిగిన మాయ దానియందే నశించునో

క. సవిషయ నిర్విషయముల న
ద్వివిధంబగు నంద్రు ధ్యాన విధిసవిషయ మా
ప్రవిమల సాకారాశ్రయ
మవలన్ని ర్విషయ మగుని రాకార మొగిన్. ౪౩

తా. సగుణ స్వరూప ధ్యానము సవిషయ మనియు, నిర్గుణస్వరూపధ్యానము నిర్విష యమనియు ధ్యానము మరలరెండు విధములు.

క. ఈజగతి నిదియకావెస
బీజము నిర్బీజ మనెడి వేళ్లందగు ని
ర్బీజాశ్రయ పూర్వమున స
బీజము జింతింప వలయు బ్రుధు భావమునన్. ౪౪

తా. మఱియు నీధ్యానమునకు నిర్బీజమని సబీజమని రెండు నామములు గలవు సబీజమన సాకారము నిర్బీజమనని రాకారము. నిర్గుణతత్వ పరిజ్ఞానమునకు సగుణోపాసనము కారణము గనుక, మొదట మానవులు సగుణారాధ నమొనర్చ వలెను.

క. విషయాకార స్థితిని
ర్విషయ నిరాకార సిద్ధి వెసఁగల్గునక
ల్మష ఘృతమున దనుజూచు పు
రుషునకు నదిచేర తనదు రూపము చెడదే. ౪౫

తా. సవిషయమున- (సాకార మగు శివారాధ నమున) నిర్విష యమునిరా కారము నగు పరశివ స్వరూపము త్వరలో గోచరించును. నిర్మల మగు నాజ్యంబునం దనను జూచు వానికి తనరూపము చెడిపోవదా?

వ. కావున. ౪౬

అ. శివయోగి స్వరూపమును బోధించు చున్నాఁడు.

సీ. ధ్యానంబు మదిలోన నూనిన గర్మ ఫ
లత్యాగ బుద్ధిమొల్లన జనించు
గర్మఫల త్యాగ కారణంబున జేసి
యంతంత మతిశాంతి మావహిల్లు

శాంతంబు కతమునఁ సకల భూతదయయు
సకల మిత్రతయునుఁ సంభవించు
ధృతి సర్వభూత మైత్రిత్వంబు ననుమమ
తాహంకృతులుఁ రెండు నణగిపోవు
తే. గీ. నట్టివెంత సుఖదుఃఖంబుఁ లధిగమించు
నేని నీరెండు సమముగ నెపదఁ దలఁచి
సంశయము మానిఁ సంతతోత్సాహలీల
నుండు నాతండ యగుఁ శివయోగి వరుఁడు. ౪౭

తా. శివధ్యానము వలనఁ దానుచేయు కర్మల ఫలము శివార్పణముగా వదిలిపెట్టు వలయునను బుద్ధిజనించును. ఎప్పుడుకర్మ ఫలమును త్యజించునో, అప్పుడు శాంతముగుదు రును. శాంతము వలన సకలప్రాణుల యందుదయయు, అన్నిటియందు మిత్రత్వముగుదును. ఎప్పుడు సకలభూతములందు మైత్రిగలిగినదో, అప్పుడు మమత్వము (నాది నావాడు అనుమాట) అహంకారము రెండునుసణగి పోవును. మమతాహంకార శూన్యుడైన వాడు సుఖదుఃఖములు ప్రాప్తించిన రెంటిని సమానముగా దలంచు. సంశయము లేక సంతత ముత్సాహమున నుండెడి యామహాను భావుడే శివయోగియనం బడును.

క. వెలుపలి కొలువుఁ పునసఁడకుచు
గొలుచు భటులలోన ఁజేసిఁ కొలుచు భటులయం
తలఁఫల భోక్తలె నృపగృహ
ముల యట్లవయధిక ఫలఁ ముబొందరు కర్మల్. ౪౮

తా. రాజగృహములందు- సభయందు నూడిగము చేయువారు లోని భటుల వోలె ఫలంబధికము గననుభవించని యాటుల కర్మపలు మిక్కిలి ఫలమును బొందఁజాలరు.

వ. అట్లుగాక. ౪౯

క. వెలిఁగొలుచు వారు లోనగా
మెలఁగెడి యనుచరుఁ లయంతనిజ భృత్యులె భూ
తలపతికి బాహ్య పూజకు
నిలలో ధ్యానరతులంతఁ హితులె శివునకున్, ౫౦

తా. సభయందు వెలుపల సేవించెడి రాజభటులు- లోపల సంచరించు భటుల లో

తెరఁగున కెటుల విశ్వాస పాత్రులు కారో, అటులే పుష్ప, ప్రతిమాదుల నొనర్చెడి వారు ధ్యానము సేయువారి ప్రోలె విశ్వాసపాత్రులు కాజాలరు.

తే. గీ. ద్వాదశాంతము నందు మూర్ధమున నుదుట
బాహుల నడుమను నాసాగ్రమున ముఖమున
మెడ హృదయమున నాభిని నడుమ నెపుడు
వార్చనము సేయనగు బహిర్యాగ సరణి. ౫౧

తా. తాను బాహ్యమందిష్టమును బూజించు నటుల లోపల శివ లింగమును, ద్వాదశాంతమందు (బ్రహ్మరంధ్రమునందు) శిరస్సునందు భ్రూమధ్యమునందు (ఆజ్ఞా చక్రమందు) నాసాగ్రమునందు- హృదయమునందు- నాభియందును, బూజింప వలయును.

క. అటు సేయ నోపనిఁగదా
స్ఫటికాది కలింగమూర్తి సత్కౌతుక వి
స్ఫుట వహ్ని స్థండిల జల
ఘటిత శివుని భక్తి యుక్తి గనిగొల్చు టిలన్. ౫౨

తా. అటుల భావప్రాణలింగోపాసన లొనర్పుటకు శక్తి చాలకయే, స్ఫటిక-బాణమూర్తులధరించి కొందఱును, పీఠమందుంచి కొందరును, శివస్వరూపమగు వహ్నిని కొందరును, స్థండిలము నందు మఱి కొందఱును, జలములందు మఱికొందఱును, ననేక రీతుల నుపాసించుచున్నారు. ప్రాణ లింగోపాసనమున కిష్టలింగోపాసనము సాధనమగుటచే ననేకులు శివలింగోపాసనమునే చేయుచున్నారు.

ఆ. వె. అట్లయగుట శివుని నభ్యంతర ద్రవ్య
వైభవమున జేయ వలయు బూజ
యందుఁ గాని శివుని కతితృప్తి గానేర
దెందు నదియు నెట్టి చందమునన. ౫౩

తా. కావున, నభ్యంతర ద్రవ్యములచే నీశ్వరుని బూజించిన గాని, యాతఁడు మిక్కిలి తృప్తి చెందనేరఁడు.

క. అతులిత శివతత్త్వ స్థితి
మతిలోఁ దెలియంగ నేర్చి మానస పూజా
గతి శివుఁ జేరి భజించెడు

చతురుననర్గ భోగ మోక్ష సౌఖ్యము లరుదే. ౫౪

తా. శివ తత్త్వమును మదిలోఁ గాంచి మానసపూజఁ జేయు వారికి భోగమోక్షము లు గలుగుట యబ్బురమా?

క. పరమార్థ జ్ఞాను లగుచు
నిరతిశయానందు లగునమల నీషిజనుల చేఁ
బరువడి నిర్ణీతం బగు
పరతత్త్వము శివుఁడ యగునఘ పాప విభూతిన్. ౫౫

తా. పరమార్థజ్ఞానము గలిగిన, విద్వాంసులచే నిర్ణయించ బడిన పరతత్త్వము శివుఁడే యని భావము.

## ప్రపంచసృష్టి.



వ. అట్టి శివుండు సర్వదేవ మయుండును సర్వజ్ఞాన మయుండును, సర్వతేజో మయుండును. సర్వతత్త్వోత్తముండునునై మాయాసమేతుం డగుచు సకల రూపంబునం బ్రకాశించు చుండు. నెండియు నప్పరమేశ్వరుండు పరమ పురుషు గేవల నిష్కళుండును, అస్తి నాస్తి ద్వయాతీతుండును, అవాఙ్మానస గోచరుండును, వర్ణుండును నవర్ణ యుక్తుండును, మాయా మయుండును, రూపరహితుండును, విశ్వరూపధరుండును, బరమాత్ముండును, బరబ్రహ్మంబును, గావున నిట్టి పరశివుని వలనఁ బరాశక్తి గలిగి తచ్ఛివాజ్ఞా వశంబున నపరిమేయ గుణసమన్వితయై విజృంభించు చుండు నదియుడుం గాక.

తా. ఏ మహానుభావుఁడు సర్వదేవస్వరూపుఁడో, సర్వభూత స్వరూపుఁడో, సర్వజ్ఞానస్వరూపుఁడో, సర్వానంద స్వరూపుఁడో, మాయా సహితుఁడై ప్రకాశించునో, అట్టి పరతత్త్వము శివుండేయని చెలప్పనగు యును.

అతఁడు సకలనిష్కల రూపధారి. విశ్వరూపధారి. సగుణ నిర్గుణ స్వరూపుఁడు.గనుక యట్టి పరశివుని వలనఁబరాశక్తి పుట్టును. ఆశక్తియు శివునియనుమతి వలన, గుణసహితయై విజృంభించు చుండు.

ఆ. ప్రపంచోత్పత్తిని బ్రతిపాదించు చున్నాఁడు.

ఉ. మేదిని తోయపావక సమీరణముల్ గగనంబనాఁగనీ
మైనునుదానమై పలుమరు తత్త్వముఁ గైకొని బ్రహ్మమూర్తియౌ
నాదిమశక్తి పెంపెసఁగురీ నారయ నాపరశక్తి చేతను
త్పాదితమయ్యెనద్భుతవిశేషంబౌలయంగఁ బ్రపంచమింతయుఁగా. ౧౭

తా. పృథివీజల తేజోవాయ్వాకాశ ములనుపంచ భూతములు తానెయయి మహిమహిమచే వెలిఁగెడి బ్రహ్మమూర్తి యయిన పరాశక్తి చేతనే యీప్రపంచం బంతయుఁబుట్టింపబడినది.

సీ. ఆది నాకాశంబునం దునుండును సదా
శివుఁడవ్యయుఁడు సదాశివుని వలన
సంభూతుఁడై మహేశ్వరుఁడు వాయువునందు
వసియించి యుండునీశ్వరుని వలనఁ
బ్రభవించి రుద్రుండు పావకునందుని
మ్ముల నుండు మఱిరుద్రమూర్తివలన
జనితుఁడై విష్ణుండు సకలతత్త్వంబున
విలసిల్లు చుండు నవ్విష్ణువలన

ఆ. వె. నుద్భవించి బ్రహ్మ యుర్విస్థితాత్మ కుం
డై వెలుంగు చుండు నాసబాళి
వారలైన మూర్తు లైదును బరశక్తి
తనువు లగుచు నుండు నగువిధమున. ౧౮

తా. ఆకాశంబున సదాశివుఁడుండును. వాయువునందు సదాశివుని వలన జన్మించి మహేశ్వరుండుండును. ఈశ్వరోత్పన్నుఁడగు రుద్రుండగ్నియందు బ్రకాశించును. రుద్రునివలనబుట్టిన విష్ణువుజలంబు లందుండును. విష్ణువలన నుదయించిన బ్రహ్మ భూమియందుండును. కాన సదాశివ- మహేశ్వర- రుద్ర- విష్ణు- బ్రహ్మలు- పరశక్తిశరీరము లగుచుఁ దగినరీతి నివసించుదురు.

వ. బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివుల యందు నివృత్తిప్రతిష్ఠ విద్యాశాం

తి శాంత్యతీత కళలుండు. ఇట్టి బ్రహ్మాదులేవురు సత్త్వోత్తరాధిక్య విశేషంబున బ్రకాశించుచు శివజ్ఞాన నియమితులై వర్తించు చుందురు. బ్రహ్మ వలన దేవతలును. దైత్యులును, మునీంద్రు లును స్వేచ్ఛ జాండజ స్వేదజ వాయుజ జరాయుజంబులును, దృణగుల్మ లతావృక్షాదు లైనయుద్భిజ్జ కోట్లును, గిరిసరి త్సముద్ర సరో వరంబులును, గ్రమంబునం బుట్టుచుండు నట్లుగావున. ౧౯

తా. బ్రహ్మ యందునివృత్తి కళయు- విష్ణువునందు బ్రతిష్ఠాకళయు, రుద్రు నందు విద్యాకళయు, మహేశ్వరునందు శాంతికళయు- సదాశివునందు శాంత్యతీత కళయును— బ్రతిష్ఠించ బడినవి. బ్రహ్మాదులలోసత్త్వోత్తరమగు నధికులు. శివాజ్ఞానియమితులైయుందురు. దేవతలు- దైత్యులు- మునీంద్రులు- మనువులు- స్వేచ్ఛజములు- అండ జములు- స్వేదజములు- వాయుజములు- జరాయు జములు- తృణ ములు- పొదలు- తీగెలు- మొదలగు నవియు, బర్వతములు- సరస్సులు- సముద్రములు- అన్నియుగ్రమమున- బ్రహ్మవలన నేపుట్టు చుండును.

క. అగణిత ములైనట్టి బ్రహ్మం
డ గణంబుల తోడసంఘటన వైచిత్రం
బగు విధమున గలిగిన యీ
జగమెల్లను శివమయంబ చర్చింపంగన్. ౨౦

తా. అనంత బ్రహ్మండములతో గూడి విచిత్రముగా నున్న నీజగంబంతయు విచారింపంగా శివస్వరూపమే.

ఉ. ఆపరమేశ్వరుం శివునిఁ నగ్నిదివాకర చంద్రమండల
స్థాపిత చిత్స్వరూపు విలసత్సద్గుణు నాథ కృపావలోకనో
ద్దీపిత నిర్మలాత్ముఁడయి ధీగతినెవ్వఁ డెఱింగి నేర్పుమై
నోపి భజించు చుండునతఁడొందు ననుంతిత మోక్షసౌఖ్యముల్. ౨౧

తా. సూర్యచంద్రాగ్ని మండలస్థిత చిత్స్వరూపుఁడై వెలుంగు నాపరమేశ్వరుని, సద్గురూప శేషము నొంది నిర్మలుఁడై యెవఁడు ధ్యానించుదురో, వారచిర కాలంబుననే మోక్ష సుఖంబు నొందుదురు.

వి. సూర్యచంద్రాగ్ని మండలములనగ- ఆకార హకార బిందువులు.

అ.సగు ణారాధన ప్రాశస్త్యమును జెప్పుచున్నాఁడు.

క. సగుణంబు నిర్గుణంబనఁ
దగిన శివజ్ఞానము ద్వివిధంబగు మొదలన్
సగుణంబు నాశ్రయించుచు
నగుణంబున్ మఱిభజింపు నౌచిత్య మగున్. ౬౨

తా. సగుణమని నిర్గుణమని శివయోగము ద్వివిధము. మొదట సగుణమును పూజింపుచు- నిర్గుణమును ధ్యానించవలెను. అనగా సగుణారాధనము లేకయాత్మ జ్యోతిని గనుగొనలేడని భావము.

చ. సగుణము పెక్కుభంగులఁ బ్రశస్తమగున్ బహిరంత రంగసా
మ్య గతుల గోచరం బగుచు నవ్వల నిర్గుణ మింద్రియాద్య గ
మ్య గరిమ నంతరిక్షు సమమై తనరున్ గురువక్త్ర మందు నీ
సగుణ విధంబు నిర్గుణము చందము నేర్పడ నుండుగావునన్. ౬౩

తా. ఎన్నివిధముల నాలోచించినను, సగుణారాధనము ననేకవిధములఁ బ్రశస్తమైనది. బహిరంతరింద్రియములకుఁ గోచరమైనది. నిర్గుణము- ఇంద్రియాతీతమయ్యును, అంతరిక్షసదృశమయ్యును బ్రకాశించును. గురుముఖమున సగుణ నిర్గుణ ధ్యాన ప్రకారము గుర్తెరుగ వలయును.

## — * గురు మహిమ * —



మ. శివవిజ్ఞాన శివైక భక్తి శివహృచ్చింతా పరత్వంబులున్
శివసమ్యగ్వ్రతమును శివార్చనము నాఁ జెప్పంగ శృత్యుక్తి పం
చవిధోద్యచ్ఛివ యోగపూర్వక చతుస్సక్రియతా భ్యాసయో
గవిశుద్ధాత్ము గురుండలంపడగు సాక్షాదీశ్వరుంగా మదిన్. ౬౪

తా. సాధకుఁడు శివజ్ఞానము- శివభక్తి - శివధ్యాన పరత్వము- శివలింగార్చనము. అనుపంచ విధములగు శివయోగముల మొదటఁ జేయుచు, నాల్గు యోగములచేఁ బరిశుద్ధాత్ముఁడై మనస్సునందు దన గురువునే సాక్షాదీశ్వరునిగఁదలంచవలెను.

క. మోక్షానందము బొంద న
పేక్షించిన విమల జనులకెల్లం గరుణా

వీక్షణ శోభిత గురువరు
దీక్షితిలోఁ బూజనీయుఁ డేకాలంబున్. ౬౫

తా. మోక్షము నొందఁ దలచిన ప్రతిమానవునికిని సకలాపదలయందును గురువే యెల్లప్పుడు పూజింపఁ దగినవాఁడు.

తే. గీ. ఆయురారోగ్య భాగ్యవిద్యామహత్వ
చిరతరైశ్వర్య కీర్తులశేష పుణ్య
సంపదలు స్వర్గసుఖము మోక్షంబు నేల
కలుగు గురునాథు నెఱుఁగనికష్టమతికి. ౬౬

తా. గురుని నెఱుంగని హీనునకు- ఆయువుగాని, ఆరోగ్యము గాని, భాగ్యము గాని, విద్యగాని, కీర్తిగాని, పుణ్యముగాని, మోక్షము గాని, కలుగనేరదు.

చ. కనుగొన సత్ప్రకాశ నవిరళ్ దీపిత చారుగుణోక్తులక్షణా
ఢ్యుని సకలార్థ వేదమహిమోన్నతు నార్యుని శ్రీగురుప్రభున్
మనమున వాక్కున న్గ్రియను నారతముం శివుఁబోలె భక్తిఁ బూ
జన మొనరింప గానలయు సజ్జనులెంతయు సంతసంబునన్. ౬౭

తా. కావున సజ్జనులెల్లప్పుడును, గుణశీల సహితుండును, మహిమాశాలియు, అఖిలశాస్త్రజ్ఞుండును, దక్షిణామూర్తి- అఘోర- పంచాక్షరీ- శరభ సాళ్వ- శరభ కాళీ- దుర్గా- దిమంత్రోపాసకుండును, పాశుపతవ్రతధారియు నగు గురువును, మనోవాక్కాయ కర్మలందు శివునివలె భక్తిశ్రద్ధలు గలిగి పూజింపవలెను.

క. గురుముఖమున దీక్షితుఁడై
నరుఁడు ధరిత్రీ తలంబున శివాశ్రితుఁడై
చరియించు నెవ్వఁడతనికి
సిరవొందఁగ సుస్థిరంబులిహపరసుఖముల్. ౬౮

తా. ఎవఁడు గురువువలన దీక్షనుబొంది విధిపూర్వకముగా శివునిబూజించునో, అతని కిహపర సుఖములు కరతలామలకములు.

వి. ఇచ్చట దీక్షయనఁగా సత్యోత్తమమగు పాశుపతవ్రత దీక్ష యేయని తెలిసికొనవలయును. పాశుపతవ్రతదీక్ష యన భస్మరుద్రాక్ష లింగధారణాత్మక మగుదీక్షను గ్రహింపవలెను.

శ్లో. దీయతే లింగ సంబంధః క్షీయతే చ మలత్రయం।
దీయతే క్షీయతే యస్మాత్ సా దీక్షేతి నిగద్యతే॥

మలత్రయమునశింప జేసి లింగ సంబంధము గల్పింప బడుటచే దీక్షయని చెప్పఁ బడును.

క. శివుఁడన (బర)గు గురుఁడా
శివుఁడు గురుఁడనఁగ (బర)గుఁ శివగురువులకున్
వివరింప లేదు భేదము
శివఁగురువుల తోడఁ దుల్య శివవిద్య మహిన్. ౧౯

తా. శివుఁడే గురువనియు, గురువే శివుఁడని యుఁ జెప్పఁ బడును. శివగురులకు భేదము లేదు. శివగురులతో సమానమైనది. శివవిద్యయే గాని మఱొకటి లేదు.

క. శివభక్తిని గురుభక్తిని
శివవిద్యాభక్తి నతివిచిత్రముగ సమం
బవుఫలము (గురుఁడు హరుఁడై
భవ పాశము ద్రెంచి వైచుఁ బటు వేగమునన్. ౨౦

తా. శివభక్తి గాని, గురుభక్తిగాని, శివ విద్యా భక్తిగాని కలిగిన ఫలము సమానమే-సంభవించును, గురువే శివుఁడై శిష్యుని సంసార పాశమును ద్రెంచివేయును.

క. పశుపతి శివుఁడట్లగుటం
బశుపతి యగు శ్రీగురుండు భావింపంగా
బశుపతి నామము ప్రకటము
పశుజీవుఁడు గురునియాజ్ఞ, భరియింపఁ దగున్. ౨౧

తా. శివుఁడెటులఁ బశుపతియో, అటులే గురుఁడుకూడ బశుపతియే. జీవుఁడు పశువుగనుక తదధిపతియగు గురుని యాజ్ఞ శిష్యుఁడు శిరసా వహించ వలయును.

వి. "బ్రహ్మాదిస్థావరాంతాశ్చ పశవః పరికీర్తితాః" అనఁగా బ్రహ్మ మొదలు కొని— స్థావరాంతముల వరకునుండెడి ప్రాణిజాల మంతయుఁ బశువులని వ్యవహరింపఁ బడును. వాటికి అధిపతిగాగ పశుపతి యనివచింపఁ బడును.

వ. మఱియు నిరాకారంబును- నిరాలంబంబును- నిర్మలంబును- నిర్వికల్పంబును- నిర్గుణంబును- నిశ్చలంబును- నిత్యత్వంబును- బరమ

పదంబును- నాకారాభేయసందిష్టంబును- వాద్యంతరహితంబును
నవాఙ్మానస గోచరంబును- నైనపరశివ తత్త్వంబు గురుండగుంగా
వున గురుమూర్తియందు శివభావంబును శివమూర్తియందు గురు
భావంబును లేనిమూఢులకు గుంభీపాతకంబు సంప్రాప్తం బగును.
ఇందుకు సంశయంబు లేదు. గురుదేవ మహాదేవుల నేకీభావంబున
భావించి గురుభక్తులైన మహాత్ములు మూడు లోకముల యందు
బూజ్యులై యుండుదురు. సాక్షాచ్ఛివుండు గాసిగురుండన్యుండు గా
డు. సచరాచరంబైన త్రైలోక్యంబును శ్రీగురు పాదపద్మంబుల
దుండు. తదీయాంగుష్ఠముల యందశేషంబు లైనసకల తీర్థంబులు
ను గుల్ఫంబుల సతుత్రి ప్రవాహ సమూహంబులును బాహ్యార్థంబున స
ప్త సముద్రంబులును దదర్థంబున గులపర్వతంబులును జంఘలయం
దు షట్త్రింశ త్తత్త్వంబులు నుండుటం జేసి పరమ కారణుండైన గు
రునాథుండు కీర్తిసి యుండును సర్వజ్ఞుండునై శివుండవోలె సర్వ
లోకగురుండై యుండు. ఇట్టిమహాను భావుండైన గురుప్రభునిచేతం
గదా దీక్షాప్రతిష్ఠాదికృత్యంబులు సఫలంబగు మండును. భోగమో
క్షార్థులకు ద్రిసంధ్యంబును గుర్వర్చనంబు గర్తవ్యంబు. ౭౩

తా. ఇంతియు గాక, నిర్గుణము- నిరాకారము- నిర్మలము- నిశ్చలము- పరిపూర్ణ
ము- అవాఙ్మాన సగోచరము- నగు పరశివ తత్త్వంబే గురువు. గురుమూర్తి యందు శివ
భావములేని మూర్ఖులు- కుంభీ పాతక మను నరకమును బొందుదురు. గురుభక్తులు త్రిలోక
పూజ్యులగుదురు. ఆగురు మూర్తి పాదపద్మంబులందిలోకంబులును, బొటన వ్రేళ్లయందు
సర్వతీర్థంబులును, గుల్ఫ ముల యందు సతుత్రి ప్రవాస మూహంబును, పాదార్థ మునస ప్త
సముద్రములు- మిగిలిన యర్థభాగంబున గులపర్వతంబులు- పిక్కలయందు- ముప్పదియా
రు తత్త్వంబులును నుండుట వలననాతడు శివుని బోలె త్రిలోక సంచారియై పూజనీయుం
డైయుండును. ఎవరుభోగమోక్షంబుల గాంక్షించు చున్నారో వారుత్రిసంధ్యల యందును త
ప్పక గురుపూజచేయ వలయును ఇట్టిమహనీయుని చేత దీక్షాభిషేకప్రతిష్ఠాదికము లేమి?
ప్రతిష్ఠాది కృత్యము లేమి?లోకాస్తిత్వము గాజనుప బరచుచున్నను.

తే. గీ. శిక్షణీయుండు గాఁబట్టి శిష్యుఁడయ్యె
గరిమ గురుఁడయ్యె గౌరవకారణమున
నట్లుగావున సర్వప్రకారయత్నములను
నర్పఁదగు గౌరవము గురునకుఁ బ్రియమున. ౨౩

తా. శిక్షింపఁ దగినవాఁడు గావున శిష్యుఁడనియు గౌరవార్హుఁడు గనుక గురువని యుపచరింపఁ బడును కావున నన్ని విధములను గురువు పూజనీయుఁడు.

చ. వినయము సత్యమున్ ఘనవివేకము నుత్తమశీలమున్ శమం
బును దనయందుఁ గ్రందుకొనఁ బొందుగ శిష్యుఁడు శ్రీగురుప్రభుం
గొనకొని సేవఁజేయఁగ దగున్ గుణ "నగురోరధికం" బనంగనీ
యనుపమవాక్యమెంతయుఁ బ్రియంబుగ నాత్మఁదిశంబు సేయుచున్

తా. శిష్యుఁడెల్లప్పుడు" నగురోరధికం నగురోరధికం... శివశాసన తశ్శివశాసనతః" అను గీతావాక్యంబును హృదయంబున స్థిరపరుచుకొని, వినయము వివేకము- సత్స్వభావము- శాంతియును గలిగి సర్వదా శిష్యుఁడు గురువుని సేవించవలెను.

తే. గీ. పరగ "నాస్తి తత్త్వం గురోః పర"మనంగఁ
బరమపరుఁడగు శ్రీగురుప్రభునికంటెఁ
బరము నాఁదగు తత్త్వమేభంగి లేదు
గాన గురుసేవఁబోలవే కర్మములును. ౨౪

తా. "నాస్తి తత్త్వం గురోః పర"మ్మని గురువుకంటె మించిన తత్త్వము లేదు. గనుక గురువునే సేవింపవలయును. యాగాది కర్మలెన్ని యొనర్చిన గురుసేవకు నణుమాత్రమును బోలవు.

సీ. కాలత్రయంబునఁ గాలద్వయమునైన
నను గాలమొకటనైన ననుగురూక్త
మార్గ మేమఱక సమంచితభక్తి సం
పూర్ణస్వభావుఁడై బుధజనుండు
పరమేశుఁ బరమాత్ముఁ బరమపావనమూర్తిఁ
జిన్మయు శివునిఁ బూజింపవలయు

దచ్చివార్చనము సం॥ తర్యాగమన బహి
ర్యాగ విధానము॥ నన౽గ రెండు
తే. గీ. విధములై యొప్పు మూడు భా॥ వించి చూడ
నందులో ముఖ్య మభ్యంత॥ రార్చనంబు
విమల బాహ్యార్చనల నది॥ వృద్ధిబొందు
నాచరింతురు సురమునీం॥ ద్రాదు లిదియ.  ౭౬

తా. మూడు కాలము లందుఁగాని, రెండు కాలము లందుగాని, ఏక కాల మందు గాని, గురువు చెప్పిన మార్గమునుమరువక సత్వ్భావులై మానవులు భక్తితోచిన్మయమూర్తి యగు నాపరమేశ్వరుని బూజింప వలయు. శివపూజ "అంత ర్యాగమని" "బహిర్యాగ మని" రెండు విధములు. బాహ్యలిం గార్చనము కంటె నంతర్లిం గార్చనమే శ్రేష్ఠము. ఆ లింగోపాసనయు- ఇష్ట లింగార్చనమున గాని, యభివృద్ధిఁ జెంద నేరదు. మునీంద్రులందఱీమార్గము నే యనుసరించిరి దేవతలెల్లరు నీత్రోవే త్రొక్కిరి.

శా. శాంతాకారుని నాత్మసంస్థితు శివుఁ॥ సత్కాంతి సంపన్ను న
శ్రాంతంబుఁ దమయాత్మలో సుజను॥ లారాధింతురయ్యాశివ
య్యంతర్యాగ విహీను లల్పమతుల్॥ య్యద్బాహ్యకర్మైక వి
భ్రాంతుల్ బాహ్యమునందకొల్తురధిక॥ ప్రాయాసముం బొందుచున్

తా. ఆత్మ సంస్థితుఁడు- శాంతరూపుఁడు- సద్వాసి ముల్లువలె వెలింగెడి యాపరతత్వమును సుజను లాత్మ యందే యారాధింతురు. అంతరమున లింగోపాసనముచేయఁజాలని వారధిక ప్రయాసమున బాహ్యమందే లింగము నర్చింతురని భావము

క. పలుదెఱఁగుల (బ్రతిమల యం
దిల వెలిఁబూజించు కంటె॥ హృదయాబ్జము లో
పల వెలుగుచున్న శివుఁబిం
గొలుచుట మిక్కిలి ఫలంబు॥ గుసు దక్షముగాన్.  ౭౭

తా. బాహ్యమున పలువిధములగు విగ్రహములందు బూజించుట కన్న యంతరంగమునఁ బ్రకాశించు శివునిగొలుచుట యుత్తమము. ఫలప్రాప్తి హేతువు.

సీ. శివధర్మకందంబు॥ శివమయంబైన సు
జ్ఞాననాళంబు నైశ్వర్య నివహా

మొనసి యష్టదళంబులే యును సుధాకరసమ
వర్ణంబు వైరాగ్యకర్ణికయును
భాసుర శ్రీరుద్రకేసరంబులు గల్గి
హృదయ పద్మంబు సొంపెసఁగనున్న
యట్లుగా భావించి యామధ్యమంబున
సమధిక దివ్యతేజంబు మెఱయ
తే. గీ. నగ్నిసూర్యేందు మండలాభ్యంతరస్థు
గామహాదేవుఁ జిన్మయాకారుని భవ్యుఁ
ద్రివిధకారణ కారణుఁ ద్రిమలహరణు
శివునిఁ గడుభక్తి ధ్యానంబు చేయవలయు. ౨౯

తా. శివధర్మ రూపము- శివమయము- సుజ్ఞానసాకము- ఐశ్వర్యాది మహిమలైన యష్ట దళములు- [ఎనిమిది రేకులు] గలిగి పున్నమ చందురుని బోలు కాంతి గలిగి వైరాగ్యమనెడి కర్ణిక [దుద్దు] గలిగి రుద్రుఁడే- కేసరములు (కింజల్కములు) గాగలిగి యున్నటుల హృదయ పద్మమును భావించి, అందు దివ్యతేజంబున వెలింగెడి యగ్నిసూర్యేందు మండలము లోపలయున్న చిన్మయ స్వరూపుని- త్రిమలహరణ సమర్థుని- త్రివిధ కారణములకు కారణమైన వానిని, మహాదేవుని మిక్కిలిభక్తితో ధ్యానింప వలెను.

• త్రిమలములు- అనగా

ఆణవ- కార్మిక- మాయిక మల ములు. శివ విషయ కజ్ఞానము కలిగి నపుడు అజ్ఞాన మును గప్పివేయునది ఆణవ మలము. వేదాంత విషయములను పెద్దలు బోధించుచుండగా,వినుటకు పోనీయనిది కార్మికమలము. శివవిషయిక జ్ఞానమును గాని, భక్తిని గాని, ఎప్పుడు కలుగకుండ జేయునది మాయిక మలము. ఇవి గాక- మాయేయ- తిరోధాన మలములను గలిపి ఐదింటిగ నెంచుగలరు. మాయేయ మలమనగా పాప కార్యములందు మనస్సును ప్రవేశ పెట్టునది. మాయేయ మలమనియు నిత్యసత్య పరిపూర్ణ పరబ్రహ్మ యగు పరశివుని యందనిత్య బుద్ధిగలిగించి తదితర పదార్థములందు సత్యబుద్ధిని జనింపఁజేసి జనన మరణాదికములననుభవింప జేయునది తిరోధాన మలమన బడును. ఆణవ- కార్మిక- మాయిక- మలములు మూడును, మాయేయ తిరోధాన మలములు రెండును గలిపి పంచమలములని కొందఱు వచింతురు.

## —* ఈశ్వర ధ్యానము. *—

ప. తత్స్వరూపం బెట్టిదనిన. ౮౦
తా. ఆధ్యాన ప్రకార మెట్లనిన-
సీ. పరమశాంతి స్వరూప పము బదాశేండ్ల ప్రా
యుంబు ప్రసన్నముఖాంబుజంబుఁ
గందర్పశతకోటి సుందరలావణ్య
సమవిగ్రహంబును జతురతయును
నాలుగు చేతుల నోలి మృగీటంక
వరదా భయములతో వెలుగుటయును
నభినవ చంద్రకళావతంసము శిర
స్సంపూర్ణ చంద్రాయుత ద్యుతియును
తే. గీ. గలిగి వివిధాంబరంబులు నక్కట ధరించి
దివ్యగంధాను లేపన దివ్యపుష్ప
దివ్యభూషణముల తోడ భవ్యలీల
నుజ్వల స్థితినలరు నీ వుస్నయభవు. ౮౧

తా. పరమ శాంతుఁడును- షోడశ వర్ష ప్రాయుఁడును- ప్రసన్నము ఖాంబుజము గలవాఁడును, కందర్ప కోటి సుందర విగ్రహుఁడును, మృగీటంక వరదాభయములను నాలుగాయుధ ముల నాలుగుచేతులయందు ధరించినవాఁడును, నవచంద్ర కళాధారియు- అనేక పూర్ణచంద్రుల కాంతిగలిగి వివిధాంబరములను దివ్యగంధాను లేపనము- దివ్యపుష్ప ములు- దివ్యభూషణములు ధరించి మనోహరముగా నున్న యాపరశివుని-

క. కరమొప్పు మూఁడు కన్నులఁ
గరుణారస మెల్లకడలఁ గడలుకొనంగా
వరభక్త జనానుగ్రహ
కరచారు విలోకనములు గలసర్వేశుఁ. ౮౨

తా. కరుణారస మెల్లకెల వెల్లివిరియు నటుల భక్త జనానుగ్రహ కరములునగు సుం దరములునగు నేత్రములుధరించిన యాసర్వేశ్వరుని-

తే. గీ. సరసఫలపుష్ప యుతకల్పక తరువు మొదట
రమ్యవేదిక పైనవర రత్నమయ సు
ఖాసనాసీను డైనమహా మహానుభావు
నమిత వైభవు నఖిలదేవాదిదేవు. ౮౩

తా. సరసఫల సమేతమైన కల్పవృక్షము మొదట వెలింగెడి సుందర వేదిక పైను న్న నవరత్నమయ సుఖాసనమున గూర్చుండిన యామహాదేవుని—

క. నిజ వామాంక తలంబున
నజస్రమును సర్వ మంగళాఖ్యామహాదే
విజగ ద్వందిత పాదాం
బుజ యుగళిం బొలుపుమిగులు భువనస్తుత్యున్. ౮౪

తా. తనవామ భాగమునం ద్రిలోకవందిత—యు సర్వమంగళాఖ్య యునగు మహాదే వి ప్రకాశింప నుల్లసిల్లు నాయవాఙ్మాన సగోచరుని—

క. త్రిగుణా ధారుం బురహరు
నగణిత మహిమాఢ్యు విష్ణు నచ్యుతు నిత్యున్
నిగమాంత వేద్యు నిర్వా
ణగోచరుని హార్యజాదిక నతున ద్వైతున్. ౮౫

తా. త్రిగుణ ములగు సత్వరజస్తమో మయా కారుడును, త్రిపు రాసుర సంహా రకుడును, అనంత మహిమా స్పదుడును, విష్ణువు- అనగా సర్వవ్యాపకుడును, నాశ ర హితుడును, ఉపని షత్ప్రతి పాద్యుడును, విష్ణుబ్రహ్మాది దేవతా వంది తుడును, ముక్తి నిలయుడును- నగు నాగౌరీపతిని—

వి. ఈగ్రంథమున విష్ణువు- అన్నమాత్రమున- లక్ష్మీపతి- యని యర్థము చెప్ప కూ డదు. అటులచెప్పినచో, "హార్యజాది నతుడు" అనునట్టిపదములు విరోధించును.

త్రిపురాసుర సంహారము-

త్రిపురా సురులను ముగ్గురు రాక్షసులు గలరు. వారువగ రస్వరూ పమున నుండుట చే త్రిపురాసురులను పేరువచ్చినది వారిని జయింప విష్ణుబ్రహ్మాది దేవతలకు, శక్యముగాక యీశ్వరుని శరణునొందిరి. అంతనీశ్వరుడు-భూమిని రథముగను, సూర్యచంద్రుల చక్రము లుగను, మేరువును విల్లుగను, విష్ణువును బాణము గను, బ్రహ్మను సారథిగను, సముద్రము

ను నంబులపొదిగను, వేదములను గుఱ్ఱములుగను, ఆదిశేషుని నారిగను, జేసి త్రిపురాసురుల గూల్చెను. ఈవిషయమును శంకరాచార్యులీ క్రిందిశ్లోకమున వచించెను.

శ్లో. క్షోణీ యస్య రథో రథాంగ యుగళం చంద్రార్క బింబద్వయం
కోదండః కనకాచలో హరిరభూ ద్బాణో విధిస్సారథిః
తూణీరో జలధి ర్హయా శ్రుతిచయో మౌర్వీ భుజంగాధిప
స్తస్మిన్మే హృదయం సుఖేన రమతాం సాంబే పరబ్రహ్మణి

మ. పరమేశుం బర మాత్మునిం బరశివుం గా భావించి హృద్వారిజాం
తర సద్మంబున నిర్విధంబున శివధ్యానావధానంబుతో
నరిషడ్వర్గ విదూరుఁడైన సుజనుం డభ్యంతర ద్రవ్యముల్
వరుసం గూర్చి తదీశ్వరార్చన మొనర్పం గాఁదగు న్వేడుకన్. ౮౬

తా. పరాత్పరుఁడును, పరబ్రహ్మయును నగు నాపరశివుని నిటులహృదయకమలమను గృహంబున ధ్యానంబు జేసి కామక్రోధ లోభ మోహ మాత్సర్యంబులను నరిషడ్వర్గములను జయించి యాభ్యంతర ద్రవ్యముల క్రమముగ సమకూర్చికొని మహానందమున నీశ్వరార్చనము చేయవలయును.

— * అభ్యంతర శివపూజ. * —

సీ. క్షమతామృతంబున స్నానంబు దగఁదీర్చి
సంపూర్ణ భావవస్త్రంబు గట్టి
యట త్రిశక్తుల గూర్చి యజ్ఞసూత్రంబిడి
తగిన విద్యా సుగంధం బలంది
భూతదయాక్షతంబులలీల నర్పించి
సద్భక్తి పుష్పపూజనము జేసి
యంతరంగ చతుష్టయము ధూపముగ నిచ్చి
శ్రోత్ర ముఖ్యేంద్రియ జ్యోతులెత్తి

తే. గీ. మొదలి సుఖదుఃఖ బాహ్యాదిపోపహార
మొప్పనము చేసితాంబూల మొగిగుణత్ర
యంబు గావించి ప్రదక్షిణార్పణంబు మొనర్చు-

పగిది గాఁ జేయుటేవి శివార్చ వస్తువిధము. ౮౭

తా. సమత్వమను నుదకంబున శివలింగమునకు స్నానముచేయించి సంపూర్ణ స్వభావమను వస్త్రమును గట్టి త్రిశక్తులను జందెంబును వేసి విద్యయను గంధ మలంది భూతదయ యను నక్షతల నిచ్చి భక్తి పుష్పముల పూజించి యంతరంగ చతుష్టయమును ధూపమిచ్చి యింద్రియములను జ్యోతులను పట్టుకొనిసుఖదుఃఖబాహ్యమగుజీవో పహారమును నిడి గుణత్రయములను తాంబూల మిచ్చిప్రాణార్పణ మనునమస్కారముగా నొనర్చుటయే యంతశ్శివపూజయని నుడువవలెను.

వి. ఈపూజ యాభ్యంతరపూజ అనఁగాఁ బ్రాణలింగోపాసన సంబంధమైనది. ఇటువంటి పద్యములను బట్టియే యీగ్రంథమున బాహ్యాంతర శివలింగ పూజయనఁగ- ప్రాణలింగోపాసనయనఁదయే చెప్పవలయును- శంకరసంహిత యందు జెప్పిన యీ క్రింది శ్లోకార్థములును నీపద్యార్థము నొకటె గనే గాన్పించుచున్నది.

శ్లో. బాహ్యానాభ్యంతరా న్వక్ష్యే సమాహిత మనస్సదా॥

శ్లో. స్నానం సమత్వసలిలే నహిపూర్ణస్వభావ వస్త్రంత్రి శక్తి గుణ సంయుత యజ్ఞసూత్రం
విద్యాసుగంధ మిహభూతద యాక్షతాశ్చ శబ్దాదిపుష్ప చయమర్ప యనిత్య మంగ॥

శ్లో. ప్రజ్ఞాపనోపాం కృతిచిత్తధూపం శ్రోత్రాది పంచేంద్రియదీపమంగ।
సద్వాసనా నైలయుతం పదజీవోపహారం సుఖదుఃఖబాహ్యం.

శ్లో. గుణత్రయాఖ్య తాంబూలం ప్రాణార్పణ సమస్కృతిం।
శాంతిపుష్పాంజలిం దేహి చైక భావ విసర్జనం॥

శ్లో. ఏవమభ్యంత రద్రవ్య సంభృతంశివపూజనం।
కృత్వాహి దేహసతతం లింగం వస్త్రేణ వేష్టితం॥

ఇందు భావప్రాణేష్ట లింగార్చనములును, దేవనుకూలమగు దహరోపాసయును, తత్సాధకమగు శివయోగమునువచించుటచేత శైవుల(ఆరాధ్యుల) ధర్మ విశేషములు చక్కగా నిరూపింపఁబడినవి.

క. భవ్యాంతరంబు సుగుణ
ద్రవ్యము లొనగూడ కున్నతఱి బాహ్య
ద్రవ్యముల బోలుసంతన
నవ్య ద్రవ్యముల యర్చ సము శంభునకున్. ౮౮

తా. సమతాది సుగుణములను సాంతరంగిక ద్రవ్యములచేఁ బూజించుటకు శక్తి లేనిచో బాహ్య ద్రవ్యములనే కల్పించి శివుని బూజింపవలెను.

వ. అట్టిశివార్చనా విధ మెట్టిదనిన, మొదలనావాహన నీరాజనోపాసన పాద్యార్ఘ్యాచమన మధుపర్క వస్త్రోపవీత గంధాక్షత పుష్ప ధూప దీపతాంబూల నీరాజనంబులనదగు నుపచారంబులు పదాఱును, సాంగ స్నాన నీరాజన సమ్మార్జన మహాసన పాద్యార్ఘ్యాచమన మధుపర్క వస్త్ర యజ్ఞోపవీత హారాది విభూషణ గంధతిలాక్షత నానార్ఘ్యపత్ర పుష్ప ధూప దీపంబులనందగు నుపచారంబులు పదాఱును, బంచావరణ పూజా తద్ధూప దీప తదనంతర నీరాజన సమ్మార్జన నైవేద్య హస్త ముఖ శోధన తద్వ్యాసన గంధానులేపన మాల్యవిభూతి నీరాజనా దర్పణ పక్వఫల తాంబూల నీరాజన ప్రదక్షిణ నమస్కారంబు లనందగు నుపచారంబులు పదాఱును, శివస్తోత్ర జపధ్యాన పురాణ పఠనచ్ఛత్రచామర నృత్యగీతవాద్య పరిహాసక క్షపణ పూజానిసుకృతార్పణ నివేదన పుష్పాంజల్యాశీర్వాదంబులనందగు నుపచారంబులు పదాఱును, మఱియు శివపాద ప్రసాదప్రసూన ధారణంబును నాత్మాలోకనంబును, బరివార విసర్జనంబును, గురుభక్తార్చనంబును, శైవపుస్తకారాధనంబును, శివాగ్ని యజనంబును, శివపాదోదకస్వీకారంబును, రూపకుటత్ప్రాప్తిసమర్పణా ప్రధానసమాకలితశుద్ధ శివప్రసాద స్వీకారాగ్ని హోత్రంబును, ననందగునుపచారంబు లెనిమిది యును, గూడనిట్లు డెబ్బదిరెండు రాజోపచారంబుల బాహ్యంబున బూజించుచున్నవాని జూంతరంగంబున బూర్వోక్తప్రౌఢయకములకృత్యాంబునయ్యుమా సహితుండై నపర మీశ్వరుఁ బూజించుట యుత్తమోత్తమ కృత్యంబత్యంత విశేషంబగుంగావున.

తా. అబాహ్య శివపూజ యెట్లులన:— మొదట శివలింగ మునకు, ఆవాహ నాద్యుపచారంబులు పది యారు నొసంగి, పిమ్మట సాంగ స్నానాద్యుపచారంబులు పదియారును, అనంతరము పంచావరణ పూజాద్యుపచారంబులుపదియారును,తరువాత శివస్తో

లోని జపాద్యుపచారంబులు షణియారును, అటుపిమ్మట శివపాదతీర్థ ప్రసాదాద్యుపచారంబుల నెనిమిదియు నొసంగవలెను. ఈ డెబ్బదిరెండు రాజోపచారంబులును శివోపాసకులు శివలింగమునకు జేయవలయును. అంతరంగమందును, నిటులే శివుని పూజించుట యుత్కృష్టము.

వి. ఈయుపచారములు డెబ్బదిరెండును, వీరపూజా పరాయణులకు రచింపఁ బడిన

వి. ఈవిషయమై కావలసినంత గ్రంథము కలదు. అప్పయ్యదీక్షితుల వారు శివార్చనాచంద్రికయందుఁ బైవిషయముల విస్తరించి వ్రాసియుండిరి. గ్రంథ విస్తర భీతివలన నిటనావిషయము విరమింపఁ బడుచున్నది.

శైవులు గ్రహించినయుపచారములు ౨౪ ను, పూజలు ౧౨ను, మొత్తము పూజోపచారములు కలిసి ముప్పది యారు..

అవియేవియన,

శ్లో॥ పూజాద్వాదశధా ప్రోక్తా । శివ సిద్ధాంతతత్పరైః । ఉపచారస్తథా చైవ । చతుర్వింశతిధా స్మృతాః ॥౨॥ విభూత్యభ్యా తుణం లింగే । కరణం స్నపనస్య చ । అంగారతాపనం చైవ । ధూపనం వీజనం తతః ॥౩॥ ధూపప్రసారణం చైవ । తిలోగం ధావళింసనం । అక్షతారోపణం చైవ । పుష్పోప హారణం తతః ॥౪॥ దీపప్రకాశనం చైవ నైవేద్యస్య సమర్పణం । తాంబూలస్య ప్రదానం చ । వస్త్రప్రావరణం తతః ॥౬॥ ఏవం ద్వాదశధా ప్రోక్తా శివలింగార్చనక్రియా । ఆసనావాహనం కార్ఘ్యాణి । పాద్యమాచమనీయకం ॥౭॥ యజ్ఞోపవీతమాల్యాను । లేపనాభరణాని చ । ఛత్రం చ చామరం చైవ । తాళవృంతం చ దర్పణం ॥౮॥ ఘంటానాదం ఖంచగీతం చ । వాద్యం నృత్యం ప్రదక్షిణం । నమస్కార స్తుతిస్తోత్రా చ్ఛాజ్ఞప్తిశ్చ విసర్జనం ॥౯॥ ఇత్యేవముపచారాంశ్చ చతుర్వింశతిధా స్మృతాః । సమస్తోపచారాణాం భోగస్త్రింశతీరితః ॥ షట్త్రింశత్ తత్త్వమిత్యేషా శైవస్థితిరితి శ్రుతిః ॥

విభూత్యభ్యం తుణాది పూజలును, ఆసనాద్యుపచారములును ౩౬ యని నిర్ణయింపఁ బడినది. శతే పంచాశన్న్యాయమున ననుసరించి, యిచ్చట గ్రహించ వలయును. 72 యుపచారము లన్నియు పూజలు కూడ యిందు కలసియే యున్నవి.

— * అర్పణాత్రయవిధి * —



రూపార్పణమని, రుచ్యర్పణమని తృప్త్యర్పణమని యర్పణలు మూడువిధములు. ఈ విషయమై శివానుభవసూత్రమందలి 7 వ యధ్యాయమున నిటులఁ జెప్పఁ బడినది.

శ్లో. ఆత్మోపభోగజాతాది ద్రవ్యాణి త్రివిధానిహి। స్థూలాఖ్యాం ప్రవివిక్తాఖ్య మానం దాఖ్యమితి త్రిధా స్థూల ద్రవ్యం భవేద్రూపం ప్రవివిక్తం రుచిర్భవేత్.
ఆనందస్తు భవేత్తృప్తి రేవమేవ పృథక్క్రమాత్। బహిరంగార్పణే రూప మంతరంగార్పణే రుచిః॥ ఆత్మాంగార్పణ మేవాత్ర తృప్తి రిత్యభిధీయతే। రూపద్రవ్యార్పకో విశ్వ ఇష్టలింగే స్వభావతః॥ రుచిద్రవ్యార్పక స్సూక్ష్మాత్ప్రాణ లింగేతు తైజసః। భావలింగే సదా ప్రాజ్ఞ స్తృప్తిద్రవ్య సమర్పకః॥

తా. తనకు భోగ్యములగు పదార్థము స్థూలమని, ప్రవివిక్తమని ఆనంద మని త్రివిధము. స్థూలమునకు రూపమనియు, ప్రవివిక్తమునకు రుచి యనియు, ఆనందమునకు తృప్తి యనియు నామాంతరములు. స్థూలాంగమున నున్న యిష్టలింగమునకు, రూప ద్రవ్యమును విశ్వుడర్పించును. సూక్ష్మాంగమున ప్రాణలింగమునకు రుచిద్రవ్యమును తైజసుడును, ఆత్మాంగమున భావలింగమునకు తృప్తిద్రవ్యమును ప్రాజ్ఞుడును సమర్పించును.

క. అభ్యంతర పరశివ పూ
జాభ్యాస పరాయణాత్ములగు సుజనులకున్
లభ్యుండగు శివుఁడెప్పుడు
నభ్యుదయము నిహపరంబు లందొనరించున్. ౧౦

తా. పరశివుఁడు హృదయ పుండరీకమున శివలింగోపాసనము చేయువారికి త్వరలో సాక్షాత్కరించును. ఇహపర భోగంబుల నొసంగును.

శా. పాపంబుల్ చెడు దుఃఖముల్దొలియు సౌభాగ్యోదయం బౌగదున్
దీపించున్ శివభక్తి నిర్మల మగుం దెల్లంబు గామానస
వ్యాపారంబు శుభంబులొందు సకలైశ్వర్యాబులుం గల్గు ప్ర
జ్ఞాపూర్ణస్థితి నంతరంగ శివపూజాసక్తులౌ వారికిన్. ౧౧

తా. అంతరంగమున శివపూజ నొనర్చు మహాత్ములకు పాపంబులు నశించును. సుఖము లంది యుందును. శుభములు పొందును. సర్వ సంపదలచే తూగును. మనస్సు నిర్మలతఁ జెందును.

క. అంతర్యాగంబు ఫలం
బింతింతని చెప్పవచ్చునె శివుఁడంచున్

సంతుష్టుం డగును వేగము
చింతింపంగం దత్సమానశీలముగలదే. ౯౨

తా. అంతర్యాగ ఫలము వచింప వలనుకాదు శివుండు వ్యాలో సంతుష్టుండై వారల ననుగ్రహించును. విచారింపం గాందత్స దృశమగు నది వేరేమియును లేదు.

క. శివభక్త మనోహరమును
శివయోగ సుఖప్రదంబుం జిన్మయమును నై
శివకరమగు నభ్యంతర
శివార్చనముం జేయవలయుం శిష్టాత్ములకా. ౯౩

తా. శివభక్తుల యుల్లాస కరమును, శివయోగ సుఖము నిచ్చునదియు, మంగలకరమునగు నంతరంగ శివపూజను శిష్టులు తప్పక చేయ వలయును.

క. ధ్యానజ్ఞాన విమలయు
జ్ఞానందనివాస మైనయభ్యంతర పూ
జా నియమంబున శివునిం
బూనిభజింపంగందగుముముక్షుల కెల్లన్. ౯౪

తా. ధ్యాన- జ్ఞాన యోగముల వలన జనించు నానంద మునకు నివాసమగు భావప్రాణేష్టలింగోపాసనము నాయా నియమ ములకు బద్ధులై ముముక్షువులు చేయవలయును.

క. నొడియును సగుణ నిర్గుణ
మండిత శివతత్త్వ గరిమ మదిం దెలియుట భూ
మండలము నందు ధ్యానా
ఖండజ్ఞానముల కాదికారణమయ్యెన్. ౯౫

తా. ఇంతియ గాక. సగుణ నిర్గుణ రూపముగు శివతత్త్వ మహిమ దెలియుట గూడ, ధ్యాన జ్ఞానా నందములకు నిదానము.

—:సగుణారాధన ప్రాశస్త్యము:—

క. ఉడుగని సగుణోపాసికిం
గడంగక నిర్గుణము నాదికైకొనినం జె
ప్పెడిదేమి? యడుగుపోయిన

కడపఁబోసిన జలంబు ◆ కైవసిమెఁ దా. ౯౬

తా. సగుణోపాసనము వదలి నిర్గుణోపాసనఁ బ్రారంభించుట, అడుగు పోయిన కడవలో నీరు పోసినటుల వ్యర్థమగును కావున " యాకశా వగమానూష్మా తత్వానాం బోధనీపరా । తామాస్య యథాన్యాయం లింగేషు సకేశ్ " యేగ్య్ను కాఁణోక్త ప్రమాణమువలన తత్త్వములు సూక్ష్మములు, తత్వబోధము కలుగుటకు రూపసృష్టమార్గంబున నిష్టలింగమున నారాధించి పూజింప వలయునని భావము.

వ. అందు సగుణంబన్నది యేవిధంబులై యుత్తరోత్తర క్రమ విశేషాతిశయంబునఁ బ్రకాశించు చున్నది. అవియెవ్వని యనిన. ౯౭

తా. సగుణ మయిదు విధంబులు అందు నుత్తరోత్తరము మహిమాధిక్యమునఁ బ్రకాశించును.

క. శ్రీ వెలయఁగ సాకారము
నావల దీపాకృతియును ◆ నాశిఖిలాగుఁ
నీవార శూకరూపము
భావన నణువిధము సగుణ ◆ భావములైదుఁ. ౯౮

తా. "సాకారము- దీపాకృతి- శిఖి- నీవార శూకాకృతి- అణు రూపము" అని సగుణ మైదు విధములు.

వ. అందు ౯౯

క. భావము సాకారంబున
భావములట మీఁదినాల్గుఁ ◆ బరికింపంగా
భావా భావాతీతం
బై వెలుగుఁ నిర్గుణము వియత్సదృశంబై. ౧౦౦

తా. వానిలో సాకారంబు భావమని వచింపఁబడును. తక్కిన నాల్గును, అభావములని వచింపఁబడును. గగన సదృశమై భావా భావాతీతమై వెలుంగు నదియె నిర్గుణమని నుడువ బడును.

శా. వాలాయంబును భావమున్నజియు ◆ భావంబుఁ ద్వయాతీతముఁ
స్థూలంబుం గడుసూక్ష్మము స్పరమునై ◆ శోభిల్లుటన్మాట ని
ట్లోలింజూచి భజింతుఁబ్జ భవము ◆ ఖ్యాల్ శాశ్వతావంద్యమై
శ్రీలీలఁ శివయోగివర్యులునుసు ◆ శ్రేయోన్వితాద్వైతులుఁ ౧౦౧

తా. భావము- అభావము. భావాతీతము- స్థూలము. సూక్ష్మము. పరమునై వెల యుటచేత నాశ వతిత్వమును- బ్రహ్మాది దేవతలును. శివయోగి శ్రేష్ఠులును- అద్వైతులు- మొదలగు వారందఱు సేవింతురు.

వి. శివ యోగు లనగా శైవులని భావము. శివస్య- లింగస్య యోగః ధారణం యే షాంతే శివయోగినః " లింగధారులని భావము. [ శ్లో. యోగస్సన్నహ నోపాయ ధ్యాన ధారణ యుక్తిష్వివ్యత్యమరః ] శంకర సంహిత యందు గూడ శివయోగులని శైవులను నా మాంతరముగ వచింపఁ బడినది. చూడుడు.

శ్లో. ప్రాణరూప ఇతిజీవ ఉచ్యతే। లింగరూప ఇతి శంకర స్మృతః యస్త్వైక్యమితివే దితానయోః ప్రాణలింగ పదస్సౌ శివయోగీ॥అ॥౧౨౦॥ మఱియు ననేక స్థలములందు శివయో గిపదము శైవులపరము గా వచింపఁబడియున్నది.

వ. కావున. ౧౦౨

తే. గీ. కడఁగి సాకారునర్చించుఁ గర్మయోగి
సకలభావంబుఁ జూచునిష్కర్మయోగి
జగతి నందఱకును బెద్దయగుచుఁ రంజ
నాత్మకుని కబ్బు నిష్కళమైనపదము. ౧౦౩

తా. కర్మ యోగి సాకారమునే పూజించును. నిష్కర్మయోగి సకలంబును బూ జించును. అందఱికి బెద్దయగు నానిష్కర్మ యోగికే నిష్కల పదమబ్బును.

వ. అదియునుంగాక "యణోరణీయా న్మహతో మహీయాన్ సత్యంజ్ఞా న మనగతం బ్రహ్మ" మనందగి యవాఙ్మానస గోచర సర్వగతంబై నిష్కళతత్త్వం బొక్కటియువిశ్వవ్యాపకంబైన శివ సదాశివతత్త్వం బు పంచాక్షర పంచబ్రహ్మ పంచభూత పంచప్రకార ప్రణవ నివృ త్త్యాది కళాష్టత్రింశత్కళాస్పదంబైన బ్రహ్మ విష్ణు రుద్ర మహే శ్వర సదాశివ మిశ్రంబై పంచముఖాన్విత దివ్యాంగ సమంచితంబై న కర్మసదాశివ తత్త్వంబును ననంబరగు సకలనిష్కల కలితసదా శివ తత్త్వంబు లైనను చంద్రధర దాక్షాయణీపతి వృషభారూఢ తాండవరూప పార్వతీనాయక భిక్షాటన దక్షసంహార కామ హర కాలసంహార త్రిపురసంహార జలంధరసంహార బ్రహ్మశిరోహర వీ

రభద్ర శరభేశ్వర అర్ధనారీశ్వర కిరాతవేష కంకాళరుద్ర చండీశ్వర వరప్రదాయక విషహర హరి నేత్ర చక్రప్రద విఘ్నేశ్వర వరద మహేశ్వర గుహానిమిత్త తత్త్వప్రదైకోపాదక బ్రహ్మ విష్ణ్వాది సేవ్య రూప దక్షిణామూర్తి బ్రహ్మవిష్ణుమధ్యోద్భవ మహాలింగస్వరూపులం బ్రసిద్ధంబులై కేవలసకలనిష్కళంబులైన మహేశ్వర లీలావిగ్రహంబు లిరువదేనును గూడనిట్లుముప్పది యొక్క భేదంబులనం బ్రకాశింపుచుండు పరమపదుండైన పరశివుండు. మఱియును. ౧౪

తా. మఱియు, "అణోర ణీయాన్మహతో మహీ యాన్" సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతిప్రతి పాద్యమును, అవాఙ్మానస గోచరమును నగు నానిష్కళతత్త్వమే ప్రపంచ మంతయు వ్యాపించి శివతత్త్వంబ నంబరగి పంచాక్షరి- పంచ బ్రహ్మ-పంచభూతి- పంచప్రణవ- అష్టత్రింశత్కళా స్పదంబైన బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదా శివులచేఁ గలసికొని పంచముఖాన్విత- దివ్యాంగమును చితంబైన కర్మసదాశివ తత్త్వంబని చెప్పనగు. సకలనిష్కళ ములగు సదాశివ తత్త్వంబు లైదును చంద్ర ధరాది, మహేశ్వరలీల లిరువదేనును గలసి 31 భేదంబులఁ బ్రకాశించు చుండును.

వి. అపర శివతత్త్వము శివతత్త్వము- సదాశివతత్త్వము- మహేశ్వరతత్త్వము" అనిమూడు విధములు- శివతత్త్వము నిష్కళమనియు, సదాశివతత్త్వము సకలనిష్కళమనియు, మహేశ్వరతత్త్వము సకలమనియు వ్యవహరింపఁ బడును.

శివతత్త్వము— ఏకవిధము.

శివసాదాఖ్యము- అమూర్త సాదాఖ్యము- మూర్త సాదాఖ్యము— కర్తృసాదాఖ్యము- కర్మసాదాఖ్యము అనిసదాశివతత్త్వమయిదు విధములు. దీనికేసాదాఖ్యపంచకమని పేరు. ఇవియేసదాశివునికి నయిదుముఖములని చెప్పఁబడును.

మహేశ్వర తత్త్వము నుండియే చంద్రశేఖరాది లీలలిరువదియైదు బయలు వెడలిననవి. ఈముప్పదియొక్క తత్త్వములరూపము శివుండేయని యెఱుంగవలయును.

పంచాక్షరములు:- నమశ్శివాయ

పంచబ్రహ్మలు:- మూర్తిబ్రహ్మ- తత్త్వబ్రహ్మ. భూతిబ్రహ్మ-పిండబ్రహ్మ-కలాబ్రహ్మలు

పంచ ప్రణవములు:- శాకల్య ప్రణవము- గాంధర్వ ప్రణవము- సౌఖ్య ప్రణవము- సావశి ప్రణవము-సాయుజ్య ప్రణవము. విశేషాంశములు ఎంతూలమునఁజూడవలయును.

## — * పరశివతత్వ మాహాత్మ్యము. * —



సీ. ఆకాశ ముఖ్యంబులై నైదును శబ్దాదు
    లైదు శ్రోత్రము మొదలై నైదు వాక్య
ముఖములై దును మనంబును బుద్ధియును జిత్త
    మును నహంకృతియు నా పై నరు ప్రకృతి
యందును బురుషుండును నటకళా విద్యలు
    రాగ కాలంబులు ప్రకటనియతి
యామాయ శుద్ధవి ద్యామహేశ్వర సదా
    శివ మనోన్మనులు నన్ శ్రీకరభాగి

తే. గీ దనుకుముపై దివ్యమూ ర్తియు లలప ట్టి
    తత్వములు ముప్పదియు నాఱు నై దావ యగుచు
    దత్వముల కన్నిటికి మీద నై తత్వమగుచు
    ధ్యాన విజ్ఞానగమ్యుడై తనరు శివుడు. ౧౦౫

తా. పృథివ్యప్తేజో వాయ్వా కాశములను పంచభూతములు శబ్దస్పర్శ రూపరస గంధములను పంచతన్మాత్రలు జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మనోబుద్ధి చిత్తాహంకారములు ప్రకృతిపురుషులు- కళావిద్యలు- రాగ- కాల- యతి- మాయా- శుద్ధవిద్యా మహేశ్వర- సదాశివ- మనోన్మనులను ముప్పదియారు తత్వముల స్వరూపు దేయుయ్యను ఆతత్వములన్నిటికి, మించివెలుగు నదియే పరశివతత్వము బడును.

## — * తత్వ విభాగము. * —



ఈస్థూల దేహము- జాతి కులాద్యభిమాన ములకు స్థాన మైనది. పుగా శివపుణ్య పశేనువ నియతమగు నాయువును భోగమును జీవులను భరించి త్రిణజాలూ కా న్యాయము న దేహాంత రమును—ఆశ్రయించుచుండు ఆదివరకు జీవుడు చేసిన పుణ్య పాపములు జీవులనే యా శ్రయించి యుండును.-

భోగాను భవసాధనా మైన శరీరోత్పత్తి కి గారణములు ఆకాశము. వాయువు అగ్ని జలము. భూమి- యను పంచభూతములు. వీటికి గారణ ములు శబ్దస్పర్శ రూప రస

గంధములు- వీనికిఁ బంచ తన్మాత్రములని పేరుగలదు. పంచభూతములు- పంచ తన్మాత్రలు కార్యమనఁ బడును

వాక్పాణి పాదపాయూప స్థలను కర్మేంద్రియములైదును, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియములైదును, కరణములు- [అనగా యింద్రియములు] అనిచెప్ప బడును.

మనస్సు- అహంకారము- బుద్ధి- యీ మూడును అంతఃకరణములన బడును. శరీరములోపల నుండియే కార్య మొనర్చునవి కాన అంతఃకరణములని పేరు.

ప్రతికార్యమును సంకల్పించుటయు, ఇంద్రియములను విషయము మీదికి బంపుటయు మనస్సుయొక్క పని- అభిమానమును కల్పించి ప్రాణాది వాయువులఁ బ్రేరేపించుట యహంకారముపని. సంశయము గలిగినపుడు నిశ్చయించుట బుద్ధిపని.

బుద్ధికి కారణము తత్త్వరజస్తమోరూపమగు గుణతత్త్వము ఇది క్రమము గా సుఖ దుఃఖ మోహములకుఁ గారణమగును.

ఈబుద్ధి తత్త్వమునుండి సాత్త్వికరాజసతామసాహంకారములు జనించెను. సాత్త్వికాహంకారమున జ్ఞానేంద్రియములు- మనస్సును, రాజసాహంకారమున బంచతన్మాత్రలు గలిగెను. పంచతన్మాత్రల వలననే ఆకాశాది పంచభూతములు గల్గినవి.

గుణతత్త్వమునకు గారణము ప్రకృతి తత్త్వము. పృథివీ తత్త్వము మొదలు ప్రకృతితత్త్వము వరకు గల యిరువదినాలుగు తత్త్వములకు ఆశుద్ధాధ్వయని పేరు.

దీనితరువాత రాగతత్త్వము గలదు. రాగతత్త్వవ్యాపారమేమనగా ప్రకృతితత్త్వమువలన గలిగిన సర్వవస్తువు లందుజీవునకు రుచిగల్గించుట.

దీనితరువాత నియతి తత్త్వముగలదు. ఇయ్యది ఏజీవుఁ డొనర్చిన కర్మముల నాయా జీవుడేయను భవించవలయునని నియమించును.

దీనిపైన కాలతత్త్వముగలదు.

దీర్ఘకాలమును భవించుచున్నాడు- స్వల్పకాలమును భవించుచున్నాడని జీవుని భోగమునకు తెంపుగలిగించును.

దీనిపైన విద్యాతత్త్వము గలదు. ఇదిబుద్ధికి విషయమును రాగముగలిగిన దని జీవునకు దెలుపును. దీనిపైన కలాతత్త్వము గలదు. ఇది రాగియందు జిలుముపోలె జీవుని యందనాదిసిద్ధమైయున్న యాణవమలమును తొలగించి యాత్మస్వరూపమును దెలుపును. [రాగతత్త్వము మొదలుకలా తత్త్వమువరకు మిశ్రాధ్వయనఁ బడును.

ప్రకృతి రాగ- విద్యాతత్త్వములు కలాతత్త్వమందును, నియతి- కాల- కలా తత్త్వ

ములు మాయాతత్త్వమందును బుట్టుచున్నవి.

కళా విద్యా కాల నియతి రాగ తత్త్వములకుఁ బంచకంచుకంబులని పేరు. వీనిచే నావరించబడినవానికిఁబురుషుఁడని పేరు. ఈముప్పదితత్త్వములు ప్రతిజీవునియందు వేర్వేరుగా సూక్ష్మశరీరములగుచున్నవి. ఈతత్త్వములకన్నిటికి మలినమాయాతత్త్వము కారణము. ఇదిసమస్తజీవకర్మలతో సంబంధము గలిగి జ్ఞానక్రియలఁ బ్రకాశించుచు మోహమును కలుగ జేయును.

దీనిపైన శుద్ధవిద్యాతత్త్వము గలదు. ఇదు కామి కాద్యాగమ ములును, నందీశ్వరాద్యష్టగణేశ్వరులును, ఇంద్రాద్యష్టదిక్పాలురును, వీరిఆయుధములును, నుండును.

దీనిమీద యీశ్వరతత్త్వముండును. అనంతాద్యష్ట విద్యేశ్వరు లుందురు. అందులో అనంతుఁడు శ్రేష్ఠుఁడై మాయకు క్షోభము గలిగించుచు, మాయా జనితములగు త్రింశత్తత్త్వములకును, వీటికిని సంబంధించిన భువనములకు సృష్టికర్తయయ్యెను.

ఈయనంతేశ్వర సృష్టియందు, ఆణవ కార్మిక బంధబద్ధులై ప్రళయాకలులను పేరుగల జీవకోటిలో పరమేశ్వరానుగ్రహమున మలమునశించిన రుద్రులు 108 నంది యుండిరి.

వీరిలో శ్రీకంఠరుద్రుడు మధ్యప్రళయాంతమునందు ప్రకృతి తత్త్వమునకు గ్రిందనున్న తత్త్వములందుగల భువనముల సృజించును. ఆణవ- కార్మిక- మాయీయ ములను బంధత్రయమున గూడికొన్న సకలులను జీవులకు నిమామకుడై యుండును.

బ్రహ్మవిష్ణు స్థానకృత్యములనిర్వహించును. మధ్యప్రళయమున రాగతత్త్వముననుండును సృష్టికాలము వచ్చినవెంటనే మొదలశుద్ధాధ్వను సృజించి బ్రహ్మవిష్ణుల సృష్టిక ర్తృస్థానరై తనకుదిగువ నున్న భువనేశ్వరులను త్రయస్త్రింశత్కోటి దేవతలను, బ్రహ్మాండముల నుసృజించుచుండును. ప్రతి బ్రహ్మాండమందును పదునాలుగు లోకములును, సర్వ ప్రజలును నుందురు.

రుద్రులలో నూర్వురు రుద్రులు పాంచభౌతిక బ్రహ్మాండమున నుండక పృథివీ తత్త్వమున నుండియే బ్రహ్మాండమును రక్షించుచుందురు

బ్రహ్మవిష్ణులతో గుణతత్త్వముననున్న రుద్రభట్టారకుడు మధ్యప్రళయ పర్యంతము అధికారము వహించి బ్రహ్మవిష్ణువులను వారించి తాను మిశ్రాధ్వములోని రాగతత్త్వమున వీరభద్రునితో వసించుచుండును.

ఇటుల ప్రకృతి శిరంబున నెనమండుగురును, కలాశిరంబున నెనమండుగురునుపరమేశ్వరాను గృహీతశరీరులై యున్నారు. వీరు బ్రహ్మవిష్ణు పదవుల కలసి కొనక తమజ్ఞానయోగమున బ్రహ్మవిష్ణు పదము సృజింతురు.

ఈగగనమండి. రుద్రులకు పరమేశ్వరాను గ్రహమున మలము పరిపక్వముగాగాదీ

క్షాపూర్వకముగ పరమేశ్వర పదము సిద్ధించును.

విద్యేశ్వర స్వరూపము బిందు సంబంధమైనది. అష్టోత్తర శతరుద్ర రూపము మాయాసంబంధమైనది బ్రహ్మవిష్ణు స్వరూపము ప్రకృతిసంబంధమైనది. బ్రహ్మవిష్ణుపదములు రెండు జీవస్థానములు. రుద్రేశ్వర పదము లీశ్వరస్థానములు.

ఈశ్వర తత్వముపైన సదాశివతత్వమును. దానిపైన శక్తి తత్వమును దీనిపైన శివతత్వమును గలదు, ఇందు అధికార తత్వము సదాశివతత్వమును, శక్తితత్వము భోగ తత్వమును, శివతత్వము యీశ్వరతత్వమునై యున్నది.

ఈతత్వ త్రియ మందున్న జీవులుసాధ కదీక్షచే పరమేశ్వరాను గ్రహంబున సాయాభు వనంబుల భోగంబులను భవించుచు విరక్తి గలుగు నపుడుగాని, మహాసంహారను గునపుడు గానిము క్తులగు దురు.

కలానాద ములతో గూడి సదాశివ తత్వమున బిందువుండును. శక్తి తత్వమున ప్రత్యక్ష కమును, శివతత్వజ్ఞా నకారణమగు బిందువును నుండును. శివతత్వ బిందువులు వేర్వేరుతత్వములు గాక నొకటి గనేయుండును. ప్రత్యక్షకమ నలింగ శరీరము. సదా శివశక్తి తత్వముల నాశ్రయించి యుండు శివులకు- సకలుడు- నిష్కళుడు-సకల నిష్కళుడు- మొదలగు నామములుగలవు-మాయాతత్వము మొదలుశివతత్వమువరకుశుద్ధాధ్వయని పేరు.పృథివీ తత్వము మొదలుకొని శివతత్వము వరకునున్న ౩౬తత్వములకు తత్వాధ్వయని పేరు. కాలాగ్ని భువనము మొదలు కొని యనాశ్రిత భువనములవరకునున్న 33 భువనములుభువనాధ్వ యనబడును. నివృత్తి.ప్రతిష్ఠ.విద్య- శాంతి- శాంత్యతీత-అనునైదును కలాధ్వ యనబడును.

అకారాది క్షకారాంతము వరకువర్ణాధ్వ యనియు, వ్యోమ వ్యాపి మంత్రాత్మకములు పదునొకండుగాని, అనేక విధమంత్రముల పద సమూహ ముగాని, పదాధ్వయనియు, మూల బ్రహ్మాండ రూపములు పదునొకండుగాని, మూలమంత్ర సంజసి తములగు సప్తకోటి మహామంత్రములు గాని, మంత్రాధ్వయని యువచింపఁ బడును.

భువనాధ్వ- తత్వాధ్వను, తత్వాధ్వ- కలాధ్వను, వర్ణపద మంత్రాధ్వలుఁభువనజ శరీరములను నాశ్రయించియుండును

ఈషడధ్వ కారణమగు వస్తువు- కుండలిని.- శుద్ధవిద్య పర శివుడు- అనిహ్వయ హెంపఁ బడును.

శుద్ధాధ్వ వాసులకు ముక్తులకువలె నిరతిశయ సుఖమే యుండును గాని దుఃఖస్పృదయు- మోహమును నుండవు.

మిశ్రాధ్వ వాసులకు సర్వజ్ఞత్వ సుఖదుఃఖ మోహములుండును.

ఆశుద్ధాధ్వవాసులకు కించిజ్జ్ఞత్వము—కించిత్కర్తృత్వము సుఖదుఃఖమోహాదులునుం డును. ఈమూడును తత్వాధ్వ యనఁబడును.

ఆణవము- కార్మికము- మాయీయము హైఁవము రోధశక్తి యనునైదు పాశములచే బంధించబడి జీవుడు పురుషుడనఁబడును.

ఈ యశుద్ధాధ్వయందు హైందవ- మాయీయ- పాశములా గంతు కములు అనాది యగుకర్మపాశము- భోగముచే నశించును. అనాదియగుఅణవపాశము— స్వపరి పాకమునఁప రమేశ్వర ప్రసాద రూపమగు దీక్షచేని వర్తించును.
కార్మిక పాశము జ్ఞానయోగ సన్యాసముల చే గాని, భోగముచేగాని, నశించును. పాశమనే గాశివశక్తి యేయనియౌపచారిక ముగావ్యవహరింప బడును. ఇంకను విస్తరించి చూడదల చిన శైవసిద్ధాంతదీపికలో జూడఁగోరద.

వ. అట్టి పరశివ తత్త్వం బెట్టిదనిన. ౧౦౬

సీ. ఏకంబు సూక్ష్మ మ౯ నాకార మాదిను
ధ్వాంతవర్జిత మజ౯ మవ్యయంబు
జ్యోతి ర్మయంబు భా౯ వాతీత మానంద
మప్రమేయంబు దృ౯ శ్యం బదృశ్య
మంతస్థ మనుపమం౯ బ్రపత ర్క్యము బహి
స్థంబస్తి నాస్త్యతీ౯ తంబు వ్యోమ
మధ్యస్థ మఖిలైక౯ మధ్యస్థ మఖిల రా
హిత్యం బపారం బ౯ హీన రూప

తే. గీ. మక్షరబంణు మ్మాత్రము నాత్మమముని
రాశ్రయము నాశ్రయంబును౯ నతులమజర
సర్వదృక్సర్వ పాత్సర్వ౯ సంగతంబు
సర్వత శ్శిరస్కము జగ౯ త్సర్వమయము ౧౧౭

తా. ఆశివతత్వముఏకమై నిరాకారమై భావాతీతమై- జ్యోతిర్మయమై దృశ్యా దృశ్యమై ఆకాశమధ్య స్థితమై- ఆ[illegible] మైచాక్షుష మై "సహస్రశీర్షా- పు రుషః సహస్రాక్షః స్సహస్రపాత్" సహస్ర శీర్షంబదే వంవిశ్వాక్షం విశ్వ శంభువం "అను శ్రుత్యర్థ గోచరమై వెలుగుచుండును.

శా. సర్వాకార సమూర్త మచ్యుతము శాస్త్రజ్ఞాన మూలంబు నా
సర్వోపాధి విముక్తమార్గము ప్రతిష్ఠాభావ హీనంబు నా
సర్వవ్యాప్తము విశ్వతోముఖము హంస సంబ్రమాణంబు నా
సర్వాచార విదూషణంబనఁ జను న్సర్వేంద్రియాతీతమై. ౧౮౮

తా. సర్వేంద్రియాతీతమగు నావస్తువే సర్వాకారము అమూర్తము- అచ్యుతము- విశ్వతోముఖము- హంసము అప్రమాణము- అను మొదలగు నామముల వ్యవహరింపఁ దగును.

క. ఆధార విరహితము స
ర్వాధారము నిష్ప్రపంచమై యచలిత మాధా
రాధేయ వర్జితము సం
బోధము సహజం బమేయమై సుమహోన్నతము౯. ౧౮౯

తా. ఆతత్వమే నిరాధారమయ్యు సర్వమునకాధారమయినది. ఆధారాధేయ రహితమై జ్ఞేయమై యెంచుట కశక్యమై మహోన్నత రూపమున వెలుంగుచున్నది.

వ. మఱియు విశ్వమధ్యగంబును విశ్వాధిష్ఠితంబును విశ్వాధికంబును నఖ్యంబును నసంఖ్యంబును ననుత్పన్నంబును ననాపన్నంబును నభిన్నంబును దూరాదూరయుక్తంబును మనస్సంకల్ప వికల్పనాతీతంబును సర్వవర్ణ బహిష్కృతంబును నిరాతంకంబును నిరాభాసంబును నిరామయంబును నిరాశ్రయంబును నిర్మలంబును నిష్క్రియంబును నిర్గుణంబును నిరుపద్రవంబును శుద్ధంబును సర్వైశ్వర్యంబును శివంబును శాంతంబును ధ్యానధ్యేయ విభాసంబును ప్రపంచీకృతపంచ మహాభూత పంచవింశతిగుణ పంచబ్రహ్మ పరమాణు విహీనంబును బరమామృతంబును బరబ్రహ్మంబును ననందగు పరమ వ్యోమస్వరూపుండైన శివుండై వేదాంతవేద్యుండై యొప్పుచున్న యప్పరమేశ్వరుండైన పరశివుని బరమయోగీంద్రులు ధ్యానజ్ఞానమయంబైన శివయోగ సన్మార్గంబున నాత్మయందఁ గనుఁగొని తన్మయులై మోక్షానందంబునం బొందుదురు. సకలవేదాంత శాస్త్రపురాణసారార్థంబు శివయోగంబగుట నిశ్చయంబు, ౧౯౦

తా. మఱియు నాతత్త్వమే. విశ్వాతీతమై విశ్వాధిష్ఠితమై సంకల్ప వికల్పాతీతమై నిరాలయమై నిర్మలమై నిర్గుణమై శుద్ధమై పంచీకరించ బడిన పంచమహాభూత- పంచ వింశతి గుణములు గలపంచ బ్రహ్మ పరమాణు విరహితమై పరబ్రహ్మమని చెప్పఁబడును.

వేదాంత వేద్యుఁడగునట్టి పర శివుని యోగీంద్రులు- భక్తి, జ్ఞాన మయం బగు శివ యోగమున నాత్మయందే కనుగొనితద్రూపులై మోక్ష నందుబనుభవింతురు. సకలవేదాంత సారంబు శివయోగంబే కాని, యితరము కాదు

## యోగమహిమ.

క. జ్ఞానంబు క్రియయుఁజర్యయు
శ్రీనుత యోగంబుఁ గూడఁ శివధర్మాబో
యీనాలుగింటి నుత్తమ
మైనది యోగంబు గాదె యాగమసరణిన్. ౧౧౧

తా. జ్ఞాన క్రియాచర్యాయోగములు శివధర్మములు. ఈనాలుగింటిలో నుత్తమ మైనది యోగమనఁబడును. ప్రతియాగమము నకునీనాలుగు పాదంబులేవచింపఁ బడును.

అ. అన్నిటిలో యోగము, ఉత్తమమైనది యగుటచేతనే బ్రహ్మాదులు యోగమునే యవలంబించిరని చెప్పుచున్నాఁడు.

సీ. పద్మాసనస్థుఁడైన పద్మసంభవుఁ డొప్పు
శివయోగ విజ్ఞాన శీలుఁడగుచు
క్షీరాబ్ధిలో హరి శేష పర్యంకుఁడై
యోగ స్వానందము నొందియుండు
రుద్రుఁడంత జ్యోతి రూప ఫాలాక్షుఁడై
యమరంగ నాత్మ సౌఖ్యమున నలరుఁ
బరమ యోగీశ్వరేశ్వరుఁడు మహేశ్వరుఁ
డఖిల లోకారాధ్యుఁడై వెలుంగు
తే. గీ. యోగవిద్యా ప్రభావసంయుక్తి గాదె
యిట్టిపద్మజ ముఖ్యులు నెట్టణముగ
దత్తదైశ్వర్యమును బొందిరి తనరుటట్లు
గానశివ యోగమహిమ శక్యంబె పొగడ ౧౧౨

తా. బ్రహ్మదేవుఁడు పద్మాసనమున గూర్చుండి శివయోగమునే యభ్యసించుచున్నాఁడు. క్షీరసముద్రమున విష్ణుమూర్తియు, ఆదిశేషువు మీదఁబరుండి యోగనిద్రానందమునే సర్వదాయను భవించును, రుద్రుడును, అంతర్జ్యోతిచే సదాఆత్మానందమును జెందుచుండును. యోగిశ్రేష్ఠుఁడగు మహేశ్వరుఁడును సకలలోకారాధ్యుడై ప్రకాశించును బ్రహ్మాది దేవతలైశ్వర్యము చెందుటకును గారణముయోగ మహిమయేగాని మరొకటిగాదు. కావునశివయోగి మహిమ వర్ణనాతీతము-

వ. వృషభేశ్వరాది ప్రమథవరులును బ్రమథముఖ్యులును శ్వేతాదిలకులీశాంతంబు గాఁగల యష్టావింశతి యోగాచార్యులును సనకసనందన సనత్కుమార ముఖ్యులును వాలఖిల్య ప్రభృతులును వసిష్ఠాదులును శివయోగ జ్ఞానసంపన్నులై కదా మహానుభావులైయుండుట వెండియు. ౧౧౩

తా. వృషభేశ్వరాది ప్రమథులు- లకులీశాది- అష్టావింశద్యోగాచార్యులు- సనకసనందన సనత్కుమారులు- వాలఖిల్యాదులు- వశిష్ఠాదులు మహానుభావులై యుండుటకు గారణము శివయోగ జ్ఞాన సంపన్నతయే గదా?

క. శుకవామదేవ ముఖముని
నికరము మత్స్యేంద్ర ముఖ్యుల్ నిజసిద్ధులుఁ బా
యక జనకాది మనుజ నా
యకులును శివయోగ నిరతులైన మహాత్ముల్. ౧౧౪

తా. శుక- వామదేవాది మునులు- మత్స్యేంద్రాది సిద్ధులు- జనకాది రాజులు నీ శివయోగమందేతమ జీవిత మును గడిపిన మహాత్ములు-

క. కావున యోగాభ్యాసముఁ
గావింపఁగ వలయు మోక్షకాంక్షాత్మకులా
కైవల్యము యోగికి గా
కేవిధమున నైనఁగలదే యితరుల కెందున్. ౧౧౫

తా. కావున ముక్తిని గోరు వారు యోగము నభ్యసించ వలయును, కైవల్యము యోగికే గలదు. ఇతరులకు లేదు.

క. యోగం బెఱిఁగిన మాత్రనె

యోగానురుమతి క్రొలయుచే నఖిలసుఖములుల్
బాగుగఁ జలిపిన లేదఁట
యోగాభ్యాసముఁ గల్గుచే నుపఫల మరుదే. ౧౧౬

తా. కర్మలెన్ని యొనర్చినను యోగము తెలిసికొని యంత మాత్రమైనను ఫలంబు రాదు. శివునియోగాభ్యాసముఁ గల్గెడి ఫలంబునకు మితియున్నదా? లేదని భావము.

చ. వనధి పరిష్కృతావని సు ♦ వర్ణమునం బూరించి వేడ్కని
చ్చిన విపులార్థకాంక్షను వ ♦ చించుట యానికి గారణంబు ని
ర్ధను దెసనైన భక్తియును ♦ దత్పర బుద్ధియుఁ గ్లియుండా నేఁ
గనుఁగొనిపాత్రమాటనైన ♦ గంగఁదగుర్ శివయోగమెల్లెడర్ ౧౧౭

తా. ఈయోగమును ధనకాంక్షచేఁ జెప్పకూడదు. భూమిలోని ధనమంత యిచ్చినను, అపాత్రునికి యోగము వచింప కూడదు. నిర్ధనుఁడైనను భక్తి తాత్పర్యములు గలిగినచో పాత్రుఁడగుటచే నతనికి విద్య యొసఁగఁ దగును.

వ. అదియెట్లంటేని. ౧౧౮

తా. అదియెట్టులన.

ఉ. పెన్నిధిఁ గన్నవాఁడు మది ♦ పెంపునఁ బ్రాణసమాన మిత్రుఁడై
యున్న మహాత్మునిన్ గదిసి ♦ యొయ్యనఁ జెప్పినఁ జెప్పుఁగాక యే
పన్నలకైనఁ జెప్పినవి ♦ పద్దళ గొందదె యట్లుగాన వి
ద్యోన్నతుఁడైన పాత్రునకు ♦ నుత్తమ యోగముఁ జెప్పఁబొప్పగున్

తా. పెన్నిధి గన్నవాడు తనప్రాణ మిత్రునికి జెప్పినను జెప్పవచ్చునుగాని, యితరులకుఁ జెప్పినచో నాపదలపాలు కావలసి వచ్చునుగదా? కావున విద్యోన్నతుఁ డగు పాత్రునికే యీవిద్యనుగూర్చి బోధించ వలయును.

శా. భూదేవోత్తమ కోటికిం బ్రియముతో ♦ భూభాగముల్ హేమర
త్నాదుల్ గూడఁగ నిచ్చుపుణ్యము రయం ♦ బారఁగసిద్ధించు నం
ద్రాదిన్ సజ్జనపాత్రముం గనిదయాచే యత్తాత్ముఁడై బ్రహ్మవి
ద్యాదానంబొక యింతమైనఁగృప సే ♦ యంజాలుసుజ్ఞానికిన్. ౧౨౦

తా. పాత్రుడగు జ్ఞానవంతునకు దయాశీలుఁడై బ్రహ్మవిద్యాదానము చేసినచో కోటిమంది బ్రాహ్మణోత్తములకు భూదాన- హిరణ్యదాన- కన్యాదానాది దానములుచేసి

వ మహా పుణ్యము లభించును.

క. లోకము లోపల మాయా
వ్యాకుల చిత్తమున నున్న యధములు గలరా
లోకింపఁదలఁప వారికి
నోకిల్లే తెంచు నెపుడు యోగంబన్నన్. ౧౨౧

తా. లోకమునందు మాయచే వ్యాకులమైన చిత్తముగల యధములకు యోగమనిన రుచించదు.

వ. కావున. ౧౨౨

—:అధికారి లక్షణము:—

ఉ. సమయవిశేష వాదఘన సంతమసంబున లీనమానుషా
ధముల నెఱుంగనీక సతతంబును గుప్తముచేయఁగాఁదగున్
సమగురు సాంప్రదాయకులు చర్చయుఁజూచి యెఱింగి రేసిఁజి
త్తములర యోగ భావములఁ దత్పరతంజనుఁజర్ప సేయఁగన్. ౧౨౩

తా. మోహాంధులై సమయములను వీడి వాదించెడి మానుషాధములకు యోగము చెప్పగూడదు. సమానమైన గురుసాంప్రదాయకులు- వారలొనర్చు చర్చలఁజూచి యోగమును జర్పించ వలయును. అటగా నితరులు యోగమును జర్పించ వచ్చినపుడు గాని, శిక్ష తాను యోగము చెప్పినపుడు గాని, గురు సంప్రదాయముల నతిక్రమించక మెలంగు సత్పాత్రునకే యీవిద్య చెప్పవలయునని భావము.

క. శ్రోతవ్యము మంతవ్యము
పూతవిధి ధ్యాసితవ్యమును ద్రష్టవ్యం
బైతనరు నదియు నాత్మా
ఖ్యాతుల శివతత్త్వమిదియ యర్థంబరయన్. ౧౨౪

తా. ఈ శివతత్త్వము విషయమై పెద్దలవలన వినవలయును. విన్నది మనన చేయవలయును మననచేసినది ధ్యానించ వలెను. ధ్యానించినది చూడవలయును.

క. ఈయర్థ మిట్లుగావునఁ
బాయక విద్వత్సు గోష్ఠిఁ బరమార్థాప్తిన్

ప్రాయము దెలియంగ మథనము
సేయంగ నిర్మలత గలుగునే శివయోగగతిన్. ౧౩౫

తా. కావున నరణి మథించగా వహ్ని జనించినట్టుల, విద్వాంసుల యొక్క ప్రాయము దెలియుటకై విమర్శను చర్చించిన గాని శివయోగాశా సక్తి విమయక నైర్మల్యము గలుగదు.

— ✻ యోగ పరిజ్ఞాన మార్గములు. ✻ —

క. నిజగురుల వలనఁ బాదము
నిజయుక్తినిఁ బాదమును మరి నీతిజనులన
ద్భజనమునఁ బాదమును పర
తుజనంబునఁ బాదమును గనే దా తెలియఁ దగున్. ౧౩౬

తా. ఒకపాలు శివ గురువుల వలనను, మరియొక పాలు తనయుక్తి వలనను, విద్వాంసుల సేవవలన నొకపాలును, పరతత్త్వము పూజించుటవలన నొకపాలు సంయోగ యోగ జ్ఞానము నై తెలిసికొన వలయును.

క. అటుగాన తెలివి సంతయు
నటుగా వలయునను నిట్టి యాగ్రహ మల్లన్
తటవిడిచి యజ్ఞుఁడైనం
బటు వైక్రమ పరిచయమునఁ బ్రాజ్ఞుఁడగు దుదిన్. ౧౩౭

తా. కాఁబట్టి నా తెలివి చేతనే దీనినంతయు దెలిసికొన వలె ననుచు కూడా పట్టి, యజ్ఞానియైనను గ్రమముగా దీనినభ్యసించిన విజ్ఞాని యగును.

క. శ్రుతిసార మైనవిద్యా
స్థితిరుచి యెఱుగంగ లేనిశ నష్టాత్మకులీ
మతమును హాస్యము సేయుట
నతిగోప్యము సేయవలయు నదియెల్లపుడున్. ౧౩౮

తా. వేదసార మైన యీయోగ విద్యాప్రభావ మెఱుగ లేక కొందఱు మూఢులు హాస్యము చేయుదురు. కాన నెల్లపుడు దీని నతిరహస్యముగా నుంచవలెను

వ. మఱియును ఇంచుమహా పాతకోప పాతకాది సమస్త పాపభంజనం

జూచు సంతతమనోజ్ఞ రంజనంబును, నణిమాద్యష్టసిద్ధి ప్రదంబును నసేకాద్భుతాస్పదంబును, నఖలదేవతా గమ్యంబునున నాపమ్యం బును, నకామ్యంబును నైన సద్గురు కటాక్షనిరీక్షణ మాత్రంబునం గరతలామలకప్రాయంబైన బ్రహ్మవిద్యాభ్యాసంబునకుఁ బ్రథమ కాలంబున ననేకవిఘ్నంబు లుత్పాదిల్లు. అనియెయ్యది యనిన ౧౨౯

తా. పంచమహాపాతకములు- ఉపపాతకములు " మొదలగు సమస్త పాపముల కళిపంజేయునది సుమనోహరము, అణిమాద్యష్టైశ్వర్యప్రాపకము- సద్గురు కటాక్ష నిరీక్ష మాత్రంబునసే కరతలామల కమగు నీబ్రహ్మ విద్యాభ్యాసంబున మొట్ట మొదట యనేక విఘ్నములు సంభవించును.

— * యోగాభ్యాసికి గలుగువిఘ్నంబులు. * —

శా. ఆలస్యంబును సంశయంబు నసుమ ♦ ర్త్యప్రాత దుర్గోష్టి యొక కాలకా లేమియు మంత్రవాదమునునా ♦ నావ్యాధులుకా హేమ వి ద్యాలీలాభిర తత్వముకా మొదలుగా ♦ నత్యద్భుతం బొందఁ గా వాలాయంబుగ బ్రహ్మవిద్య కెడమై వారించునీవిఘ్నముల్. ౧౩౦

తా. ఆలస్యము- సంశయ ము దుర్జన సహవా సము- దరిద్రము- మంత్ర వాదము నా నా వ్యాధులు- హేమవిద్యార్జన బుద్ధియు- మొదలగు గాగల విఘ్నంబులు సంభవిం చి బ్రహ్మవిద్యాభ్యసనమును పాగనీయవు.

క. గణనాథుఁడు సర్వామర
గణమును భైరవుఁడుమాతృ ♦ కాపతియును భా
రణిలోపల నీవిద్యకు
గణుతింపఁగఁ జారవిఘ్న ♦ కారులు దలపకా. ౧౩౧

తా. ఈయోగ విద్యాభ్యాసమునకు, గణపతి, దేవతలు- భైరవుడు- మాతృకాపతి, యను వారలు విఘ్న మొర్తురు.

వ. కావునవారలు నత్యంత శ్రేయస్కరంబై సంసార తరణకారణం బై బ్రహ్మవిద్యాను కూలంబైన యోగాభ్యాస కాలంబు మొదలు పుత్రేషణ ధనేషణ దారేషణంబులను నేషణత్రయంబు వలన నత్యా

నురక్తియు నుదరపోషణార్థంబైన పరతంత్రత్వంబు నుస్వస్థాన ప
రిత్యాగంబును బ్రకృతిబంధ దూషణంబు వలనమనో వైకల్యంబు
ను మొదలుగా నపరిమిత దుఃఖ వ్రాతంబుల సంకేతనంబగు నట్లుగా
జేయంజాలుదురు. అయినను నీవిఘ్నంబులకు నించుకంతైనను జలిం
పక ధైర్యగుణావలంబించి సద్గురుపాదపద్మంబులు మనంబున ని
లిపి గణాధిపతిం బ్రార్థించి సర్వదేవతామయుండైన పార్వతీశ్వరు నా
రాధించి సదానుసంధాన పరుండగు సాధకునకు నిఖిలక్లేశ మోచ
నంబై సర్వవిఘ్నప్రశమనంబై సమస్త పాతకనాశనంబై సకలశో
భన కరంబై నిత్యానందంబును బొందు. మఱియును. ౧౩౨

తా. వీరబ్రహ్మ విద్యానుకూలంబైన యోగాభ్యాసంబున ధనేషణ- దారేషణ- పుత్రేషణములను ఈషణత్రయంబునం దత్యంత ప్రేమను గల్పించుచు ఉదరపోషణంబునకైన పరాధీనత గల్పింతురు. స్థానభ్రష్టత్వము ప్రపంచ బంధ దూషణమువలన మనో వైకల్యమును గల్గింతురు. ఇంకననేక విఘ్నంబులు గల్పింతురు. ఎన్ని విఘ్నంబులు గల్గించినను ధైర్యమవలంబించి గురుపాదములు మనంబున దలంచి గణపతిని గొల్చి శివుని నారాధించి సదా బ్రహ్మధ్యాన పరుడగు వానికి సకల విఘ్నంబులు శాంతించి సమస్త పాతకములు నశించి నిఖిల ఫలములు గల్గును.

### ఈషణత్రయ వివరము.

పుత్రేషణము- దారేషణము- ధనేషణము- ననువానికి నీషణత్రయమని పేరు. ఇందు పుత్రేషణ యనగా నెట్టిది? అందువలన గలిగెడి లాభమేమి? యని ప్రతిమానవుడును విచారింపదగినది.

పుత్రేషణము- పుత్ర-ఈషణ- అనఁ బుత్రప్రేమయని యర్థము. "పున్నామ్నో నరకాద్యస్మాత్ పితరం త్రాయతే స్వయం। తస్మాత్పుత్ర ఇతిప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥" పున్నామ నరకమునుండి రక్షించువాడు గనుక పుత్రుడని చెప్పఁబడుచున్నాడు. "పుత్రేణ లోకాన్ జయతి" పుత్రునిచేతనే లోకములు జయింపవలెను. "అపుత్రస్యగతిర్నాస్తి స్వర్గో నైవచ నైవచ" అని పుత్రులులేనివారికి గతులులేవనియు, స్వర్గముకూడలభించదనియు, నుడువబడినది. సర్వత్ర జయమన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛేత్పరాజయం- సర్వత్రతానుజయమునుబొందవలెను. పుత్రునివలన తాను పరాజయము నొందవలెను. పుత్రులులేనిచో తనకు గృహమునందు గావలసినవస్తువులు తెచ్చుటకును వృద్ధాప్యమున నుపచారము చేయుటకును నితరులక్కఱకు

కాదుగదా! పుత్రులున్న వారికే ఇహపర సుఖములు గలవు శ్లో. ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్। అనివచింపఁ బడుటచే తర్పణాదుల వలనఁ పితృ ఋణముతీర్చ వలయును గదా? పుత్రులు లేనిచో నదియెటుల సంభవించును? కావునఁ పుత్రులఁ గోరుటయు ఆ పుత్రులయందుఁ బ్రేమయుండుటయు సహజము. కాన పుత్రులుండుటయే మంచిది. అనికొందఱందురు. కాని, యటులఁబల్కుటయుక్తముకాదు.

లోకంబునఁ బుత్రులు లేనంతవరకు లేనిదుఃఖము. ఉండిన, దుండగీడయినచో నదియొక దుఃఖము. మూర్ఖుడయినచో నిరంతరదుఃఖము. కన్యాసంతు డయిననుననుకూలుడు కానిచో నదియొకదుఃఖము. అనుకూలుడయినను సరియగు కన్య లభింపకున్న నదియొక దుఃఖము. కన్యక లభించి వివాహమయిననుగృహకల్లోలములవలన నప్పుడును దుఃఖమే. తల్లిదండ్రులు జీవించియుండి వారికన్నులయెదుట పుత్రులు మరణించినచో వారి ఘోష చెప్పనలవిగాదు. యాజ్ఞవల్క్యోపనిషత్తునం దిటుల చెప్పఁబడియున్నది.

శ్లో॥ అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరం।
లబ్ధోహి గర్భపాతేన ప్రసవేన చ బాధతే।
జాతస్య గ్రహరోగాది కుమారస్య చ ధూర్తతా।
ఉపనీతేప్య విద్యత్వ మనుద్వాహశ్చ పండితే।
యూనశ్చ పరదారాది దారిద్ర్యంచ కుటుంబినః॥
పుత్రదుఃఖస్య నాస్త్యంతో ధనీచేన్మ్రియతే సదా॥
ఏవం వివిచ్య పుత్రేసా ప్రీతింత్యక్త్వా నిజాత్మని।
నిశ్చిత్య పరమ ప్రీతిం నీష్యతే శివహానిశం॥

అని పుత్రులు పుట్టక పోయిన తల్లి దండ్రులకు దుఃఖమధికము. ఏలయన తల్లిదండ్రులు సంతానము లేకపోయె నేయని విచార పడుచు మొదట సోదియడిగి పేరు కట్టింతురు. పిమ్మట నూనెబుడ్డల వాళ్లని నూనె వేసి ప్రశ్నయడుగుదురు. తర్వాత రావి చెట్టుకు ప్రదక్షిణములు ప్రారంభింతురు. అనంతరము దయ్యములు పట్టెననియు పీడకలలువచ్చు చున్నవనియు, మంత్రశాస్త్ర వేత్తలచే జపములు చేయింతురు. పదపడి తీర్థక్షేత్ర యాత్రలకై బయలుదేరుదురు. ఇన్ని విధముల శరీరమునకాయాసము ధనవ్యయమును బుత్రులు పుట్టక గల్గింతురు.

పుట్టినపుత్రులు కూడ ననేక దుఃఖంబుల గల్గింతురు. కొందఱు, పుత్రులు లేరని రాత్రింబవలు దుఃఖించువనితలకు బుట్టిమూడునాళ్లు పట్టకగలు ముద్దుమురిపెములచూపి పురిటిలోనే సంధికొట్టి చనిపోవుదురు. కొందఱు గర్భంబులోనే మరణింతురు. పెరిగి వించు వర

కాకొంత జనుపప్రసవవేదనను సహింపఁజాలక మంత్రసాని మొదలగువారు అయ్యో తాయి మాకేమైన మొక్కులున్న దైవములున్న మొక్కుకొండి యని మొక్కులు మొక్కుదురు. అవశి రాత్రిఁబగందే సందులు త్రిప్పి వైద్యులకై పరుగెత్తుదురు. అప్పటికి సుఖ ప్రసవము కాకున్న కొడుసాలుకకు మందు పెడితే యున్న నాలిక యూడిపోయినటుల పెద్ద ప్రాణాపాయము రాకుండ చూడుఁడని దుఃఖించుచుందురు.

ఇంతకష్టపడికొడుకుపుట్టినబాలగ్రహములు-పిశాచములు-దృష్టి దోషములు మొదలగువాటినుండి కాపాడవలెను. ఉపనయనముచేసి విద్యాభ్యాసంబున కొంగడంగినవిద్యరామిచే దుఃఖము దుర్మార్గుడగుటదుఃఖము. భార్యరోగిష్ఠియై క్షయాదిరోగంబుల పుల్లవలెనయి తేవలేకున్న, చిన్నవాడగుచా మొగభర్త చనిన, స్త్రీలసాంగత్య మొనర్చి నదుఃఖము. పిల్లలుపది మంది పుట్టినతినుటకు కూడులేకక్షోభించు కుమారునిచూచి తల్లిదండ్రులు పడుదుఃఖము వర్ణనాతీతము. ఈరీతివిచారింపగా బుత్రదుఃఖమునకంతములేదు. కాన పుత్రులులేకున్నను ఉన్నను దుఃఖము తప్పదు.

పుత్రులాచరించు తర్పణాదులు పుత్రులసద్గతికే కారణమగును గాని, తల్లిదండ్రుల శాంతమునకుఁ గారణము కానేరవు అటులయినచో, తల్లిదండ్రులు బ్రతికియున్నపుడే వారిపేరుచెప్పి మరియొకరికన్నము పెట్టిన తల్లిదండ్రుల యాకలితీరునా? కొడుకు దుర్మార్గుడై కడుపునిండ మెక్కుచు యింటిలో నొక పనియు ముట్టుకొనక యున్నవారి నెందరిని చూచుటలేదు ముసలివారైనను తల్లిదండ్రుల ఘోషపుచ్చుకొను కుమారుల నెందరిని వీక్షించుటలేదు.

పుత్రులు లేనిచో, పరలోకములు లేవనియు, ముక్తి లేదనియు, ననఁగూడదు. సనక సనందనుఁడు సనత్కుమారుఁడు సనత్సుజాతుఁడు శుకుఁడు హనుమంతుఁడు భీష్మాదు మొదలగువారు పుత్రులులేకపోయినను ముక్తినొందలేదా? శ్రీకృష్ణునిగన్న దేవకీవసుదేవులు కృష్ణనిర్యాణానంతరము దుఃఖమునొందలేదా? ధృతరాష్ట్రుఁడు తననూర్గురి కుమారులవలనదుఃఖమునొందలేదా? దశరథుఁడు సత్పుత్రుఁడుండియు, పుత్రశోక మనుభవించలేదా? వీరందరు పుత్రులవలనగాక తాముచేసి కొన్న పుణ్యమువలననే ముక్తినొందిరి.

శ్లో. యస్మిన్ జాతే భగేపూర్వే। తస్మిన్నేవ భగేరమే
యామాతాసా పునర్భార్యా। యాభార్యా జననీ తథా।
యఃపితాస పునఃపుత్రః। యఃపుత్ర స్సపునః పితా॥
ఏవం సంసార చక్రేణ। కూపయంత్రే ఘటాదివ॥

ఆశ్చర్యకరము లంకు తనతండ్రియే తనకుబుత్రుఁడును, తనతల్లియే తనకుభార్యగను

నగుననుటచే బుత్రులవలన ప్రయోజనము లేదు. ఇందుకొక చిన్న కథ చెప్పెదను. ఆలకింపుము

ఒక బ్రాహ్మణుఁడు గలఁడు. ఆతని తల్లిదండ్రులాతని యింటియందున్న వభరూపమును కుక్కరూపమును ధరించియుండిరి. తండ్రియారాధన దినము వచ్చినది. ఆ వాఁడాతఁడు పాలు దీసికొని యింటిలో బెట్టెను. ఒక పాము వచ్చి యందు విషము గ్రక్కెను. అది చూచి కుక్క పాలు పారబోసెను. బ్రాహ్మణుఁడు దొడ్డిలోనికిఁ బోయి యింటిలోనికి వచ్చునప్పటికిఁ కుక్క పారపోసిన పాలు చూచి దానిని చావగొట్టి యాహారము పెట్టకుండ కట్టివేసెను. ఆ రాధన సందడిలో నెద్దుకు మేత మరచిపోయెను. అర్ధరాత్రివరకు ఆకలిచే బాధపడుచున్న అవృషభశునకములు రెండును, వీఁడు మనకు పెట్టు శ్రాద్ధమువలన మనకేమి లాభము ఆకలితో చచ్చిపోవుచుంటిమి గదా? యనుకొనెను. సకలభాషా వేదియగు నా బ్రాహ్మణుండదివిని చాలసేపు చింతించి వాటియాకలి దీర్చెను. కావున పుత్రులవలన లాభము లేదు.

"అపుత్రస్య గతిర్నాస్తి" యనగా పున్నామనరకము అనఁగా దుఃఖమునుండి రక్షించువానికి బుత్రుఁడని పేరు. అది బ్రహ్మజ్ఞానమే కాని వేరు కాదు. అట్టి పుత్రశబ్ద వాచ్యమగు బ్రహ్మజ్ఞానమును సార్జించిన వాడే సత్పుత్రికుడు. మృగపక్షి మనుష్యులలో మృగములకు బుత్రప్రేమయు పక్షులకు భార్యాప్రేమయు మానవులకు ధనప్రేమయు నధికములు.

దారేషణము.

దారా. ఈషణము" అనగా భార్యయందలి ప్రేమ. సంసారము దుఃఖకరమైనది. సంసారమునకు మూలము భార్య. భార్య రాకమునుపు రాలేదని దుఃఖము. వచ్చిన తర్వాతను అనుకూలవతి కాకపోయినను దుఃఖము. చెప్పినమాట వినక గయ్యాళి యైనచో దుఃఖము. ఇంటిలోనిగ్గవాళ్లలోలములు నిరుగు పొరుగు వారితో చెప్పుచున్నచో దుఃఖము. మూర్ఖురాలైన దుఃఖము. రోగవంతురాలైన దుఃఖము. పాకము రుచిగా చేయలేనిదైన దుఃఖము. రూపలావణ్యములు లేనిదైన దుఃఖము. గొడ్డురాలైన దుఃఖము. తనభర్త పడరాని కష్టములుపడి యెటులో పొట్టబోసికొనుచున్నదని విచారించక చీరెలు రవికలు సొమ్ములు లేవనియు, తెచ్చిపెట్టుమనియు, ఎప్పుడు గోరాడునదియయినచో, దుఃఖము. రోగపిశాచాది గ్రహాక్రాంత యయినచో, మంత్రవాదులను వైద్యులను, పిలువలేకయు, బాగుచేయిచలేకయు, బడలిక వష్ట వ్యాకులితము. మంచిగుణములు సంతానము చక్కదనముగలిగి యనుకూలవతి గానున్న యా భార్య కాలవశంబున మరణించినచో, అందువలన గలుగుదుఃఖమునకంతము లేదు. వ్యభిచారి యయినచో, గలుగుదుఃఖమునకు మితిలేదు. తనగౌరవమునకు హానిగలిగించునది గాని, దొంగలనము చేయునది

గాని, యయినచో, అదియొకదుఃఖము కాపురమునకువచ్చినది మొదలు తోడికోడండ్ర తో కలహించునది గాని, కోపిష్ఠి గాని, కుచ్ఛిత్తముగలది గాని, తనమాటవిననిది గాని, యయి నచో, నదియొకగొప్పదుఃఖము. ఇటుల విచారించినచో, దుఃఖమునకు మూలము భార్యయే యగుచున్నది. ఇట్టిభార్యయున్నను లేకున్నను నొకటియే కాని, స్త్రీలకుజెప్పినసద్గుణము లుగల భార్యనువదలుట మహాపాతకము.

స్త్రీల సద్గుణము లెవ్వి యన శ్లో. కార్యేషు మంత్రీ కరణేషు దాసీ । భోజ్యేషు మాతా శయనేచ రంభా। ధర్మానుసారీ క్షమయాధరిత్రీ షాడ్గుణ్యభార్యా కులముద్ధరంతి॥

కార్య విచారణమున మంత్రివలె నాలోచనము నేకాంత చెప్పునో, పనుల య డబానిసవలె నేయువతి యుపచారములు చేయునో, ఆహారము పెట్టునపు డేనారీమణి త ల్లివలెబెట్టునో, పాన్పున రంభవలె నలంకరించుకొని నేప్రియగా మణి క్రీడించునో, ధర్మ కార్యములందే కాంతతోడునీడై నెరవేర్చునో, ఓర్పునందే కాంత భూదేవివలె ప్రకాశిం చునో, ఏ యువతీ మణి దీర్ఘసుగుణగలిదో, అట్టి కాంత కులము నుద్ధరించుటయే గాకభర్త కు మోక్షమున సహాయపడును.

అగ్నిసాక్షిగా గ్రహించిన మహాపతివ్రతయగు భార్యనువిడుచుట మహాదోషము. స్త్రీనివిడిచినచో, సుఖమనియెంచి కొందఱు యేస్త్రీని విడువవలయునో దెలియకయను రాగవతియగు దమభార్యలను విడిచిసన్యాసులగు చున్నారు. కొందఱుభార్యమీద కో పమువచ్చి సన్యసించుచున్నారు. తలలుబోడి యయిన తలపులు బోడులా, మనునటుల జం దెము దెంచికొని జుట్టు గొరిగించుకొని, కాషాయబట్టలు కట్టుకొని దండముపట్టినంత మా త్రమున సన్యాసి కాజాలడు. మనస్సును విడువనిది యేయాశ్రమ మందున్న నొకటియే. కా వున భార్యయందెంత ప్రేమయుంచ వలెనో నంతయే నుంచుట రాజయోగమార్గము.

ఎల్లప్పుడుభార్యాసక్తుడగుటయే దారేషణము. భార్యనొకానొక సంబంధమువల న వచ్చినదిగనుక ఋణసంబంధమని తలంచితత్వజ్ఞాని విశేష దుఃఖము ననుభ వింపడు.

శ్లో. కామః క్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత॥
మాతానాస్తి పితానాస్తి నాస్తి బంధు సహోదరాః॥
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో. ఆశయాబద్ధ్యతే లోకేకర్మణా బహుచింతయా
అయుఃక్షీణం నజానాతితస్మా జ్జాగృతిజ్జాగృత।
జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః
సంసార సాగరం దుఃఖం తస్మాజ్జాగృత జాగృత॥

తా. జ్ఞానరత్నము నపహరించుటకై మనదేహమందు కామక్రోధ లోభులను దొంగ లున్నారు. జాగరూకుఁడవు గమ్ము. విచారింపఁగ (దల్లిగాని, తండ్రిగాని, బంధువులుగాని, సహోదరులు గాని, ధనముగాని, గృహముగాని, యేదియును లేదు. అంతయు ఋణసంబంధము వలన వచ్చినదే.

మానవులు కర్మబద్ధులై ఆశాపీడితులగు చున్నారు గాని, తమయాయువు క్షీణించి పోవుట గుర్తించుట లేదు. జన్మయే దుఃఖము- అందు ముసలితనము మఱింత దుఃఖము. నిరంతరము భార్యవలన దుఃఖము. ఇది యది యననేల? సంసార సాగరమే దుఃఖము. కావున జనులారా! జాగరూకులై యుండవలయునని భావము.

శ్లో. సత్యం మాతాపితా జ్ఞానం ధర్మో భ్రాతాదయాసఖీ।
శాంతిఃపత్నీ క్షమా పుత్రఃషడైతే మమబాంధవాః॥

తా. సత్యమే తల్లి. జ్ఞానమే తండ్రి. ధర్మమే సహోదరుఁడు. దయయే సఖి. శాంతియే భార్య. క్షమయే పుత్రుఁడు. వీరారుగురును నా బాంధవులు సుమీ? యని పాండవ గీతలందు (జెప్పినటుల పరమాపశాంతి యను భార్యతో (గ్రీడించుచు, జీవన్ముక్తుఁడై బహిస్సంసారమును- మమత్వమును వదిలి జ్ఞాని సుఖించ వలయును.

శాంతి భార్యతో (గూడి నను- లనభార్యను వదల వలయునని కర్మయోగులును, అవసరము లేదని రాజయోగులును నందురు. దారేషణమనఁగ:— శాంతి భార్య యందత్యం తానురాగము గలిగి యుండుటయే యని యర్థము.

*ధనేషణము.*

ధనమందు మిక్కిలి ప్రేమ యుండుటయే ధనేషణము. శ్లో. యస్యాస్తి విత్తం సనరఃకులీనః సపండితస్సశ్రుతవాన్ గుణజ్ఞః। సఏవవక్తా సచదర్శనీయః। సర్వేగుణాః కాంచన మాశ్రయంతి" యని భర్తృహరి వచించినటుల సర్వగుణములు కాంచన మాశ్రయించి యున్నవి. ధనమున్నవాఁడే గొప్పవాఁడు. విద్యావంతుఁడు. అందరు నతని నే గౌరవింతు

రు, ఆశ్రయింతురు" అనిధనమునకుఁ గొందఱు మితిలేని గౌరవము ప్రతిపాదింతురు, గాని, అంతయువ్యర్థము.

శ్లో. అర్థానామార్జనే దుఃఖమార్జితానాంచ రక్షణే
లాభేదుఃఖం వ్యయేదుఃఖం తస్మాజ్జాగ్రత జాగృత॥

తా. ధనము సంపాదించుటయే దుఃఖము. సంపాదించిన ధనమును-దొంగలవలనను-రాజులవలనను- అపహరింపకుండునటుల సంరక్షించుట యంతకంటె దుఃఖము. ధనలాభము గలిగినను- ధనవ్యయము గలిగినను- దుఃఖము తప్పదు.

ధనమితరుల కిచ్చిన నెగవేయుదురు. పూడ్చిపెట్టినచో, తానుసన్నిపాతాదివ్యాధుల వలన స్మృతిలేక చనిపోవఁగా, నదిమంటి పాలగును.

ధనమున్నచో, బంధువులు- సోదరులు- స్నేహితులు- భార్య- అందఱు దాని నపహరింపఁ జూచుటయగాక, ధనవంతుని జావఁ గోరుదురు. ఇందుకొక దృష్టాంతము వినుండు.

శివజ్ఞానియనునొక తత్త్వవేత్త, తనభార్యతో నరణ్యమునకుఁ బోయి కట్టెలుకొట్టుకొని వాటిని విక్రయించి జీవించుచుండెను. ఒకనాఁడాతని కొక చెట్టు మూలమును ద్రవ్వ- అందొక గంగాళము కనఁబడెను. అందలివట్టిని శుభ్రముగాఁ దీయనవరసులుగన్పించెను. దానినిజూచి యాతఁడు మిగుల భీతిజెంది పరుగెత్తుచుఁ బోయెను.

ఇరువురు బాటసారులాతని కెదురుపడి" అయ్యా! ఎక్కడికిఁ బరుగెత్తుచున్నావనెను. ఇచ్చటనొక భూతముగలదు. చూపించెదను. రండని యాశివజ్ఞాని వారిరువురికిధనమును జూపెను. వారాతని జూచి" నిజముగా దయ్యముగలదు. పొమ్మని చెప్పి, యాతఁడు పోవఁగనే ధనమునంతయు- వారిరువురుమూటఁ గట్టికొని,యొకగ్రామ సమీపమునందు గలవనమును బ్రవేశించిరి.

వారిలోనొకఁడు, తమ్ముఁడా! నీవుగ్రామమునకేగి ఫలములు- మిఠాయిని-వేసికొని రమ్మనిపంపెను. అతఁడు వెంటనే వెళ్లితిను బండారము తీసికొను నపుడు మనంబున నీ ధనమంతయు మాయన్నను జంపిన దీసికొనవచ్చునుగదా! యనితలంచి తినువస్తువులలోవిషము కల్పికొని వచ్చుచుండెను.

అన్నయు, నాతమ్ముఁడు బ్రదికి యున్న భాగము పంచిపెట్టవలసి యుండును గనుక రాఁగానే చంపివేయుట మంచిదని తలంచి చాకునకు బాగుగాఁ బదును పెట్టి సిద్ధముగానుండెను.

తమ్ముడువంగి క్రిందమూట బెట్టుచుండగనే యన్న చాకుతో వాని మెడయదిమి బట్టిపరపర గోసివేసెను. ఆహా! నేటికిధన మంతయునాకు సంభవించుయోగ మున్నదనిసంతసించెను. ఫలహారముచేసి యింటికివెళ్లఁ దలఁచి తమ్ముడు తెచ్చిన మిఠాయి-ఫలములనుదినె యాతఁడుగూడ ప్రాణము విడిచెను.

ధనప్రభావము చూచితిరా? సోదరులిరువురును ప్రాణము విడువవలసి వచ్చినవారైరి. "మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయనమో నమః" యనితల్లిదండ్రులతోఁ గుమారులతో విరోధమును బుట్టించుధనమునకుసమస్కారమే యోగ్యము గాని, అపేక్షయుచితము గాదు.

ధనము సంపాదించినను— సంపాదించినవాని కనుభవమున్నదో, లేదో, యెవరును జెప్పఁజాలరు. పలువురు ధనమును సత్యమాడియో, యసత్యమాడియో? సత్కార్యము చేసియో, దుష్కార్యము చేసియో, పడరాని యిడుమలఁబడి సంపాదించియు ననుభవము లేక ధనపిశాచములై మెలంగుటను మనము చూచుచునే యున్నారము. కష్టార్జితము గూడ ననుభవము లేని యొక బ్రాహ్మణుని కథనాలింపుఁడు.

ఉత్తర దేశంబున గౌరీపురమను గ్రామము గలదు. అందొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడు ప్రతిదిన మొక రూపాయియైన- సోలెడు నూకలకు దక్కువ లేకుండ సంపాదించి గాని భుజింపఁడు. తానుసంపాదించిన డబ్బు వేయుటకొక యరుగు కట్టించి యందు రూపాయి వెడల్పుగల నొక బెజ్జము నేర్పచెను. ప్రతి దినముతాను సంపాదించిన రూపాయలను నాబెజ్జములో గుండ వేయుచుండును.

ఒక నాడొక యాత్రికుఁడు కాశికిఁబోవుచు మార్గ మధ్యయందుగల వీరింటికి వచ్చెను. అతఁడయ్యా! మీకుఁగూడ నేనేసామగ్రిని దెచ్చి పెట్టుదును- వంటచేసి పెట్టుడనెను. అందు కాతని భార్య సమ్మతించెను.

వంట యయినది. కాశికిఁబోవు బ్రాహ్మణుఁడు కని పెట్టుకొని కూర్చుండెను. ఇంటి బ్రాహ్మణుఁడు రాలేదు. "అయ్యా! మీరుభోజనము చేయుఁడు. మావారికిఁబనికి వచ్చునని యాగృహస్థురాలు పలికెను. అతఁడా పోశనము బట్టి భుజింప నారంభించెను. ఇంతలో "గల్లు" మను శబ్దము వినవచ్చినది. అతఁడు సందేహపడుచుభుజించి లేచెను. గృహ యజమానుఁడు కూడ పడిగట్టుకొని భుజించెను.

యాత్రికుఁడు నాలుగు రోజుల వరకచ్చటే నివాస మొనర్చెను. ఇంటి విషయము కనిపెట్టెను. బ్రాహ్మణుఁడు యాయావారమునకు- బ్రాహ్మణి చెరువునకు వెళ్లుటను జూచి మూలనున్న గడ్డపారతో, తను పండుకొను చున్న యరుగు మీది బండను తీసివైచెను. ధనము కన్నులకు మిరుమిట్లు గొల్పుచుండెను. ఉత్సాహము బడికొని ధ

నమును దీసికొనుటకై చెయిపెట్టెను. ధనదేవత యాతనిచేతిని బట్టికొని యాశరీరవాక్కు-తో- " ఓబ్రాహ్మణుడా! ఈధనము నీదికాదు- చెమట దీసివేయుచు శ్రమలకోర్చిసంపాదించు నీబ్రాహ్మణు నిది గాదు. కాశీలోనుండు శంకరయ్యయను నొకరజకునిది. కావలసినచో నాతని వద్దనుండి చీటీని తెచ్చి తీసికొని పొమ్మనెను.

అంత నాబ్రాహ్మణుడు యథాప్రకారముగ బండను వేసి యేమియు నెరుగనివానివలె కూర్చుండెను. యజమానురాలువచ్చినది. వంటచేసినది ఆకడును, యింటి బ్రాహ్మణుడును నిరువురు భుజించిరి. ఆదిన మే కాశీ నగరమున కాయాత్రికుడు వెడలిపోయెను

కాశీనగరము గొప్పపట్టణము. అందుశంకర య్యయనుచాకలివాని గృహమును నాయాత్రికుడు మహా శ్రమపడి దెలిసి కొనిప్రతి దినము పంచాంగము చెప్ప నారంభించెను. దినములుగడిచినవి. మాసములుగడిచినవి సంవత్సరములుగడిచినవి.

ఒకనాడా బ్రాహ్మణుని జూచి, చాకలి" అయ్యా మాకీపంచాంగములేల? మీకేమైన కావలసి నయెడల డన" మూడుదోసిళ్ల ద్రవ్యమిస్తి న"ని వ్రాసియీ యమనెను. అతనినిర్బంధము పడజాలక యటులేయాతడువ్రాసి యిచ్చెను

అంతనాబ్రాహ్మణుడు కాశినుండిగౌరీపురమునకు వచ్చియాబ్రాహ్మణుని యింటియందుననే బసచేసివారింటిలోలేనపుడాబండ నెత్తి తానుదెచ్చినచీటీయందుబడవేసిమూడుదోసిళ్ల ధనముగైకొని నాల్గవదోసిలి పోసికొనపోవ- ఆధనదేవత;ఓరీ పిచ్చిబాపడ! ఈధనమంత యునీకేయిచ్చునటుల నేల? వ్రాయించుకొని రాలేదు!,అనగా,నాతడువిషాదము చెందుచుమారు పలుకక యాబండను తిరిగివేసియాపూట యచ్చట నేభుజించిసాయంకాలమింటికరిగెను.

కాశియందొ కప్పుడు స్ఫోటకాది వ్యాధులు సంభవించగా,శంకరయ్యసకుటుంబముగా క్షేత్రాంతమందలి గౌరీపురమున కేగి వసించుచుండెను. బట్టుబుదుకుకొనుటకుసరియయిన బండదొరుకక వెదకుచుండగా నొకబండగన్పించినది. దానిని లేవబట్టగ నేక్రింద ధనముండెను అదియేబ్రాహ్మణుడుసంపాదించినధనము.ఆబ్రాహ్మణదంపతులుచనిపోయిరి, వారిగృహముశిథిల మైనది.ఆరజకుడటులేధనమునుంచి రాత్రియందుకళత్రపుత్రాదులతోధనమంతయుందీసికొని కాశికివెళ్లెను. అతడాధనమునను భవించుచుండ గానందుబూర్వముబ్రాహ్మణునికి దానిచ్చినచీటిని జూచి గుండెలు బాదుకొనుచు- తనసొమ్మంతయుబోయినవాని వలెయు: ఖించుచు నాదు: ఖము తోడ నేమరణించెను

ఆహా! ధనము సంపాదించి కష్టపడిన బ్రాహ్మణదంపతులా? యనుభవము లేకుండగనే మరణించిరి. అనాయాస ముగా బ్రాహ్మణునికి కొంతయనుభవమైనది, చాకలవానికిగూడ ననుభవముసంపూర్తి గాలేదు,, కావునధన మెంతసంపాదించినను స్వానుభవమును నెవ

రు వచింపఁజాలరు.

అన్నదమ్ముల శిరశ్ఛేదనమునకు- తల్లిదండ్రులయాజ్ఞాతిచ్ఛేదమునకు- మాతాపుత్రులవిరోధమునకు- బంధువులయపాయమునకు- కారణము ధనమేగదా!,

ఈధనమును దాను వచ్చునపుడా? వెంటఁదీసుకొని రాలేదు. పోవునపుడా? వెంటఁగైకొని పోవఁడు. సంపాదించి తనపుత్రుల కేయొసంగుదమని తలంచిన నదియూ వ్యర్థమే. పుత్రుఁడు దుర్మార్గుఁడయినచో సంవత్సరములనుండి యెంతో కష్టపడి సంపాదించిన సంపాదనయంత యొక్కక్షణములోదినుటకు మూఁకుఁగూడ లేకుండ చేయును-అనేకదుఃఖముల కాకరమగు ధనసేవనము నిష్ప్రయోజనము. కావున- నిత్యసంతోషప్రదము- నిరవధి కానందప్రదమునగు మోక్షధనమునే ముముక్షువు సంపాదించి తరించవలెను.

యోగాభ్యాసి ముక్తిఁజెందును గాని దుర్గతిఁ జెందఁడనుట.

——*——

క. ఘనుఁడగుయోగాభ్యాసికి
వినుతాత్మునకంతరాయవిధమైనిధనం
బును బొందిననెట్లగునో
యనిసంశయ మొందవలవదదియెట్లనినన్. ౧౩౩

తా. యోగము నభ్యసించు మహాత్మునికి మధ్య విఘ్నముగా మరణము సంభవించిన యాతఁడు దుర్గతికిఁ బోవునే మోయని భీతిచెంద నవసరములేదు

క. ఈత్రోవ నడుగువెట్టిన
యాతఁడు నిష్కల్మషాత్ముఁడగుఁగావునఁ బ్ర
ఖ్యాతిగ మృతుఁడైనను మఱి
యేతెఱఁగు దుర్గతులకుఁ నేకాలంబున్. ౧౩౪

తా. ఈదారిని నడుగుబెట్టి నంతనే నిష్కల్మషుఁడగును గనుక యాతఁడెప్పుడును దుర్గతికిఁ బోఁడు.

మ. అదియుంగాక యతండు సంతతము నత్యంతోత్సవ శ్రీలక్ష్మిఁ
త్రిదశావాసము నందమర్త్యతతి యర్చింపంగ సద్వైభవా
స్పదుఁడై యెంతయుఁ గాలమున్నదుదినిం జ్యుత్ భూతల ప్రాప్తియై

యుదయించుం గులశీలసంపదలతోఁ మెప్పారు గేహంబునన్. ౧౩౫

తా. దేవతలు మహోత్సవముతో నుతింపుచుండ, శ్రీ శివ శాపా నమును రుద్రలోక మున గొంత కాలముండి, తిరిగి భూలోకంబునఁ గులశీల విద్యాసమేతుఁడగు వానిగృహం బున జన్మించును.

మ. జననంబొందుచు వేదశాస్త్రములు విశ్వఖ్యాతిగా నభ్యసిం చినిజాబారఁగఁ బూర్వశేషము దగం జేయుచున్ సదాభ్యాసమం తనహస్తామలక ప్రకారముగఁ దత్త్వంబాత్మలోఁ జూచి స ద్ధ్యాన నాపుణ్యుఁడు తన్మయుండగుచు నసమ్యగ్భంగి ముక్తుండగున్

తా. జన్మించిన తోడనే, వేదశాస్త్రముల నభ్యసించి పూర్వపుణ్య విశేషంబున, నిరంతరాభ్యాస పరాయణుఁడై కరతలామలకమువలె దత్త్వమును దనలోఁ జూచుచుఁ దన్మయుఁడై చివరకు ముక్తుఁడగును.

క. ఓ డేమి యోగికులమున
నొండెను జనియించి యాతఁ డొనరంగ మహా
త్ముండై బూర్వాభ్యాసము
నిండారఁగ జలిపిపొందుఁ నిత్య పదంబున్. ౧౩౬

తా. పలుమాటలతో (బనియేమి?)యోగికులంబున జన్మించిన వాఁడై, మహాత్ముడై పూర్వాభ్యాసము పూర్తిగా సలిపి శాశ్వతంబున మోక్షపదంబు నొందును.

క. జననుతమగు శివయోగం
బు నపేక్షించినను జాలుఁ భువిలో శీఘ్రం
బున నతఁడు యోగి యగునిది
మనమలరఁగ సకలశాస్త్ర మతమై వెలుగున్. ౧౩౭

తా. సర్వజనస్తోత్ర పాత్రంబగు శివయోగంబు నందభిలాష గలిగినఁజాలు. అతఁడు శీఘ్రముగా యోగియగును. ఇది సర్వశాస్త్ర సమ్మతము

చ. అతులిత భంగివిప్రుఁడు నరావలిలోఁ పలనెల్ల బెద్దయౌ
నతనికిఁ బెద్దయంద్రు నిగమార్థవిదుం డతపోరతాత్మ కుం
డతనికిఁ బెద్దతాపసులఁ గం దఱకుం గడు బెద్ద జ్ఞాని తా

నతనికి యోగిపెద్ద యగు నాతనికంటె ఘనుండు లేఁడిలన్. ౧౩౯

తా. మానవులలో నధికుఁడు విప్రుడు. అతనికంటె వేదవిదుండు గొప్పవాఁడు అతనికంటె తాపసుఁడు. తాపసులకంటె నధికుడు శివయోగి. అతనికంటె ఘనుండెవండును లేడు.

క. కావున నిరవధి పరసౌ
ఖ్యావహ కరమైన యోగ మభ్యస్తముగాఁ
గావించిన సంయమికిఁ
గైవల్య పదంబు గల్గుఁ గడు శీఘ్రముగన్. ౧౪౦

తా. కాబట్టి బ్రహ్మానంద మొసంగు యోగము నభ్యసించిన తాపసులకు మోక్షము శీఘ్రముగా లభించును.

క. అకటా యెఱుఁగరు నరులే
టికిఁ బూఁతలుఁ బూజలును గడింది వ్రతంబుల్
సకల క్రియలును యోగము
నకు సాటియె యెవ్విధమ్మునం దలపంగన్, ౧౪౧

తా. పూజలు-వ్రతములు మొదలగు సకలక్రియలును యోగముతో సాటిగావు. మానవులెవ్వరీ విషయమును శివానుగ్రహము లేనిది దెలియనేరరు.

క. ఒకయించుక తడవైనను
నకలంకాధ్యాత్మ దృష్టి యలవడునేనిన్
సకల క్లేశంబులుఁ బా
యక యుండిన నపుడు గల్ల యనఁదగు దీనిన్. ౧౪౨

తా. కొంచె మాలస్యమైనను, అధ్యాత్మ దృష్టి కలిగిన తర్వాత, సకల దుఃఖములు పోనిచో దీనిని నసత్యమనిన, ననవచ్చును గాని, అధ్యాత్మ దృష్టి కలుగకమును పేయసత్యమనుట మహాపాతకము.

యోగముకన్న తక్కిన వన్నియు దుఃఖ ప్రదములని వచించుట.

---*---

సీ. సతతనిర్మల దేహ సంరక్తి యేటికి
బహుదుఃఖ సంసార బాధ యేల

యేటికి రతికేళిఁ హేయంపు దుర్గోష్ఠి
పాతకాస్పద రాజ్యభార మేల
యింద్రత్వ మేటికిఁ నింత వేగిర మది
బ్రహ్మత్వ మంతయుఁ బడయ నేల
యేటికి విష్ణుత్వ మెన్ని భవంబుల
శోక మోహాది సహ మానులంబు

తే. గీ. వేయునేల యెవ్వియును భావించిచూడ
నస్థిరంబులు గాని నిత్యములు గావు
చెడని సౌఖ్యంబు శివయోగ సిద్ధిఁ గలుగు
నెన్నిభంగుల దుఃఖంబు లితర మేల ౧౪౩

తా. జీవ మండలి యాసక్తి - అనేక దుఃఖముల కాకరమైన సంసార బంధము - జుగుప్సాకరమైన రతికేళి - పాపములకు నిలయమగు రాజ్యభారము - ఇంద్రత్వము - బ్రహ్మత్వము - అవియివి యననేల? సర్వమును నస్థిరములుగాని, నిత్యములుగావు. ఒక్క శివ యోగము వలన నిత్యానందము గలుగును.

ప. అదియెట్లనిన. ౧౪౪

చ. తొలిదొలి గర్భమందు నగు దుఃఖము పుట్టినమీఁద సంస్కృతిం
గలమహనీయ దుఃఖమధిఁ కస్నట దారుణ భంగి నేమిటన్
దొలఁగని కాలమృత్యు భయ దుఃఖము వామతి భూతకోటికిం
దులఁదల పోసిచూడ బహు దుఃఖపరంపర గాదె మేదినిన్. ౧౪౫

తా. మొదట తల్లిగర్భమందు మహాదుఃఖము ననుభవింపవలయు. తరువాత సంసార దుఃఖము. ఆపైన కాలమృత్యు భయము - ఎన్ని విధముల తలంచినను మానవ జన్మమునకు దుఃఖమే గాని, సుఖమణు మాత్రమును లేదు.

చ. అదియటులుండె స్వర్గమున నైన సమంచిత సౌఖ్య మున్నదే
యదియెటులన్నఁ బుణ్యముల నంతవిధంబులు గాన స్వర్గ సం
పదలొక భంగిఁ గాక విమానంబుల నాఁదగు నందు హీనులభ్యు
దయపు తేజముల్ గుసిచి యుల్లమునందు రపిల్లు చుండు టన్.

తా. పోనిండు. స్వర్గమందైన సుఖమున్నదని యెంచినచో, అచ్చటను సున్నయే. ఏలయనగా, పుణ్యముల నంతములు– అనేకవిధములు. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అను న్యాయంబున బుణ్య క్షయమగుట తోడనే తేజోహీనులై క్రిందికిబడద్రోయబడుచుందురు.

క. దైవములకైననోక్కొక
దైవముతమమీఁదఁగలుగఁ దత్తత్పదముల్
భావనగోరుచునెఱియుట
నెవ్విధమున దేవతులకు నెక్కడి సుఖముల్. ౧౪౭

తా. దేవతలను విచారించుదుమా? వారికి సౌఖ్యములేదు. ఒకదేవతపైన మరొకదేవత యధికారము గలుగుటచే, నాదేవతలా వారిపాదముల ధ్యానించుచుందురు. మఱియు నింద్రాది దేవతలే యనేకకష్టములఁ బడలేదా? కావున దేవతలకును సౌఖ్యములేదుసుమీ?

వ. అదియునుం గాక. ౧౪౮

క. మూలము దెగుటయు నేలకు
వ్రాలిన వృక్షంబుపోలె వసుసఁ గృతఫలం
బాలో దెగుటయు నేలకు
వ్రాలును స్వర్గస్థుఁడిదిగరము సుఖకరమే. ౧౪౯

తా. చెట్టు మూలము నరికిన, ఆచెట్టుభూమి యందు గూలి పడుటవలె పుణ్య క్షయముకాగా, స్వర్గస్థుడు నేలఁగూలును. గానస్వర్గ సుఖము శ్రేష్ఠమైనది గాదు.

కాల మహిమ.

---

వ. మఱిపరబ్రహ్మంబైన పరశివుండు నిత్యుండు నిత్యసుఖస్వరూపి సర్వకారణంబు సర్వేశ్వరుండు కాలాతీతుండుననఁదగు. అతఁడొక్కరుండునుం దక్క సర్వంబును గాలవశంబ. కాల వశంబును నెట్టివారికిఁ గడవ శక్యంబుగాదు. కాలవశంబున సర్వమైన వారలకు నంతంబు గలుగుచుండు. కాలమహిమం బత్యంతవిచిత్రంబు. ౧౫౦

తా. సర్వప్రపంచమును సృష్టించిన నాసర్వేశ్వరుఁ డొక్కఁడే కాలము నతిక్రమింపఁదగినవాఁడే యగును. అమహాదేవుఁ డొకఁడు దప్ప సర్వంబును కాలాధీనమైనదియే. కాల

ప్రవాహమునుండి వచ్చునట్టి జేరనెవరికి సామర్థ్యములేదు. విచారింపగా కాలమహిమ వి చిత్రముసుమా?

సీ. ఒకడైదు దినములోకడు పది దినములు
మానమొక్కండు వర్ష మాత్రమొకండు
పంచాబ్దము లొకండు పదియేండు లొక్కండు
నిరువదొక్కండు ముప్పదేండ్లొకండు
సకల జీవులలోన శతవర్షములు పురు
షున కాయువని చెప్పు శ్రుతినికరము
దీర్ఘాయువై యుండు దేవేంద్రునకు బ్రహ్మ
కంతకంటెను నాయువగ్గలంబు

తే. గీ. వనజ భవుకంటె విష్ణుదేవునకునాయు
వధికమవ్వాసు దేవునికంతకంటె
ఘనతరాయువు గలవారి కాలమహిమ
మోపి హరియించునది యీశ్వరోక్తమతము. ౧౫౧

తా. ఒకడయిదురోజులు జీవించును. ఒకడు పదిరోజులు జీవించును. ఒకడుమాస ముజీవించును. ఒకడుపదిసంవత్సరములు జీవించును. ఒకడిరువది వత్సరములు జీవించును. ఒకడుముప్పదివత్సరములు జీవించును. సకలజీవులలో నూరువత్సరములు పురుషుని కాయుః పరిమాణము. దీర్ఘాయుస్సుగల దేవేంద్రుని కంటె బ్రహ్మకాయువధికము. అతనికన్న వి ష్ణువున కాయువధికము. అతనికన్న వాసుదేవునికాయువధికము. ఇంతకంటెనాయుః పరిమాణము గలవారి నందరిని, కాలము హరియించును గదా!

## ఆయుష్య నిర్ణయము.

సీ. ఆయుష్య నిర్ణయం బబ్జాస నాదుల
కెవ్విధంబనిన నూ ఱేండ్లు బ్రహ్మ
కరయంగ బరమాయు వనందగు దత్ప్రమా
ణంబె ప్రకారమన్ననునిమేష
ములుపదు నెనిమిది యలవడంగా గాష్ఠ

కాష్ఠలు ముప్పది। కళ, కళలును
రమణ ముప్పది ముహూ। ర్తంబనఁ జను, ముహూ
ర్తములు ముప్పది యహో। రాత్రమయ్యెఁ
తే. గీ. నిట్టి యహో రాత్రములు పది। యేను గూడఁ
బక్షమగుఁ బక్షములు రెండు। భాసురముగ
మాసమది పితరులకొక్క। వాసరంబు
మాసయుగ్మంబు ఋతువండ్రు। మహిని బుధులు. ౧౯౨

తా. 18 నిమేషములు కాష్ఠయనబడును. 30 కాష్ఠలు కళ. 30 కళలు ముహూర్తము 30 ముహూర్తముల హోరాత్రములు. 15 అహోరాత్రములు పక్షము. 2 పక్షములు మాసము. మనుష్యులకగు మాసము పితృదేవతల కొకదినము. 2 మాసములు ఋతువనఁబడును.

క. అగు మాసము లాఱయనం
బగు వత్సర మయిన యుగళ। మయ్యయనంబుల్
మొగి రెండును దేవతలకుఁ
బగలును రేయును ననంగఁ బరఁగుచు నుండున్. ౧౯౩

తా. 6 మాసములు, అయనమన బడును. 2 అయనములు సంవత్సరమనఁ బడును 1 సంవత్సరము దేవతలకు రాత్రిపగలు నగును.

వ. అట్లు గావున మానుషాబ్దంబులు మున్నూట యఱువదియైన నొక్క దివ్యాబ్దంబగు. దివ్యాబ్దంబులు పండ్రెండు వేలు చతుర్యుగంబనం బ్రసిద్ధంబగు. అందు కృత యుగంబునకు సంఖ్య దివ్యాబ్దంబులు నాలుగు వేలు నెనమన్నూటికి మానుషాబ్దంబులు పదేహులక్షలు నిరువది యెనిమిది వేలు, త్రేతాయుగంబునకు సంఖ్య దివ్యాబ్దంబులు మూఁడు వేలు నూటికి మానుషాబ్దంబులు పండ్రెండు లక్షలును, తొంబది యాఱు వేలు. ద్వాపర యుగంబునకు సంఖ్య దివ్యాబ్దంబులు రెండు వేలు నన్నూటికి మానుషాబ్దంబులు నెనిమిది లక్షలు నఱువది నాలుగు వేలు, కలియుగంబునకు సంఖ్య దివ్యాబ్దము

లు వెయ్యినూటికి మానుషాబ్దంబులు నాలుగులక్షలును ముప్పది రెండు వేలగును. ఇట్టిదివ్యాబ్ద ద్వాదశ సహస్రంబులు గల నాలుగుయుగంబులుంగూడ నొక్కమహా యుగంబగును. ఇందుకుమానుషాబ్దంబులు నలువది మూఁడు లక్షలు నిరువది వేలగును. అమ్మహాయుగంబులు వేయి బ్రహ్మకు దినంబనఁ జను. బ్రహ్మదినంబునకుదివ్యాబ్దంబులసంఖ్యయొక్క-కోటియునిరువదిలక్షలకుమానుషాబ్దంబులు నన్నూట ముప్పది రెండుకోట్లయ్యె. మఱియును. ౧౧౪

తా. మనుష్య వత్సరములు 360 యయిననొకదివ్యాబ్దము. [దేవతలసంవత్సరము] 1200 వేలదివ్యాబ్దంబులు చతుర్యుగమనఁబడును.

| | దివ్యాబ్దంబులు- | మానుషాబ్దంబులు |
|---|---|---|
| కృత యుగము నకు- ... ... | ౪౮౦౦౦ ... ... ... | ౧౭౨౮౦౦౦ |
| త్రేతాయుగము నకు- ... ... | ౩౬౦౦ ... ... ... | ౧౨౯౬౦౦౦ |
| ద్వాపరయుగమునకు-... ... | ౨౪౦౦ ... ... ... | ౮౬౪౦౦౦ |
| కలి యు గము నకు- ... ... | ౧౨౦౦ ... ... ... | ౪ ౩ ౨౦౦౦ |

ఇట్టి ౧౨వేలదివ్యాబ్దంబులు గల ౪యుగములు నొక్కమహా యుగమనఁబడును, మహాయుగమునకు మానవవత్సరములు ౪౩౨౦౦౦౦ లు. ఈ మహాయుగములు వేయియయినచో బ్రహ్మకొకరోజు.బ్రహ్మదినమునకు— దివ్యాంబ్దంబులు- ౧౨౦౦౦౦౦౦

మాను షాబ్దంబులు ౩౨౦౦౦౦౦౦౦

సీ. మనువుల నింపఁగాఁ మునులు నింద్రుండు ని
ర్జరచ యంబును మనుఁ బ్రభృతులైన
మనుజపాలురు గల్గిరాందురమ్మనువు కా
కాలంబు పోవంగ వేఁ గంబవోదు
రందఱు మనువులిట్లందంద పుట్టిచె
ల్లుదు రద్దినంబునఁ బదునలువురు
భూనిదితంబైనఁ భూరియశంబ మ
రఁగ మహాయుగ సహస్రమ్ములోన
తే. గీ. నొక్కకరుఁడు డెబ్బదియొక్కఁ యుగములకును

వరుసతోసద్ధి నాయకత్వమునహించి
మనువులిరువది నలువురుకి నజభప్రవి
యాజ్ఞవర్తింపుదురు మహికి మాన్యులగుచు. ౧౫౫

తా. మనువుజనించిన వెంటనే మునులు- ఇంద్రుడు దేవతలు మన్వాదిరాజులుపుట్టుదురు. ఆమనువు కాలము దీరిన వెంటనే యాతడే మరణించుట యగాక యాతని తో వచ్చిన మునులు-ఇంద్రాది దేవతలుచచ్చుదురు. ఇటుల పదునల్గురుమనువులుకీర్తి కాలుదైపుట్టిచనిపోవుదురు. మహాయుగ సహస్రమ్ములోపల నొక్కొకడు 71 మహాయుగ ములకు నాయకత్వము వహింతురు. బ్రహ్మయాజ్ఞచే ఠవి వుదుమహీమా సంపన్నులుగ నుండెదరు

వ. డెబ్బదియొక్క. మహాయుగంబులకు దివ్యాబ్దంబు లెనిమిదిలక్షలు నెనుబదిరెండు వేలయ్యె. వీనికి మానుషాబ్దంబులు ముప్పదికోట్లున్నునదియేడు లక్షలు నిరువది వేలగు. ఇదిమన్వంతర ప్రకారంబు మన్వంతర సంవత్సర సంఖ్యచతుర్దశ గణితముచేసి నిర్ణయించిన బ్రహ్మకుదినం బద్దినాంతరంబు నగల్గు లయంబుదై నందినంబని బుధులుచెప్పుదు రాసమయంబున. ౧౫౬

తా. మహాయుగములు 71 అందుకు 882 వేలుదివ్య వత్సరములు. మానుషవత్సరములు 36720000 అగును. ఈసంఖ్యను 14 పెట్టి హెచ్చించిన బ్రహ్మకుదినం బగును. ఆదినాంతము నలయంబు దైనందినం బనిపండితులు సెప్పుదురు.

క. ఏకార్ణవమై యుండఁగ
నాకుల మతితోడ బ్రహ్మ, నారాయణనా
మాకలితుఁడగుచు నయ్యే
స్తోకజలములందుఁ దేలు, చును నిద్రించుకా ౧౫౭

తా. ప్రపంచమంతయు మహాసముద్రమై యుండగ వ్యాకుల చిత్తుఁ డగు బ్రహ్మ నారాయణ నామమును ధరించి జలంబులందు నిద్రించును.

తే. అద్భుతంబాద వంగ, సహః ప్రమాణ
రాత్రియెల్ల నిద్రించిబో, రవ విరించి
వేగుటయు మేలుకాంచి భా, వించి ప్రజలఁ

చెలగి యెప్పటి యట్ల సృజించుచుండు ౧౫౮

తా. ఆశ్చర్యము జనింప బ్రహ్మ యారాత్రి యంతయు నిద్రించి తెల్ల వారుట తో డనే మేలుకొంచి తిరిగి ప్రజల సృజించు చుండును.

వ. అట్టియ హోరాత్రంబులు గల సంవత్సరంబులు బ్రహ్మకుం బ్రథమ పరార్ధంబే బదియును, ద్వితీయ పరార్ధంబే బదియును గూడ వర్షశతంబగును. ఇది పద్మసంభవుని యాయుష్యప్రమాణంబు. అతనిపరాయుష్యం బంతయు విష్ణుదినంబని చెప్పంబడును. ఈప్రకారంబునం గాలపరంపర జరుగుచునుండు. సంఖ్యాప్రవర్తనం గాలపరిమాణంబులుగల్గుటం జేసి బ్రహ్మాదులైన దేహధారుల కెల్లగాల భయంబు గల్గునను టశాస్త్రనిశ్చయంబని తెలిసి నిశ్చల శివయోగజ్ఞాన సంపన్నులైన మహాత్ములు సర్వవాంఛలుడిగి నిరంతర స్వానుభవసుఖ సంతృప్తులగుచు నక్షయమోక్షానందంబును బొందుదురు గావున. ౧౫౯

తా. అట్టి యహోరాత్రము గలసంవత్సరములే బదియు ప్రథమ పరార్ధ మనియు అట్టివి యింకను నేబదియైన ద్వితీయ పరార్ధ మనియు రెండును గలసి బ్రహ్మకు నూరువత్సరములగు ఇది బ్రహ్మ యుష్యము.

ఈ బ్రహ్మ యాయుష్యమంతయు విష్ణువునకు ఒకరోజగును. ఇట్టివి 360 అయిన సంవత్సరమును అట్టివి 100 అయిన విష్ణువున కాయుః పరిపూర్తి యగును ఇట్లే రుద్రునకుగలుగును. కావున కాల భయంబు అందరికిగల దనుట శాస్త్ర విహితము. దీనిని తెలిసికొని శివయోగులు సర్వవాంఛలు వదిలి శివోపాసనము చేసి నిరంతరము స్వానుభవముచే మోక్షానందమును పొందుదురు.

క. పరిశాంతిదుండు శాంతుఁడుఁ
బరిపూర్ణ ఫలప్రదుండు, పరిపూర్ణుఁడును
స్థిరముక్తిదుఁడును ముక్తుఁడు
బరశివుఁ డొక్కండె కాఁడె, భావింపంగన్ ౧౬౦

తా. శాంత మూర్తియు— సంపూర్ణ ఫలప్రదాతయు— ముక్తిప్రదుఁడునునగు వాడు సర్వేశ్వరుఁ డొక్కఁడే గాని మఱొకఁడు లేఁడు.

—* శివయోగము వలన గలుగు లాభములు *—

:0:

క. అక్కజముగ నాపరశివుఁ
డెక్కడ దుఃఖములఁ బొందఁ । డెక్కడ నతనిన్
నిక్కముగ నాత్మఁ గూర్చిన
నెక్కడి దుఃఖములు సుఖము । లేమిటఁ గొరతల్. ౧౬౧

తా. దుఃఖ రహితుఁడగు పరశివుని మనంబునఁ దలంచినవానికి సౌఖ్యమేగాని దుఃఖముండునా?

సీ. నిర్మలత్వంబును । నీచసంసారవి
రక్తియు శివయోగ । యుక్తి గల్గు
భవ్య శీలంబును । బావన క్రియయును
మహిలోన శివయోగ । మహిమ గలుగుఁ
జిర వైభవంబును । వరనిష్ఠ రత్వంబు
శివయోగమార్గను । స్థిరతగలుగుఁ
జితభవత్వంబును । సతతశాంతంబును
బరశివయోగ సం । ప్రాప్తి గలుగు

తే. గీ. స్పష్టినశతయు శిష్టసం । సేవ్యతయును
సద్గురుత్వంబును శివప్ర । సన్నతయును
ననుపమానంద మందిరా । త్మను భవము
గలుగు శివయోగ విజ్ఞాన । గౌరవమున. ౧౬౨

తా. సంసారవిరక్తి-శివయోగరక్తి-మనోనైర్మల్యము-సదాచారము. పుణ్యకార్యబుద్ధి, స్థిరసంపద. శాంతము- గురుజనసేవ- శివానుగ్రహము- ఆత్మానందమును శివయోగ ము వలననే గలుగును.

మ. అజరత్వంబు ననామయత్వమునుగ్ర । త్యాకృత్యదూరత్వముల్
సుజనత్వంబును జిన్మయత్వమును సం । శుద్ధత్వముల్ దుష్ట చి
త్తజముఖ్యారి జయత్వముం బ్రకటని । త్యత్వంబు నూహింపఁ గా

నజడత్వంబును సంభవించు శివయోగాభ్యాసికిం జయ్యన౯. ౧౬౩

తా. ఆరోగ్యము యౌవనము — సౌజన్యము — శమము — [అంతరింద్రియనిగ్రహము] దమము [బాహ్యేంద్రియనిగ్రహము] మొదలగునవి శివయోగాభ్యాసికిం ద్వరలో గలుగును.

క. అణిమాద్యైశ్వర్యములం
బ్రణుత యశోనిధులు గారె పరికింపంగా
బ్రణయన సద్భక్తిపరా
యణులై మనుయోగసిద్ధులైనమహాత్ముల్. ౧౬౪

తా. ఈశ్వరభక్తి గలిగి యోగ సిద్ధులయిన మహనీయులణిమాద్యైశ్వర్యములం బొందికీర్తిశాలులుగాలేదా?.

తే. గీ. ఇన్ని చెప్పంగ నేటికి నిహపరముల
నఖిల మహిమలం బొందిన యంత మీఁద
ముక్తియును గల్గు శివయోగ యుక్తులైన
నిర్మలాత్ముల కిది శాస్త్ర నిర్ణయంబు. ౧౬౫

తా. శివయోగాభ్యాసులై హికాముష్మిక ఫలంబులు పొందుటయు గాక ముక్తిని గూడనొందగలరు. ఇది శాస్త్రనిశ్చయము.

క. నావ యగు౯ భవ జలధికి
జీవన్ముక్తిదము నట్టి శివ యోగంబో
హోహో! వర్ణింపగఁ దరమే?
యౌ వనజభవాది సురలకైనను జగతి౯. ౧౬౬

తా. జీవన్ముక్తి నొసఁగు శివయోగము సంసార సముద్రమునకు నావ వంటిది. బ్రహ్మాదులకైన దీనివర్ణింపఁ దరము గాదు.

క. శివకర నిత్య సుఖాస్పద
శివ యోగానంద భరితచిత్తుండగుచు౯
శివ యోగీంద్రుఁడు సాక్షా
చ్ఛివుఁడౌ నంట యోగ మహిమకు చిత్రము గాదే. ౧౬౭

తా. నిత్యసుఖాకరమైన శివయోగానందమును జెందుచు శివయోగి శివుండే యగును గదా!

క. పూని యనేక భవంబుల
చేనో మోచకము గాక శ్రీయట యోగ మతం
బూనఁడు కుధరాణ్ణ్వాంతర
పూనది యోగీంద్రుఁ డనఁ గ్రియాంఘ్రీ నునకున్. ౧౬౮

తా. అనేక జన్మపరంపరాగత పాపము నశింపని హేతువుచే, మానవులు శివయోగము నవలంబింపరు. కాని, విచారింపగాఁ గర్మయోగులనికి, శివయోగులకును, పర్వత పరమాణువులకు గల భేదముగలదు.

* శివయోగ మభ్యసింపక దెలసినంత మాత్రమున రానేరదనుట. *

క. అవధానాభ్యాసము లే
కన్యథా గోష్ఠంబున్ వికారి యగుటయో
గి విధంబనఁ దగునే యవి
యావివేకము గాక సిద్ధుఁ డగుటయె తలఁపన్. ౧౬౯

తా. దశావధానముల నభ్యసింపక, యుండిన యోగి కాఁడు. సిద్ధుఁడును గాఁడు. తలంపఁగా వాఁడు వివేకియే యగును.

దశావధాన విచారము.

దృగవధానద్వయము- త్వగవధానత్రయము. మనోవధాన పంచకము- అనునవియే దశావధానములని వచింపఁ బడుచున్నవి.

దృగవధాన ద్వయములోఁ బ్రథమావధానము దృక్పటుత్వము- దృగ్విన్యాసము- దృగ్విలీనత్వము- దృక్స్థిరత్వము- అని నాలుగు విధములు.

దృక్పటుత్వము.

కరకమలంబున వెలుంగుచున్న యిష్టలింగంబునందు (దనపాణింబును) దృక్కు కరకమలంబున వెలుఁగుచున్న తోఁ జేసికి భావమును బొందించుటయు, తన దృక్కును లింగస్వరూపముగా భావించుటయు దృక్పటుత్వ మన (బడును.

## దృగ్విన్యాసము.

అవినాభావ సంబంధ దృష్టిగలిగిన నందికేశ్వరుని వలె దృష్టి భేదములచే స్వేష్ట లింగ నిరీక్షణము సేయుటయే దృగ్విన్యాసము.

## దృగ్విలీనత్వము.

జలము క్షీరమునందు వలె నదులు సముద్రంబు నందుబోలె నాయా భావనలచేత దృక్కును స్వేష్టలింగంబందు లీనముచేయుటయే దృగ్విలీనత్వము.

## దృక్థిరత్వము.

ఇష్టలింగము దక్కిల తరంబును జూడకుండుటయు- చలనము- మాంద్యము- అపాంగ ప్రసారము- కుటిలత్వము- లేక నేత్రజల బిందు శూన్యమై యంగగుణ రహితమై యుండుటయు దృక్థిరత్వ మనబడును. ఈ నాలుగును గలిసి ప్రథమావధాన మనంబడును.

## ద్వితీయావధానము

దృష్టియే ఇష్టలింగమునకు స్నానోదకముగను-గంధాక్షతలుగను-పుష్పరూపముగను- ధూపరూపముగను నీరాజన రూపముగ- నైవేద్యరూపముగ- తాంబూల రూపముగను భావించి యష్టవిధార్చనమును స్వేష్టలింగమందుఁజేయుటయే ద్వితీయావధానమనంబడును.

## తృతీయావధానము.

దరిద్రునికి పెన్నిధి దొరికిన మితిలేని సంతోషమునొందినభాతికరంబున స్వేష్టలింగ దర్శనస్పర్శనమాత్రమున నేమహానందమునొంది శివునినర్చించుట తృతీయావధాన మనంబడును.

## చతుర్థావధానము.

ఉపనిషత్తులచేతను, పురాణాది స్తోత్రములచేతను తన్మయుడై ఇష్టలింగమును నుతించుటయే నాలుగవయవధాన మనబడును.

## పంచమావధానము.

అగ్నియందు వెన్నవలెను- జలములందు లవణంబు రీతిగను విషయేంద్రియములతో శరీరమును లింగమునందు లీనముచేసి అంగ విక్రియతో గూడ భక్తితో శివుని నర్చించుటయే పంచమావధానము ఈయవధానత్రయమునందును శరీరము మరచియుండుటచే త్యాగవధాన ములని వచింపబడినవి.

## అంగవిక్రియార్చనము.

ఆనంద బాష్పమే స్నానముగను, బిందువు- ఉద్వర్తనముగను (నలుగు) అను

రాగము గంధముగను- రోమాంచము పుష్పమాలికగను- తత్త్వభూతి- విభూతిగను- వాసనాశ్రయమే ధూపముగను- జ్ఞానకాంతులే దీప కాంతులుగను- ప్రాణము నైవేద్యముగను ఇంద్రియజయము- తాంబూలముగను- స్తోత్రములు మంత్రపుష్పముగనొనరించుట- అంగవికారార్చనమనబడును. అంగవికారముతో గూడ. శివుబ్బించుటయే యంగవికారార్చన మనబడును. ఇదిపంచమావధానాంతర్గతము.

షష్ఠావధానము.

మనస్సును స్నాన- గంధా- క్షత- పుష్ప- ధూప-దీపనైవేద్యతాంబూలములుగశివునికి సమర్పించుటయే ఆరవ యవధానము- ఇందు మనస్సు- ఆయా రూపముల బొందచుండును. నాసనిది మొదలు చివరవరకు మనోవధాన పంచకమని పేరు.

సప్తమావధానము.

లింగగర్భమునందుగల యసంఖ్యారుద్రులను భక్తితో లింగమునందు భావించిశరణుచేయుటయే సప్తమయవధానము.

అష్టమావధానము.

అనంత సంఖ్యాక రుద్రగణముల నుతించి శరణుచేయుట యెనిమిదవ యవధానము.

నవమావధానము.

పరశివానందము నొందిన గణాగ్రేసరుల లీలా సాగరమున మునింగి సమరసానుభవము నొందుటయే నవమావధానము.

దశమావధానము.

శివుని యందు లీనమైన చిత్తముగల్గి "శివాదన్యం నకించన" యను శ్రుతి ననుసరించి సర్వమును శివస్వరూపముగ గాంచి "యణోరణీయాన్" తత్త్వమస్యాదిశ్రుత్యర్థమునకు విషయుడై దృష్టంబులెల్ల లింగంబులయే కీభావంబున, పరమానందము బొంది తన్మయుడగుటయే పదియవ యవధానము. ఇవియే దశావధానము లనబడు చున్నవి. ఈ విషయమును గురుముఖము వలన నభ్యసింప వలయును. గురుకీలకము దెలియక యనేకు లాపదలలోమునింగినారు. విస్తారముగా నీవిషయము చూడదలచిన పండితారాధ్య చరిత్రాది శైవగ్రంథములజూడగోరెద.

క. వ్యసనంబులు విడువక మా
నసము వికారంబు లెల్ల నశియింపకముక్

వెసఫల యోగపు మాటలు
గోసరక పచరింతు రేల్కి కోహీన మతుల్. ౧౭౦

తా. మనోవికారములు నశింపక యున్నను, దుఃఖములు విడువకున్నను కొందఱుహీనులు, తాముమహా యోగులయి నటుల మాటలు చెప్పుదురు. అదియంతయు నిష్ఫలము సుమా!

క. అనువున బవనుని నడుతెరు
వునఁ జొనుపక ప్రాణ బిందుకి వులఁ గూర్పక యో
లన గగనాకృతి తన్మయ
మున నొందక యోగియగునె మున్నుధరిత్రిన్. ౧౭౧

తా. వాయువును మధ్యమార్గమున నడిపింపక, దహరాకాశమున ప్రాణ బిందువుల గూర్పక తన్మయ స్వరూపము నొందక యుండువాఁడు యోగియగునా!

క. ఏర్పడ లోపగతుర వే
లార్పక లోకంబునకుఁ దొ లంగక గుఱిపై
నేర్పున మనః పవనముల
గూర్పక యోగీశ్వరుండగునె యెబ్భంగిన్. ౧౭౨

తా. లోని శత్రువుల గూల్చక, ప్రపంచ వాసనను వదలక, లక్ష్యము మీద మనోవాయువులు నిలుపక యుండిన వాఁడు యోగియగునా?

సీ. శాలి హోత్రం బెంతయుఁ జదివిన నశ్వాశి
తూకుశలత్వంబు గలుగు నెట్లు
అవనీశు నెఱిఁగినయంత మాత్రనె చేరి
కొలువక సంపదల్ గలుగు నెట్లు
ఔషధం బెఱిఁగినయంతనే సేవసే
యక మహారోగంబు లడఁగు నెట్లు
ఎపుడు శాస్త్రములఁ బేర్లెఱిఁగిన నంతనెయభ్య
సింపక ప్రజ్ఞ వసించు నెట్లు

తే. గీ. తెలియ నిట్లనఁగా దె పల్కులను యోగ
శాస్త్ర పఠనంబు ననుసిద్ధి సంభవించు
ననుట గావున నతి చోద్యమైన యోగ
మభ్యసింపఁగ వలయును హర్నిశంబు. ౧౭౩

తా. అశ్వశాస్త్రము చదివినను, అభ్యాసములేక అశ్వశిక్షా కౌశల్యము గలుగదు. రాజును గుర్తెఱిఁగినంత మాత్రమున సేవింపక సంపదలురావు. ఔషధముపేరు దెలిసిన, సేవింపక రోగము గుదురదు. శాస్త్రముల పేళ్లు విన్నంత మాత్రమున చదువక, విద్యవచ్చునా? రాదు. ఇటులే, శివయోగము కూడ తెలిసినంత మాత్రమున రానేరదు. కావున రాత్రింబగలు యోగము నభ్యసింప వలయును.

శా. సంసార స్థితినుండి యోగ గరిమన్ సాధించు నేనీబుధో
త్తంసుం డాతఁడు,యంత ధైర్యమహిమం దాల్పంగ డానోపఁడే
సంసారంబును బాసియైన నమనుష్యంబైన చోనుండి వి
ద్వాంసుం డభ్యసనంబు చేయఁదగు నిత్యాంచాస్వ భావంబునన్

తా. సంసారములో నుండియే యోగము సాధించినవాఁడు బుధోత్తముఁడు. అంతటి ధైర్యంబాతనికి లేకుండిన సంసారము నుద్యజించి నిర్జనారణ్య మధ్యంబున నైనను నిష్కాములై యోగ మభ్యసింప వలెను.

మ. ఇటుగూడన్ సకల ప్రయత్నముల నూహింపంగ ధాత్రీ సము
త్కట సౌఖ్య ప్రదమైన జన్మఫల యోగంబభ్యసింపందగున్
ఘటికా మాత్రన దీనఁగల్గు ఫలమే కర్మంబు లెంతెంతగా
నటకల్పాంతము దాఁకఁ జల్పినను దధ్యం బొందునుం గల్గునే.

తా. ఈయోగంబున ముహూర్త మాత్రంబున గలుగు ఫలము కల్పాంతమువఱకుఁ గర్మ లాచరించినను గలుగదు. కావున నెన్ని ప్రయత్నములచే నైనను యోగమభ్యసింప వలయును.

క. కావునఁ దక్కిన కర్మౌఘు
లేవియు శివయోగ మునకు నెనగావున శా
స్త్రావళులు మ్రోయుటలు విని

భావన సంశయము లుడిగిఁ బ్రాజ్ఞుఁడు ప్రీతిన్.

తా. ఏకర్మము శివయోగముతో సరిగాదని శాస్త్రంబులందు వచింపఁబడెను. గాన పండితులు సందేహము విడువవలెను.

క. యోగాభ్యాసము నకును
ద్యోగము సేయుచు నవిద్యతోఁ బాసి వివే
కాగారుఁడు గాఁదగునా
లాగెల్లను బహుమతంబుల్ లని వివరింతున్. ౧౭౨

తా. నిరంతరము యోగాభ్యాసమునకుఁ బ్రియత్నము సేయుచు, నవివేకమును విడిచి వివేకి కావలయును. అటులగుటకుఁగల మతభేదముల వివరించుదు.

### ❋ వాసనావిచారము. ❋

తే. గీ. వాసనానది ప్రవహించుఁ బడి శుభాశు
భంబు లగుమార్గ ములఁ దానిఁ బాయుచు ప్ర
యత్న మేర్పడఁ గఁ శుభంబై తిరుగ్గు
పడము నందు బుధుండు గూర్పంగ వలయు. ౧౭౩

తా. వాసన యనునది-శుభాశుభ మార్గములఁ బ్రవహించుచుండును. పండితుఁడా వాసనను ప్రయత్నమున శుభమార్గమునందే కూర్పవలయును.

క. వాసన నాశము నొందుట
వాసిమిగులు మోక్ష మైభవం బండ్రుబుధుల్
వాసన దార్ఢ్యము నొందుట
పాసి చనని బంధ మండ్రుకే పరతత్త్వ విదుల్. ౧౭౪

తా. వాసన నశించుట మోక్షమనియు, నానాటికి వృద్ధినొందుట బంధమనియుఁ జెప్పఁబడును.

### వాస నాత్రయము.

—:0:—

లోకవాసన- దేహవాసన- శాస్త్రవాసన- యని వాసనలు మూడు విధములు.

లోకవాసన యనఁగా ప్రపంచము నందలి జనులందరు- తనను మంచి వాడను కొ

వవలయు నని యందుకు తగిన కార్యముల నాచరించుట.

దేహవాసన యనగా:- శరీరమందలి యాశ చేసిన కాలముతోను బ్రదుక వలయునని యోగాభ్యాసము మొదలయినవి చేయుట యు- దేహమునకు సుఖకరములగు కార్యములందా సక్తిగలిగి యుండుట యుననునవి.

శాస్త్రవాసన యనగా:- అన్ని శాస్త్రములు చదువవలయుననియు- వానివలనకీర్తి సార్జించవలయు ననియు- శాస్త్ర చర్చయందు సమానుడు గానుండవలయుననియుఁ గోరుట

ఈవాసనాత్రయము- ముముక్షువులకు వదిలి పెట్టదగిది. సర్వలోకంబులపూజ్యతఁ బొంద వలయునని తలంచియు, చిరకాలము బ్రదుక వలయు ననియు పరంబుల కోరుకొని లోకవాసనా దేహవాసనలచే రావణాది రాక్షసులు చనిపోయిరి. వేదశాస్త్రములుసమగ్రముగా చదువ వలయునని తలంచిన భారద్వాజ- నారదాది మహర్షులు పంశ్రమలపడి చివరకు సాఖ్యములు కావని విడిచి పెట్టిరి.

## చిత్తశబ్దార్థ విచారము.

క. వాసన చేతోరూపము
వాసనకుం జిత్తమ నెడి వర్ణిత శబ్దం
బీసృష్టిం బర్యాయం
బై సూరిజనాలిచే నుదాహృత మయ్యెన్. ౧౮౦

తా. వాసన చేతోరూపము గానదీనికి మఱియొక పేరు చిత్తము.

క. చిత్తము సర్వంబును నని
చిత్తవిదులు చెప్పుదురు విచిత్రంబుగనా
చిత్తత్యాగ నిరతులగు
సత్తము లూహించి చూడన్ సర్వత్యాగుల్. ౧౮౧

తా. చిత్తమును గుర్తెఱిగినవారు, సర్వమునకుఁ జిత్తమే కారణమని వచింతురు. అట్టిచిత్తమును త్యజించినవారలు సర్వమునుత్యజించినట్టి వారలే.

వ. జగజ్జాలంబు నందలియును రక్తియు- నజ్ఞానకలనయు- స్వబ్రహ్మభావనయు- దేహంబునం దహంకార భావంబును దృశ్యంబు నం దాత్మతయును మమత్వంబును నెందాఁక గల్గుచుండు నందాఁక

జిత్తాది వికల్పనయుఁదద్విభ్రమంబును గలుగు నట్టిచిత్తంబు నవిద్య యు మనంబు జీవుండు నుంగా నాద్యంతంబు నేకంబును నైన బ్ర హ్మంబే యీసర్వంబునునై విజృంభించు చున్నది గదాయని యె ఱింగి యుత్తేజంగున నిరంతరాంతర్ముఖ స్వాంతంబునఁ బ్రకాశించు చున్న తదీయ చిద్వహ్ని యందు జగత్తృణంబు వేల్చు నతనికిఁ జి త్తాది వికల్పనా విభ్రమంబులు నివర్తించును. ౧౮౨

తా. ప్రపంచము శివస్వరూపము కాదనుకొనుటయు, జగత్తునందను రాగ మును- దేహంబున నహంకారమును, నాదియను భావనము నెందాక యుండునో, అంతవరకుఁ జిత్తాది వికల్పమును- జిత్తవికారములు నుండును. ఆద్యంతరహితుడగు బ్రహ్మమే మనంబున జీవరూపంబుగను చిత్తంబునవిద్యారూపంబుగను వ్యవహరింపఁ బడుచువిజృంభించు చున్నది.యని తెలిసి మనస్సునఁ బ్రకాశించు నాతని చిద్వహ్ని యందు జగంబను తృణంబు నెవండు వేల్చునో, వానికిఁ జిత్తాది వికారంబులు నశించునని భావము.

క. ఆసల (బెనగొని వివశ)
బై సంతోషమ్ము లేపడి దగు చిత్తమునన్
దా సుజ్ఞానము దోఁపదు
మాసిన యద్దమున మోముమాడ్కిన్ జగతిన్. ౧౮౩

తా. మలిన మగునద్దమునఁ దనరూపము గన్పించనటుల నాశాబద్ధుడయి-సంతోషము లేని చిత్తంబున జ్ఞానంబు జనింపదు.

తే. గీ. ఘోర సంసార విషవేగ, మురు విషూచి
మిగుల దుస్సహ గాదె యె,మ్మెయి దలంప
నది యుపశమించు భావనం,బైన యోగ
మను విచిత్రగారుడ మంత్ర,మున నిజంబు ౧౮౪

తా. ఘోర సంసారమను విషమువలన గలిగిన బాధ, యోగమను గారుడమంత్రాభ్యాసమునను పశమించును.

క. స్వానుభవ జ్ఞానము పెం
పూనిన సద్గురు మతంబు నొక్కటి యగునె

వ్యాసికి సతఁడ భ్యాసము
చే నాత్మాలోకనంబుఁ జేయుచు నుండున్. ౧౮౫

తా. ధ్యాన భవజ్ఞానము గలిగిన సద్గురూపదేశము నొక్కటి యగు. కాన సంతతాభ్యాసమున నాత్మావలోకనము సేయవలయును.

చ. విమలము లైన తోయములఁ వెల్వల లోపల నిండి భానుతే
జము వెలుఁగొందు చందమునఁ సత్వము నందుల నుండువాత్మసం
యమనియ మాది సంతత స మాభ్యసనంబున నట్టి యాత్మను
త్రమః జనులాత్మ చేతనముఁ దంబుగఁ గాంచి సుఖాతురాత్మలోన్

తా. ఉదకము లందును వెలుపలను సూర్య తేజము ప్రకాశించు నటుల సర్వత్ర వ్యాపించి యున్న పరమాత్మను యమనియ మాద్య భ్యాసమున నాత్మయందే తమయాత్మ చేత శివయోగులు గనుగొందురు.

* శమాది విచారము. *

———:():———

క. క్రమ మారఁగ మోక్ష ద్వా
రమున నలుగురు ద్వారపాలకు లెపుడున్
శమము విచారము సంతో
షము నాల్గవ దైన సాధు సంగమ మనఁగన్. ౧౮౬

తా. శమము- విచారము- సంతోషము- సాధుసంగమము- అను నల్గురు ద్వారపాలకులు మోక్షద్వారమున గావలి గాచు చుందురు.

క. తన యాత్మ లోపల శమం
బున సుఖమై యుండు చందమున నేనాఁటన్
జనుఁడు రసాయన పానం
బున లక్ష్మీయోగమునను బొందఁడు సుఖమున్. ౧౮౭

తా. అంతరింద్రియ నిగ్రహమునఁ దనయాత్మ యందు నెట్టి సౌఖ్యమొందునో, అట్టి యానందము రసాయన పానముచే గాని, ధనసంప్రాప్తిచే గాని పొందనేరఁడు.

ఆ. వె. సద్విచార మనెడు చాయ లోచన మంధ

శార పితతు లందుఁ గ్రాఁగి పోదు
వెక్క విధము లైన ప్రథుల తేజములందుఁ
జంచ లంబుగాక కాంచు నెలమి. ౧౮౯

తా. సద్విచార మను నేత్రమంధ కారంబున గనుపించు ను. గొప్ప తేజంబు చూచిన చంచలత నొందక స్థిరంబుగా నుండును.

క. జలధికి మేరు నగమునకుఁ
గళానిధికిఁ బోలెనధిక గాంభీర్యంబు
న్నిలుకడయును సంతశ్శీ
తలతయు గలుగు న్విచారత త్పర మతికిన్. ౧౯౦

తా. విచారా సక్తునికి, సముద్రమువంటి గాంభీర్యమును, మేరువుబోలెనిలుకడయు జంద్రునివంటి శైత్యమును గలుగును.

క. సంతోషము మోక్ష పదము
సంతోషము పరమ సుఖము సంతోషయుత
స్వాంతుండగు సజ్జనుఁడ
త్యంతము విశ్రాంతి బొందు సశ్రాంతంబున్. ౧౯౧

తా. సంతోషమే మోక్షము. సంతోషమే సుఖము. సంతోష చిత్తుండగు వాఁడెల్లపుడు విశ్రాంతి నొందును.

క. ఈధాత్రి నెచట నైనను
సాధు జన సమాగ మంబు సంసార మహా
గాధాబ్ధి యుత్తరింపఁగ
సాధనమగు నరులకే దోసఁగు నేమిటికిన్. ౧౯౨

తా. సాధు సమాగము సంసారాబ్ధి నుండి తరించుటకు నావవంటిది. గావదోషము లున కవకాశ మీలేదు.

చ. సతతము శీతల త్వమునుస్ స్వచ్ఛతయుంగల యట్టి సాధుసం
గతియను గంగయందుఁ గుతుకంబున నెవ్వఁడు దోఁగుచుండునో

చతురున కేల దానములుఁ సల్పఁగ దీర్ఘము లేల?: యేటిక
వ్రత మొనరింగ ఘోరపుతపోవిధు లేటికి? నశ్వర క్రియల్

తా. నిర్మలమును- శీతలమును నగుసాధు సాంగత్య మను నదిలో స్నానము చేయు వానికి దానము లెందుకు?. తపము లెందుకు? యాగము లెందుకు? అన్నియు వ్యర్థము లేయని భావము

క. సమధిక సౌజన్యము సకల
త్వము నొందుట మృతియునుత్సవంబగు నాప
త్సముదయమును సంపదయ
ట్లమరుట విద్వత్సమాగమ మానం దమునన్. ౧౯౪

తా. విద్వజ్జన సమాగమము గల్గినచో, మరణము- నుత్సవము వలెను, ఆపదసంపద వలెను- నుండును.

క. కావున శమాది గుణములు
భావంబున నలిపి సాధుభజన మొనర్పన్
గావలయు నరుఁడు తద్వా
క్యావలి యంగీకరించి యనఘాత్ముఁడగున్. ౧౯౫

తా. మానవులు పెద్దల సహవాసము సేయుచు, శమాది గుణంబులు మనంబున నిలిపికొని వారివాక్యము లాలకించినఁ బాపరహితులగుదురు.

తే. గీ. యుక్తి సంయుక్తి యగుచుఁ బొమ్మ పొందు మాట
పడుచు వానిది యైనఁ జేకొనఁబట్టవలయు
నలినజుని పలుకైన నన్యంబుఁ గసవు
పుడకయును బోలె సుజనుండు విడువవలయు. ౧౯౬

తా. "యుక్తియుక్తం వచోగ్రాహ్యం బాలాదపి. సుభాషితమ్" మను నటుల బాలుఁడు చెప్పినను యుక్తియుక్తమైన గ్రహింపవలయు. బ్రహ్మదేవుని మాటలయినను, యుక్తియుక్తము కానిచో గడ్డిపరకవోలె విడిచిపెట్టవలయును.

క. ఘనసంతోషము గుణముల

నసురాగము శ్రుతమునందుఁ దా వ్యసనము సత్యం
బున గల్గిన వారలు నరు
లన గీర్తిశాలు లగుదు రన్యు లైనఁ బశువుల్. ౧౯౭

తా. సద్గుణము లందాసక్తియు, వేదమందను రాగమును, సత్యమందు వ్యసనమును గలవారు కీర్తిశాలులగుదురు. లేనివారు పశుతుల్యులు.

సీ. అక్రమంబున రాహు వమృతంబుఁ గ్రోలియుఁ
జయ్యనఁ దామృతుఁ డయ్యెఁ గానఁ
గడ లేని యాపదఁ గడచిన వేళనై
నను సక్రమంబున నడువ వలయు
జనియించు కీర్తి యెవ్వని సద్గుణంబుల
వశుగా దురతనికి వశ్యు లైనఁ
బోలియు నాపద లెల్లఁ భూరి కల్యాణంబు
లక్షయంబునఁ గల్గు నదియుఁ గాక
తే. గీ. పరమ పౌరుషోద్యోగ సంపన్నుఁడై ప్ర
యత్న మొప్పఁగ నుద్యోగి యగుచు శాస్త్ర
మార్గమునను జరించుచుఁ మహిత సిద్ధి
కలితుఁ డెవ్వఁడు గాఁడు భూతలము నందు. ౧౯౮

తా. రాహువక్రమంబున నమృత మ్రాగి చచ్చిపోవలేదా? ఎంత యాపద వచ్చినను నసత్యంబు పనికిరాదు. సద్గుణవంతుని కెల్లరు స్వాధీనులగుదురు ఆపదలు సంపదలగును. శాస్త్రమార్గమునను జరించిన కార్యసిద్ధి నెవఁడు పొందఁడు?

తే. గీ. శాస్త్రగతి తప్పక చరించు సజ్జనులకు
కార్యసిద్ధుల యందు వేగంబు వలదు
కడఁగి చిరకాల పరిపాకమునఁ గరిమ సిద్ధి
యగుట నిజము పుష్పము ఫలమైనయట్లు. ౧౯౯

తా. శాస్త్రము నందు గురియుంచి ప్రయత్నించు వానికి, కార్యసిద్ధి తప్పక కలుగును. వేగపడఁగూడదు. పుష్పము ఫలమగుట లేదా?

ఆ. వె. అర్థ మెంతయు ననర్థకారణమగు
భోగ మెల్లను భవరోగ దంబు
చేయు నాపదల నశేష సంపదలు స
ర్వమును మది ననాదరంబు జయము. ౨౦౦

తా. ధనము, అనర్థములకుఁ గారణము. భోగము రోగ మొసంగును. సంపదలవల ననాపదలు గల్గును. అన్నిటి యందు నిరాదరణమే జయమిచ్చును.

క. నరునకు నీ సంసారో
త్తరణ సమర్థములు గావు తపములు దీర్థో
త్కరములును శాస్త్రములు సు
స్థిర బుద్ధిని సజ్జనుల భజించుట దక్కన్. ౨౦౧

తా. సజ్జనసేవతప్ప శాస్త్రములు— తపములు— తీర్థములు మానవుల సంసారమునుండి తరింపఁజేయఁ జాలవు.

తే. గీ. లోభ మోహా దోషము లాత్మ లోప నుండ
నీక శాస్త్రోక్త మార్గ మంగీకరించి
యర్హ కర్మంబు లేమఱ కాచరించు
జనుఁడు మహి నెవ్వఁడా తండు సజ్జనుండు. ౨౦౨

తా. లోభ మోహముల వదిలియథావిధి తగినకర్మము లాచరించువాఁడే సజ్జనుఁడు.

వ. అదియునుం గాక. ౨౦౩

తా. ఇంతియుగాక.

క. సర్వాత్ముం బరమాత్ముని
సర్వేశుని శివుని నీశు సర్వాతీతున్
సర్వగతు నెఱుఁగు నెవ్వఁడు
సర్వజ్ఞుం డైన సూరి జనుఁ డతఁడ కదా. ౨౦౪

తా. సర్వమునతిక్రమించిన వాఁడును సర్వవ్యాపకుఁడును సర్వజ్ఞుండునగు నాశివుని సేవించినవాఁడే పండితుఁడు.

క. ఆ సర్వాత్ముఁ డెటను
ల్లాసము నేసూపు నొందునొ యల్లద ద్రూప
న్యాసం గుఁడు నుఁ జ్యోతిన్
భాసిల్లును నుంను నెచటఁ బటు విఖ్యాతిన్. ౨౦౫

తా. సర్వాంతర్యామి యగు నాతఁడు తనయిచ్ఛ వచ్చిన రూపమునుధరించి ప్రకాశించుచుండును.

## * మానసోత్పత్తి. *

క. ఘన తరము సుస్థిరంబును
ననఁదగు పరమాత్మ వలనఁ నస్థిర మగుచున్
మనసు జనించుఁ దరంగము
వననిధి వలనన్ సముద్భవం బైన క్రియన్. ౨౦౬

తా. సముద్రమునుండి తరంగము జనించినట్లుల, స్థిరమగుపరమాత్మ వలన నస్థిర మగు మనంబు జన్మించినది.

క. పాయక సంకల్పము చాఁ
జేయు న్మానసము గడుఁ జిత్రాన్విత గతిన్
పేయేమి యింద్ర జాల
శ్రీయది యాతెయును దాని చేష్టయె కాదే. ౨౦౭

తా. మనస్సే బహువిచిత్రముగసంకల్పము చేయుచుండును. ఈయింద్రజాలమంతయు దానివలన గలిగినదేకదా?

క. దృశ్యంబుల తోడి యోగమ
వశ్యము బంధంబు చూచుఁ వానికి వాఁడా
దృశ్య వశంబున బద్ధుఁడ
దృశ్యా భావమున నెమ్మి దిన్ ముక్తుఁడగున్. ౨౦౮

తా. దృశ్యవస్తువులందు సంబంధముండుటయే బంధము. దృశ్యమే లేకున్న ముక్తుఁడే యగును.

క. త్వంకారాహంకారము
ఖాంకము సర్వాత్మకంబు నగుజగ మెల్లం
గొంకక దృశ్యం బనంబడు
సంకిలి యగు మోక్ష లక్ష్మి కది గలుగంగా. ౨౦౯

తా. నీవు- నేను-" నాది- నీది-" యనుభావనతోఁ గూడిన ప్రపంచం బంతయును దృశ్యమనఁ బడు. ఇయ్యది మోక్షమునకు ప్రతిబంధకము.

క. సంకల్పం బమనం బది
సంకల్పము వలనఁ జెడదు సంకల్పంబే
వంకను సముద్భవించు వి
శంకటమై యచట మానసంబును నుండున్. ౨౧౦

తా. సంకల్పమే మనస్సు- అదిసంకల్ప మాత్రమునఁ జెడిపోవదు. సంకల్పమెప్పుడు గలుగునో నచ్చట మనస్సైయుండును.

క. సంకల్ప జాల కలనము
సంకీర్ణం బగుటఁ జేసి జగమిది గలిగెన్
సంకల్ప జాల మణఁగిన
శంకం దన రూపు నిలుచు సత్పురుషునకున్. ౨౧౧

తా. సంకల్ప సమూహంబువలననేజగంబు కల్గినది సంకల్పములు నశించినమహాత్మునకుఁ దనరూపేమిగులును.

*ఆత్మ విచారము*

ఆ. వె. ఏను నీవ నంగ నిది మొదలగు సర్వ
జగము ననెడి దృశ్య సంభ్రమంబు
సత్త్వ యుక్తమైన సదమలాత్మునకుఁ ద
త్సదృశ కేవలత నిజముగఁ గలుగు. ౨౧౨

తా. నీవు నేను అనువచనములు మొదలుగాఁగల ప్రపంచంబంతయు దృశ్య పదార్థము. సచ్ఛబ్ద వాచ్యుఁడగు పరమాత్మ కేవలముగా నుండును.

వ. ఇట్లు దృశ్య ప్రశాంతి నిరీక్షణంబై యాత్మయుండు కేవలత్వంబగు
నది కారణంబు గాన నస్తమిత భాస్వత్తేజోమయుండును, నభ
వుండును, మహాదేవుండును, మహేశ్వరుండును, నిరామయుండు
ను, నిరంతర సర్వకర్తయు, సర్వగతుండు, పరమాత్ముండును, నై
న సదాశివుండఖండగతిం బ్రకాశించుచుండును. అదియుంగాక చి
త్తాకాశ చిదాకాశం బాకాశాత్మం బనెడి యాకాశ త్రితయం
బు నందు శూన్యతరంబు చిదాకాశంబు. ౨౧౩

తా. ఎప్పుడుదృశ్య పదార్థమందు శివభావనగలుగునో, అప్పుడు నిరామయుండు, సర్వవ్యాపకుండునగు సదాశివుండు సంపూర్ణముగ బ్రకాశింపుచుండును. చిత్తాకాశము— చిదాకాశము— ఆకాశము— అనియాకాశములు మూడువిధములు.

తే. గీ. ఒక్క దేశంబు నందుండి నిమిష
మంత వేగంబు లోనదే శాంతరంబు
నందు బొందు వియన్మధ్యమరయ నెద్ది
యది చిదాకాశ మని తెలియంగ వలయు ౨౧౪

తా. ఒకప్రదేశమందుండి నిమిషమాత్రములో దేశాంతరమును బొందు నపుడు మధ్యనుండు నాకాశమే చిదాకాశము.

సీ. ఆచిదాకాశంబునం దుండు వినాశికృ
తాశేష సంకల్పమై తనర్చు
సుస్థితి బొందిన శుద్ధాత్ముండింక శాం
తంబును సర్వాత్మకంబు నైన
పరమ పదంబును బ్రాపించుచుండును
ట్టగుటకు నై సంశయంబు గలుగ
పట్టి జీవుండు మిథ్యామరణము వల
సిన మూర్ఛనించుక యనుభవించి
తే. గీ. పూర్వ భావంబు మఱచి యపూర్వమైన
యన్య భావంబు వీక్షించు నతుల లీల

నన్మహాత్ముఁడు నిత్య సు॥ ఖాన్వితుండు
యోగి యాతండుత్రిగుణ సం॥ త్యాగి యతఁడు. ౨౧౫

తా. ఆవిదాకాశంబున సంకల్ప రహితుఁడై సంచరించు పరిశుద్ధాత్ముఁడు, ముక్తి నొందును. సందేహములేదు. ఏజీవుఁడు మిథ్యావరణమునను భవించి పూర్వ విషయమును మరచి విషయాంతరమును గాంచు చుండునో. ఆమహాత్ముఁడే యోగి. అతఁడే నిత్యాను సుఖముగలవాఁడు. అతఁడే గుణత్రయమును విడిచినవాఁడుసుమా.

సీ. ఉదకంబు లాగున॥ నుండెడు నెండమా
వుల ఁగనుఁగొనమృగంబులకు భ్రాంతి
కొలఁకైన యట్లును॥ కొలఁగాని మూఢమ
తికి నసత్యమైనను॥ సకల జగము
సత్య నిభంబగు॥ చర్చింపఁ గావివే
కవిహీను నకుహేమ॥ కంక ణమునఁ
గంకణ జ్ఞానంబు॥ కాని కల్గదు హేమ
బుద్ధి యజ్ఞున కట్లు॥ పురనగాది
తే. గీ. దీపితాకార ఘనదృశ్య॥ దృష్టి గలిగి
యుండుఁగాని తదన్యమై॥ యొప్పు నిర్మ
లంపు పరమార్థ దృష్టి వ॥ హించు నేర్పు
గలుగ నేర దెన్నఁడును లో॥ కంబు నందు. ౨౧౬

తా. మృగంబు లెండమావుల జూచి యుదక ప్రదేశములని యెటుల భ్రాంతినొందునో, అటులే మూఢులీజగంబును సత్యంబుగా నెంచెదరు. బంగారుకడియమునందు కంకణమనెడి భ్రాంతి యెటులగల్గెనో, అటులే యజ్ఞునకు ప్రపంచదృష్టియే గాని పరమార్థ దృష్టి యుండనేరదు.

వ. నివాతాంబునిధిస్ఫురణంబును, నివాతదీపస్ఫురణంబునుం బోలెను న్న బహిస్ఫురణం బించుక జీవుండని యెఱుగఁదగు నదియొయు ధ నాధిక్యంబునఁ వహ్నియణువు చందంబున నెంవి వాధిక్యంబున బ్రకాశించు. మఱియు నపార విస్తార సువిత్సలిల లలితంబగు చి

దేకార్ణవంబ దానయగుచు, నయ్యాత్మునందు విజృంభించు చుండు, నట్లు గాకుండ నేనిమనో వశంబున సమ్యగ్దర్శనంబు వలన సంసారాఖ్యమైన దీర్ఘ స్వప్నస్థితి బొందు నొదును, జీవాత్మ తత్త్వంబులకు భేదంబు లేని యట్ల జీవచిత్తంబులకు భేదంబు లేదు. జీవచిత్తంబులకు భేదంబు లేనియట్ల చిత్తసర్గంబులకు భేదంబు లేదు గావున. ౨౧౭

తా. నిశ్చలమగు సముద్రంబుబోలె, వాయురహిత ప్రదేశంబందలి దీపంబు బోలె, యున్ననీ బాహ్యశాంతి యేజీవుండు కట్టెలు వేయుటచే నగ్ని ప్రజ్వలించు నటులజ్ఞానాధిక్యమునవహో శాంతగలిగియాత డుజ్జృంభించుచుండును. లేనిచో మనస్సాధీనంబైన సంసారమను దీర్ఘ స్వప్నమునొందును. జీవాత్మలకు- జీవచిత్తంబులకు, చిత్తసర్గంబులకు భేదములేదు.

క. జగములకుం గర్త మానస
మగు పురుషుండు మానసంబె యని చెప్పంబడుఁ
జగతి మనః కృతముక్కృతం
బగును శరీర కృతమైనఁ యదికృత మగునే. ౨౧౮

తా. మనస్సే పురుషుడు. జగత్కర్తయు మనస్సే. మనస్సుచే జేయబడినదియే ప్రధానంబుగాని, తదితరంబు గాదు.

సీ. అంతంబు లేకమఁ హత్తరంబై సర్వ
శక్తుల తోడనుఁ యుక్త మగుచుఁ
దనరారు నాత్మతఁ త్త్వమునకు గలుగు సం
కల్ప ప్రకట శక్తిఁ ఖచిత రూప
మెయ్యది యది మనంబ బయ్యెను సంకల్ప
జాలక కలననీఁ సకల జగము
భావింప నాత్మ, మఁ నోవిలాసము నటు
గాన వేగంబ సంఁ కల్ప మాత్ర
తే. గీ. మల విసర్జన మొనరించిఁ మహిత నిర్వి
కల్పకము నాశ్రయించి యుఁ ఖండ సౌఖ్య

గారణం బగు శాంతి (బొంది పార బొంది
నిత్యుఁడై యుండు బుధుఁడిదె నిశ్చయంబు. ౨౧౯

తా. అంతము లేక సర్వశక్తి సమేతమగు నాత్మకు గలిగెడి సంకల్ప రూపమెటు వంటిదె? యన గా నది మనస్సేయన వలయును. సంకల్పము వలననే యీజగంబుగల్గెఁనది కావున సంకల్పమును విడిచి నిర్వికల్పకము - సౌఖ్య కారణమువగు తత్వముదెలిసికొని బుధుండు నిత్యుఁడై యుండవలయును.

మ. తన సంకల్ప వశంబున న్విమల విద్యా దూరుఁడై మూఢుఁడొం
దును మోహంబును దాని (బొందఁడు పవిత్రుండైన విద్వజ్జనుం
డసితంబుగ సువిచారధర్మిణియు మోహారంభ సంశూన్యముగ
ఘన సంతుష్టియు నైసచారుమతిచే గాఢ ప్రసన్నాత్ముఁడై.

తా. తనసంకల్పంబుననే మూర్ఖులు మోహమొందెదరు. విద్వాంసుఁడటుల మోహంబు నొందక చక్కఁగా విమర్శించి నిర్మలుఁడగును.

తే. గీ. నిర్వికల్పైక రూపంబు నిర్మలమును
నంతమును నద్వితీయంబు ననుపమంబు
నైన చిద్ఘనానందంబు నందు సుస్థి
తుడును భావ్యుఁడునేని ముక్తుండతఁడు. ౨౨౧

తా. నిర్వికల్పము - నిర్మలము - అంతరహితమునగు నా చిదాకాశంబున సుఖము గా నుండు వాఁడే ముక్తుఁడు.

క. గగనంబు ననతి శూన్యం
బగు నీలత్వంబు గలిగె నట్లాది మనం
బొగి (బరమాత్ముని వలన (గ
లిగె జగమిది విదిత మయ్యె లీలాదాన్యగ. ౨౨౨

తా. ఆకాశమందు నల్లని కాంతిగలిగినటుల పరమాత్ముని వలన మనంబు గలిగి జగద్రూపముగాఁ బ్రకాశించుచున్నది.

క. ఎద్ది మనః కృతమది కృత
మెద్ది మన స్సృక్త మదిమహిం దృక్తమగుం

దద్దయు శాంతినో లయుమది
సిద్ధియి భవసంభ్రమము మఱి హాసంయమికిన్. ౨౨౩

తా. చిదాకాశంబున వెలుంగు పరమాత్మను గాంచు యోగీంద్రుడు మనః కల్పితమైన సంకల్ప వికల్పములు వదిలిపెట్టవలయును. వానిని వదలినచో, మహాశాంతి కుదురును.

తే. గీ. భోగ సంకల్ప విభ్రమా ౦బులకు నిలయ
మైన మానసమున (గలక యఖిల విక్రి
యలును సంసార విషవృక్ష ములకు నెపుడు
బ్రబలు చున్నట్టి యంకురా పంక్తు లరయ ౨౨౪

తా. సుఖమునకు- కోరికలకును- స్థానమగు మనస్సు నందుగలసర్వవికారములు—సంసారవిష వృక్షమునకు వేసిన చిగురుటాకులు సుమా?

క. మానస జయంబు గలిన
వానికి (త్రైలోక్య విజయ వైభవము తృణం
బా నందు) బుధులు గావున
మానసము గ్గెలువ వలయుఁ మహితా త్ములకున్. ౨౨౫

తా. మనస్సుజయించినవారికి త్రిలోకజయ ముతృణప్రాయము. కావునమనస్సును మొదట గెలువవలయును.

సీ. సంకల్ప మాత్రవి స్తార విభవమున
బహువిధ వస్తువి వహ నిదర్శ
నమున జనుండు మఱి నంబను శత్రుచే
గెలువంగ (బడునట్టి కిల్బి షంబు
మనసను సంతోష మాత్రవిభవమున
నిత్యోది తంబైన నెఱి నిజేప్సి
తంబున గెలిచియు తండు సుఖము బొందు
మఱి సదసద్వ్యయు మధ్య మునను
తే. గీ. చిత్తజాడ్యద్వయము మధ్య సీమయందుఁ
గలుగు మందుడోలాయితా కారమెద్ది

యదిమనంబనిక థియింతు రాత్మవిదులు
మానసము చేతన మనంబు గాంచఁబడును. ౨౨౭

తా. సంకల్ప విశేషములచేతను, అనేక దివ్యపదార్థముల చూచుట చేతను, మానవులను మనస్సు జయించును. అట్టిమనస్సును నిశరవస్తుదర్శన సంకల్పములనుండి తొలగించిన వాడేసుఖంబు నొందును. ఆత్మవేత్తలు- చిత్తమనకును- జడత్వము నకు మధ్యప్రదేశమునయ్యలవలె నూగులాడెడిదే మనస్సని వచింతురు.

ఆ. వె. మానసము దృఢంబు గానిగ్రహింపంగఁ
జాలు మానసంబు చర్చలేల
రాజుని గ్రహింప రాజుసమర్థుండు
గాకకలఁడె రాజు గానివాఁడు. ౨౨౮

తా. మనస్సును నిగ్రహించుటకు శక్తిగలది మనస్సేగాని. యన్యము గాదు. రాజును జయించుటకు రాజే సమర్థుడు గాని, యితరుడగునా?

క. ఎయ్యెడ నైన న్మానస
మెయ్యది యొనరింపఁ బూను నింద్రియవృత్తుల్
నెయ్యమున దానిఁ జేయుం
జయ్యన రాజాజ్ఞ సేయు సచివులు పోలెన్. ౨౨౯

తా. రాజునాజ్ఞను శిరసావహించి మంత్రులు చేయు విధంబున మనస్సు యొక్కయాజ్ఞను గైకొని యింద్రియము లాయా కార్యములు చేయుచుండును.

సీ. చిత్రంబు గాదెచ ర్చింప సత్యంబైన
బ్రహ్మంబు మఱచి మే ర్పడన సత్య
మైన యవిద్యాఖ్య మగు ప్రపంచము నస
రుండు విభ్రాంతుఁడై యుండు ముక్తి
మార్గమెఱుఁకలేక మఱిస్వరూప స్థితి
ముక్తియా సంక్షేప మునఁనెఱుగఁ
దగుదీని చిత్తమ ర్థంబు వలన నుండి
యర్థాంత రంబున నాశ్రయించు

తే. గీ. నపుడు నజుమునే స్థితియగును నదిగదాని
రస్తమనఁగ నిరాతంకర మనఁబరఁగు స్వ
స్వరూప సుస్థితియందు నిరూఢ బుధులు
దాని నెఱుఁగుట ముక్తిపదస్థుఁడగుట ౨౨౯

తా. మానవులు ముక్తిమార్గము దెలియక సత్యమగు పరబ్రహ్మను మరచి యసత్య మగు ప్రపంచంబున భ్రాంతితో నుండును ముక్తియనలేన రూపమును నంతుటచిత్తమొక యర్థము నుండి యర్థాంతర మాశ్రయించు నపుడుమధ్యనుండునదియేస్వస్వరూపస్థితియనిబుధులు చెప్పుదురు. అనగానిర్గుణస్వరూపమని భావము.

తే. గీ. సాక్షిభూతంబు సమముస్వచ్ఛంబునిర్వి
కల్పమును నిరిచ్ఛంబునేకంబు నగుచి
దాత్మయందు నాదర్శనంబునందు నీడ
చందమున బ్రతిబింబించు సర్వజగము. ౨౩౦

తా. నిర్మలము- ఇచ్ఛారహితము- ఏకము- నగు చిదాత్మయందు నద్దమునందు నీడ ప్రతిఫలించు నటుల జగంబు ప్రతిబింబించును.

క. భాతిగబ్రహ్మ మఖండిత
మాతత సర్వాత్మకము చిదాకాశంబ
ద్వైతమని తలఁచు నతనికిఁ
జేతశ్శాంచల్యశాంతి సిద్ధించు వెసన్. ౨౩౧

తా. బ్రహ్మ స్వరూప మఖండము- సర్వాత్మకము చిదాకాశము- అద్వైతమని భావించు నతనికి చిత్తశాంతిచే కూడును.

ఉ. ఇందుపు గింజచేనుదకమెంతయు శీఘ్రమునం బ్రసన్నతం
బొందు విధంబునన్ విమల బోధవశంబున సుప్రసన్నతం
జెందునొగిన్ స్వభావము విశిష్టవిచారికి నట్టిభావము
స్పందితమైన పిమ్మట నభావమగుం బరతత్త్వ లీనమై. ౨౩౨

తా. చిల్లగింజచేత కలువమగు నీటళము నిర్మలమగు నటుల నిరంతర సద్బోధచే సజ్జనునికి మంచిస్వభావము గలుగును. నిర్మల ము- నిశ్చంచలము- నగు స్వభావముగలిగిన

తరువాత గాని, భావము పరతత్త్వమున లీనము గాదు.

శా. వైరాగ్యస్థిరబుద్ధి నేననఁగ నె వ్వాఁడ జగంబట్లవి
స్తారంబౌటయు నెట్లకో యనెడి యా సమ్యగ్విచారంబు వి
స్తారంబై జనియింప దెవ్వరికి నే దాఁకం దమస్తుల్యసం
సారాడంబర మంతదాక నిలుచుం సాంద్రంబు గావారికిన్. ౨౩౩

తా. ఎంతవరకు వైరాగ్యము గలిగి "నేనెవఁడను, ఈప్రపంచంబు విస్తరించుటకే మి కారణము" అని జనుండు విచారించఁడో, అంతవరకు వానికి సంసార సంకటములుపో నేరవు.

సీ. ఎందాఁక జ్యోత్స్నా చెవ్వారి యంతరం
గమున నహంకార ఘనముచేత
నావృతమై యుండు నందాఁక బరమార్థ
మనెడికుముద్వతి యట్టివాగి
యందు వికాసంబుఁ బొందదహం భావ
మక్షయాత్మక జన్మ వృక్షములకు
నంకురం బయ్యె నా యదియిది యనుట త
ద్విస్తీర్ణ శాఖ సిద్ధిత ఫలములు

తే. గీ. మానసాభ్యుదయంబున మానవునకు
నాశము మహోదయ మనో నాశనమున
విపుల సుజ్ఞాని మనసునా శమును బొందు
నమ్మనంబు శృంఖలగదా యజ్ఞునకును. ౨౩౪

తా. అహంకారమను మేఘంబున నావరించబడి చిత్తను వెన్నెల యెంతవరకు స్ఫుటముగ బ్రకాశించదో, అంతవరకు, పరమార్థమను కలువతీవ వికసించ నేరదు. ఈయహం భావమే జన్మవృక్షములకు అంకురము. "ఇదినాది- అదినాది" యనుట అవ్వృక్షము యొక్క ఫలములు. అందువలన మానసాభ్యుదయము గలుగును. దానివలన మానవులు నశింతురు. మనోనాశనమున విజ్ఞానికి మనస్సునశించును. అమనస్సు మూఢునకు గొలుసువంటిది.

వ. ఈప్రపంచంబువికల్పకలితాకారంబును దేశకాలక్రియాస్పదంబు

నునై జీవుండని చెప్పఁబడును. అతఁడు వాసనాకలనంబుననహం
కారంబునుం బొందును. అహంకార వినిర్ణీతమై యున్న బుద్ధి గ
లంకమై యుండు. బుద్ధియు సంకల్ప సమన్వితమై మనంబగు.మ
నంబు మనన వికల్పంబులం గల్గిమెల్లన యింద్రియత్వంబుం బొం
దును. ఇవ్విధంబున జీవుండు వాసనా రజ్జు వేష్టితుండును, దుః
ఖజాల పరివృతుండును నైక్రమంబున చిత్తంబగును. ఇట్లు శక్తిమ
యంబైన చిత్తంబు ఘనాహంకార గతంబై కోశకార క్రిమిం బో
లెదనం తనబంధనం బొందు. వెండియు స్వ సంకల్పిత విషయజా
లాభ్యంతర వర్తి యగుచు శృంఖళాబద్ధ సింహంబు చందంబున న
త్యంత వివశతం బొందును. అట్లు గావున మనో బుద్ధిచిత్తాహం
కార క్రియా ప్రకృతి మాయాదులను చెప్పఁ దగిన యీ సంసా
రంబు సర్వంబు నాశాపాశ విధాయకం బగుట దెలియ వలయు
బుధుండు. ౨౩౧

తా. చిద్రూపమే దేశకాల క్రియలకు స్థానమై జీవుఁడనఁబడును. అతఁడు జన్మాంతర వాసనాశ్రయ వశంబున నహంకారము చెందు. అహంకారమున బుద్ధి [కలంక ముగును.] చలించును. బుద్ధి సంకల్ప ముతో గూడికొని మనంబగును. మనన వికల్పంబులం గూడి మనస్సు ఇంద్రియములగలసి కొనును. ఇంద్రియములు విషయా సక్తములగును. ఇటుల జీవుండు వాసనాపాశ బద్ధుఁడై దుఃఖంబు లనుభవించు చిత్తమగును. శక్తిగలచిత్తము అహంకారము నొంది దానియంతట నదియే బంధ మొందును.గొలుసులతోఁ కట్టి వేసిన సింహము వోలె, తాను సంకల్పించిన విషయ సమూహ మధ్యమందు బడి మహా దుఃఖమనుభవించును. మనోబుద్ధి చిత్తాహంకారాదుల గూడిక సంసారమని చెప్పఁదగి యున్నది కావున నిది యాశయను త్రాళ్లచే గట్టబడినదని తెలియవలెను.

క. క్షమచింతాగ్ని శిఖాద
గ్ధమహాకోపాజ గరచర్వితంబును నైయు
న్నమనంబు ప్రబోధఁదగుఁ బం
కమునఁబడి చిక్కి యున్నశి గజముం బోలెన్. ౨౩౨

తా. బురదలోఁ బడిగజము కృశించు నటుల, చింతాకోపాసలమందుఁ బడి మనంబు కృశించుచుండును.

గీ. ఆగతములుగాని భోగముల్ గోరకు
న్కియున కృత్రిమమున కిల్బిషంబు
నాగతంబు లేమి భోగించుటయు సు
శీలతయుఁ బ్రాజ్ఞ జనుల లక్షణంబు ౨౬౭

తా. లేనిభోగముల నాసించక తనకు లభించిన సౌఖ్యముతో తృప్తి నొందుట ప్రాజ్ఞజనుల లక్షణము.

వ. కుగ్రామ కామినులు నాగరకుఁ డైనపురుషుం బోలె జగద్భావంబులు తత్త్వజ్ఞుని యుల్లంబు రంజిల్లం జేయలేవు. శరీరంబస్థిమాంస రక్తాద్య శోభనంబు గావునఁ దదాసక్తి విడిచి భూత ముక్తావళీ తంతువైన చిన్మాత్రంబునవలోకించు నతండు తత్త్వజ్ఞుండు. ౨౬౮

తా. పల్లెటూళ్ల యందలి యువతులు నాగరక పురుషుని హృదయమున కానందము గలిగింప నేరనియటుల, జగద్భావంబులు తత్త్వజ్ఞుని మానసము రంజింపఁ జేయ నేరవు ఎముకలు- మాంసము- రక్తము- మూత్రము- మలము- మొదలగు హేయ వస్తువుల కాకరమైనది యీశరీరమని తలంచి దీనియందాశను విడిచి, చిన్మాత్రంబు నాలోకించు నతఁడే తత్త్వజ్ఞుఁడు సుమీ.

సీ. అగణిత శాఖాఫ లాంకురపల్లవ
శాలియైనట్టి సం సారవృక్ష
మునకు మూలము వోలె మనము వర్ధిలు చుండు
నరయ సంకల్పంబ యగు మనంబు
సంకల్ప జాలోప శమమున వేగంబ
యదిశోషణము పొందు నంతలోన
విపుల సంసార పా దపము నాశము పొందు
నటుగాన సద్వివే కాతిశయము
తే. గీ. కలిమి నెమ్మ నంబని యొసఁగి కడఁచి శత్రు

హతునిగాఁజేసి పరమాత్మ, ◆ (?)డైన ప్రాజ్ఞుఁ
బొంద వాశాగణోదత ◆ భూరిదోష
ములు శరంబులు సన్నద్ధు ◆ (?)బోలెనెపుడు. ౨౬౯

తా. అనేకములగు కొమ్మలు.. పువ్వులు- ఫలములు మొదలగు వానిచే చిత్రముగా నున్న యీసంసార వృక్షమునకు మూలముమనంబు. మనస్సనగా సంకల్ప సమూహము. ఇదినశించినచో, సంసార వృక్షమెండి పోవును. కావున మనంబను శల్యము ను గూల్చిన ప్రాజ్ఞుని నాశాపాశము లేమియుఁ జేయఁ జాలవు.

తే. గీ. రజ్జు బద్ధులైయుండు వా ◆ రలకు నట్టి
బాధములు వీడుఁదృష్ణచే ◆ బద్ధులైన
వారుమఱి బంధముక్తులు ◆ గారుగాన
విడువఁదగుఁదృష్ణ సంకల్ప ◆ ముడిగిబుధుఁడు. ౨౭౦

తా. త్రాళ్లచేఁ గట్టబడినటుల- ఆశచేఁ గట్టబడిన వారికి బంధ మోచన మెప్పుడు గాదు. కావున సంకల్పమును విడిచి యాశను వదిలిపెట్ట వలయును.

తే. గీ. మాన సమున రునకుఁబూర్ణ ◆ మైన సర్వ
జగము సంపూర్ణమగు సుధా ◆ స్రవముచేతఁ
బాదరక్షలచే గూఢ ◆ పాదుఁడగున
తనికిఁ జర్మావృతయ కాదె ◆ ధరణియెల్ల. ౨౭౧

తా. తనమనస్సు, ఆనందా మృతపూరిత మైనచో జగమంతయు నటులేయగును. కాలికిఁజెప్పులున్నచో, భూమియంతయు చర్మావృతమై నటులేగదా?

క. క్షితినాశా వివశుండుఁ
ధృతిహీనుఁడు నైనవాని ◆ హృదయము ప్రకటీ
కృతకోటరమై కడుశూ
న్యతఁబొందు నగస్త్య పీత ◆ మగువార్ధిగతిన్. ౨౭౨

తా. అగస్త్యునిచేఁ ద్రాగబడిన సముద్రమురీతి, ఆశాధీనుడై యధీరుఁడగు వానిహృదయముపంద్ర మేమిగిలి శూన్యము గానుండును.

ఆ॥ వె. మనసు నిస్పృహత్వ, మునఁ బ్రకాశించుచో
ప్పవనె లుంగఁ డెందుఁ బూర్ణచంద్రుఁ
డట్లు క్షీర జలధి, యైనఁ బూర్ణంబుగా
దమర1 దాంతి లక్ష్మి, 2 యాగతమున  ౨౪3

తా. మనస్సునం దుగోరిక లేక మెలంగు వాఁడు బ్రహ్మానందమును సంపూర్ణముగా బొందును; సముద్రము పూర్ణచంద్రుని వలన నుప్పొంగి నటుల యైరావతప్రకాశము ననుప్పొంగదుగదా;

క. వెలిగృత్రి మసంరంభముఁ
దలఁపున సం రంభవర్జిత స్థితియును వె
ల్పలఁగర్తృత్వంబును లో
పలఁగర్తృత్వంబులేని, భావము నొప్పున్.  ౨౪౪

తా. వెలుపల మహాడంబరమును, లోపల నిరాడంబరమును, వెలుపల గర్తృత్వంబును లోపల కర్తృవిహీనత్వమునునైన భావంబున నాతఁడొప్పు చుండును.

క. ఎవ్వఁడహంకృతి రహితుం
డె వ్వఁడనాసక్తుఁ డెట్టి, యెడలను మదిలో
నెవ్వఁడు సర్వసమాత్ముం
డవ్విమలుని బ్రతుకు మిగుల నభిరామమగున్.  ౨౪౫

తా. ఎవండహంకారము లేని వాఁడో, ఎవ డెట్టివస్తువు నందైనను, నాశలేని వాఁడో, ఎవఁడందరి యందు సమాన బుద్ధిగలవాఁడో, వానిజీవితమే జీవితము. అనగా శ్రేష్ఠమైనదనుట.

సీ. మోక్షంబు లేదంత రిక్షంబునందుఁ బా
తాళంబు నందు భూతలమునందు
నాశాక్షయంబైన నగుఁ జిత్త సాక్షయం
బదిమోక్ష మని తెలియంగవలయు
నొగిఁ బరవ్యసనయునగునారి గృహకర్మ
మునతి వ్యగ్రయైయును దదీయ

1 వంత 2 యానసంబు

నవసంగ మారసాయ్య నంబునా స్వాదించు
నేకాంతమున గ్రియాగ్ర బెసఁగసిట్లు
తే. గీ. భవ్య సంశుద్ధపరతత్త్వ పదమునందు
సతుల విశ్రాంతి సంపన్నుఁ డైన ధీరుఁ
డట్టి తత్త్వ సుఖంబులో ననుభవించు
నెరయ బాహ్య ప్రవర్తన నిరతుఁడయ్యు ౨౮౬

తా. ఆకాశంబున గాని, పాతాళంబున గాని, మోక్షములేదు ఆశాక్షయమైనచో చిత్తక్షయము గలుగును. అదియే మోక్ష మనఁదగు। అన్యపురుషుని యందభిలాషగల కాంత గృహ కృత్యముల నెరవేర్చికొనుచు, నేకాంతమున తనసంభోగరసాయనంబెటుల ననుభవించునో; అటులే శుద్ధమగు పరతత్త్వమున లీనమగు మనస్సుగలవాడును-బాహ్యప్రవర్తనము గలిగియూ, బ్రహ్మానందము నను భవించును సుమీ?.

వ. తరంగ కళమైన సంసార రచన నవలోకించి మోహంబు నుం బొందక తత్త్వ విశ్రాంతి వర్జితుండుగాక సుస్థిరంబైన శాంతకాంతం బైననిశ్చ యార్థం బాతరంగంబున సంగీక రించియుజ్జగజ్జీర్ణగృహంబున జనుండు విగతజ్వరుండగుచు విహరించు విధం బెట్టిదని న మున్నతత్త్వ జ్ఞాన తత్పరుండును నిజభక్తుండునగు భృంగీశ్వరున కుఁ శార్వ తీశ్వరుం డిట్లనియె. ౨౮౭

తా. తరంగములవలె చంచలమైన సంసారంబునంబడి మోహంబు నొందక, పర తత్త్వము దెలిసికొని, సంచరించు విధంబును బూర్వ కాలంబునఁదత్త్వజ్ఞాన పరుండును నిజభక్తుండునగు భృంగీశ్వరునకుఁ బరమేశ్వరుఁడు. వచించె అదియెటులనిన

అ. ఈశ్వరుఁడు భృంగీశ్వరునితోఁ బలుకుచున్నాడు.

క. అవికల ధైర్యము మదినుని
చి వెసఁగ శంకలు పరిత్యజించిమహా క
ర్తవుఁ గీర్తింప మహాభో
క్తవును మహాత్యాగివి యును, గమ్ముమహాత్మా. ౨౮౮

తా. మహాత్మా-భృంగీశ్వరా! సంపూర్ణమగు ధైర్యమున వలంబించి సందేహము లుడిగి మహాకర్తవు- మహాభోక్తవు- మహాత్యాగి వినమ్ము.

* భృంగీశ్వరుఁడీశ్వరునిమహాకర్తృ మహాత్యాగి మహాభోక్తల విషయమై యడుగుట *

క. అనవుఁడు భృంగీశ్వరుఁడీ
ట్లనియె మహాకర్తయును మ। హాభోక్తయు బెం
పొనరంగ మహాత్యాగియు
ననఁదగు వారెట్టి వార। హర్యజ వంద్యా. ౩౮౯

తా. ఇటులఁ బలుకఁగనే భృంగీశ్వరుఁ డీశ్వరునిఁజూచి మహేశ్వరా! తాముపచించిన మహాత్యాగి- మహాకర్త — మహాభోగి- యనివచింప దగినవారెవ్వరు?

క. దేవా సర్వజ్ఞ మహా
దేవ జగద్ధిత చరిత్ర। తెల్లమిగానా
కీ వృత్తాంతం బానతి
యీ వే కృపననిన। నతనికీశ్వరుఁడని యెఁ. ౩౯౦

తా. సర్వజ్ఞులగు తాము నాకీవృత్తాంతంబు దయతో నానతీయు మని వచింపనీశ్వరుఁడా తనికిటులం బల్కెను.

* శివుండు భృంగీశ్వరునకుమహాకర్తృ మహాత్యాగి మహాభోక్తల విషయమై చెప్పుట. *

వ. రాగద్వేష సుఖదుఃఖ ధర్మాధర్మ ఫలాఫలంబుల ననపేక్షనాచరించు నతండును మౌన పరాయణుండగుచు నిరహంకారుండై నిర్మనస్కుండును నిర్ముక్త మత్సరుండును నైగతో ద్వేగంబున ఁగర్మంబులు సలుపు నతండును. విగతస్నేహుండై కార్యంబు నందు సాక్షియుం బోలె నవస్థితుండై నిరీహంబున వర్తించు నతండును, శోక మోహ రహితుండగుచు సర్వసమబుద్ధియగు నతండును, జన్మస్థితి వినాశముల యందు నుదయాస్త మయంబుల యందును మనంబు సమంబై యుండు వారును మహాకర్తలని చెప్ప నొప్పుదురు, క్రమంబున. ౩౯౧

తా. రాగద్వేషములు- సుఖదుఃఖములు లేక- ధర్మాధర్మముల ఫలాఫలంబుల నాంసించక మౌనముద్రవహించి యహంకార శూన్యుఁడై కర్మంబు చేయువాఁడును, గతస్నేహుండై కార్యంబునందు సాక్షీభూతుడై నిష్కామియై యుండువాడును, శోకమోహముల వదిలి సర్వసమానుఁడై యుండువాఁడును, జన్మస్థితి నాశంబు లందును,మనంబు సమానంబుగా నుండువాఁడును మహాకర్త లని చెప్పఁ బడును.

శా. ద్వేషం బించుకయైన లేక శమముం దీపింపఁగా బుద్ధిలో
నీషత్కాంక్షయుఁ బొందనీక ప్రకృతిం బెల్లన్ ఘనంబైన సం
తోషం బారభుజించుచున్ సుఖములన్ దుఃఖంబులన్ భ్రాంతికృ
ద్దోషాదోషములం గలంగనిదృఢాత్ముండౌ మహాభోక్తదాన్

తా. కొంచెమైన నద్వేషములేక, శమము- అంతరింద్రి యనిగ్రహమున వలంబించి, కోరికలేక ప్రాప్తమైనది భుజించుచు, దోషాదోషంబుల గణించనివాఁడే మహా భోక్త యనఁ బడును.

మ. జరయున్మృత్యు భయంబునాపదయు రాజ్యశ్రీలు దారిద్ర్యమున్
బరమప్రీతి శుభాశుభంబులును రమ్యాన్నంబు నామ్రేడ స
స్ఫురితాహారములున్ హితాహితములున్ భోగించు సౌమ్యంబుగా
పురుషుం డెవ్వఁడలంచు వెంచియు మహాభోక్తృత్వరూఢుండగున్

తా. ముదిమిగాని, మరణముగాని,ఆపత్తుగాని,సంపత్తుగానిను,భయంబుగాని,యశుభంబుగాని,యంతయు సమముగానే యున్నదనుచు,షడ్రసస మేతపదార్థంబుల లోనిదిమంచిది. ఇది కాదు.ఇదియిష్టము-ఇది,అనిష్టమునని తలంచక యెవ్వండనుభవించునో,వాఁడే మహా భోక్త యనఁబడును.

తే. గీ. మనసు మననంబుచు విహితంబులును సమస్త
శంకలును సకలేచ్ఛలున్ సర్వమును ని
జంబుగా లోన నెవ్వఁడు సంత్యజించు
నభినుతింపంగఁదగు మహాత్యాగియతఁడు. ౩౫౮

తా. మనస్సు మననము సమస్త శంకలు, సర్వ మనోరథములు ఇది యది యననేల సర్వంబును నాత్మయందు వదిలిపెట్టువాఁడే మహాత్యాగి యనఁ బడును.

వ. అని పర మేశ్వరుండు మఱియు నిట్లనియె. ఆద్యంతంబును నిత్యోదితంబును ననంతంబును, విమల రూపంబును, ననామయంబును, గార్యైక బీజంబును, సర్వ భావభరితంబును సర్వగతంబును బరమాత్మయు బరతత్వంబును పరమాకాశంబును నైనబ్రహ్మంబయీయఖిలంబును గాని యన్యంబు లేదని భావించుచు దృఢనిశ్చయుండవై. నిరంతరంబునంతర్ముఖ స్వాతుండవై, నిరహంకారుండవై, నిరంజనుండవై, నిత్యసుఖాస్పదుండై ననిర్వాణపదంబునుంబొందు మని భృంగీశ్వరునకిట్లు తత్వజ్ఞానోపదేశంబు గావించెనట్లుగావున. ౨౫౫

తా. ఆద్యంతరహితంబు విమలంబు- అనంతంబు- పరమాకాశంబు నునైనశివుండే యీసమస్తముగానిపేరుగాదు. అనగా యీకనబడుప్రపంచమంతయును శివ స్వరూపమేగాని యితరమేమియు లేదని భావించుచు, అహంకారము వదిలి యంతర్ముఖుండవై- నిత్యసుఖివై మోక్షంబు బొందుమని శంకరుండుతత్వజ్ఞానో పదేశమొనర్చె.

క. మానవుఁ డివ్విధమున న
జ్ఞానతమో దూరుఁడగుచుఁ సతతము బ్రహ్మ
జ్ఞానియగు నేనిదద్యో
గానందము గలుగు నతనిఁ కతులితభంగిన్. ౨౫౬

తా. కావున యజ్ఞానమును విడిచి మానవుఁ డీరీతిగా బ్రహ్మజ్ఞాని యయినచో నాతనికిఁ గలుగెడి యానందమునకు మేరలేదు.

## * బ్రహ్మ మన నెవరు?. *

—०ॐ०—

ఆ. వె. బ్రహ్మమనఁగఁ బరమ పరుఁడు చిన్మూర్తియు
నైన శివుఁడె యనఘుఁ డట్టి శివుని
నర్చనంబు సేయు నదియుత్తమంబైన
యర్చనంబు ధ్యానమంత్రము బుధులు. ౨౫౭

తా. బ్రహ్మమెవరని విచారించిన పరాత్పరుడును- చిన్మాపురుషుండగు శివుండేయని తెలిసికొనుము. అట్టిశివుని పూజించుటయే యుత్తమపూజ. విద్వాంసులు దానినే ధ్యానమందురు.

వి. ఈశానస్సర్వ విద్యానామీశ్వరస్సర్వ భూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణో ధిపతిర్బ్రహ్మా శివో మే అస్తు సదాశివోం" అను శ్రుతివలన బ్రహ్మయనగా శివుడేయని చెప్పవలయును.

ఉ. ధ్యానమె కాదె యోగమన నాగమ విశ్రుత మయ్యె నాశివ
జ్ఞాన సుఖానుభూతి కది సాధనమైనది గాదె సంయముల్
దాననెకాదె శాశ్వత పదస్థితు లొందురు గావునన్ ముదం
బూనగ నభ్యసింప వలె యున్మతి మంతులు యోగమెప్పుడున్.

తా. ఏదియాగమంబుల విస్తారంబుగాఁ జెప్పఁబడెనో, ఏది బ్రహ్మజ్ఞాన సాధనముఁ గారణ మైనదో, మునీంద్రులు దేనివలన శాశ్వత పదము గాంచుదురో అట్టియోగము ను బుద్ధిమంతులభ్యసింపవలయును.

క. ఏనును నాల్గును నాఱును
నైన ప్రకృతియందు మీఁది యాత్మను దెలియఁగం
గానగునె ప్రకృతి పురుష
జ్ఞానంబది వలయు నభ్యసనకాలమునన్. ౨౫౯

తా. మొదట ౨౬ తత్త్వములుగల ప్రకృతితత్త్వముకు మీఁది యాత్మను దెలియుటయే ప్రకృతి పురుష తత్త్వజ్ఞానము. ఇదియభ్యాసకాలమున నుండవలయును.

క. పరుసం బ్రకృతిం బురుషుని
బరికింపక మఱి విరక్తి భావము లేదద
ర్వార వొనగూరక యోగ
స్ఫురుఁడగుటది దుర్లభంబు చింతింపంగన్. ౨౬౦

తా. ప్రకృతి పురుషుల గుర్తింపక విరక్తి భావము నొందక యోగి యగుట దుర్లభము.

వ. అది యెట్లంటేని. ౨౬౧

తా. అదియే విధముగా నున్నదనగా.

క. నేలయు నీరును వెలుఁగును
గాలియు నాకసము నేనుగాఁ బ్రకృతి గుణం
బోలింప నిది శరీరము

జాలి బడక దీనివిధముఁ జనుఁడెఱుఁగఁడగుఁ. ౨౬౩

తా. పృథివ్యాపస్తేజోవాయురాకాశములను పంచభూతములు ప్రకృతియగును గాన మొదలీ శరీరము సంగతి గుర్తించవలెను.

* శరీర నిరాకరణము. *



చ. ముదిమిఁవసించు పెంటములఁ మూత్రము లుండెను మాటుగుంటయు
న్మదముల ప్రోవు పాతక సమాజము తావ్రతెవుల్లవేలమా
పదలకు మూలమాత్మ పరిపంథుల మోలము దుర్గుణావలుల్
చెదరక యున్న కందువ పసించిన శరీరముకాదె చూడఁగన్.

తా. ఆహా! ఈశరీరము మహాదుర్గంధము గలది. అతిజుగుప్సాకరమైనది. మలమూత్రములకు నివాసము- ముసలితనమున కాధారము. అహంకారమునకిది నిలయము. అనేకపాతకముల కాలయము. దుర్గుణములకు నిల్లు. అరిషడ్వర్గమునకు నిలయము సుమా!

క. ఇది యట్టిది యాఁగాకే
మది నిత్యంబైన జాలుఁ నన్నను మఱిబు
ద్బుదముగతి జలదము క్రియవి
ద్యుదు దారత బొందుఁగానిఁ యుండదు నిజమై. ౨౬౪

తా. ఇదియిట్టిదే యాగాక నిత్యమైనచో దీనినేయాశ్రయింపవచ్చును. బుద్బుదము వోలెను మెఱపువలెనున్న నీదేహమనిత్యముగదా.

క. సరికర్మవశత బ్రకృతిం
బొరసిన యట్లుండుఁ గానిఁ పొరయఁడు పురుషుం
డిరవుగ దాయే నాఁడును
శరీరికి న్శరీరమునకుఁ జెప్పింపంగన్. ౨౬౫

తా. కర్మవశంబున బ్రకృతి పురుషులకు సహవాస ముండినటుల నుండు గాని, విచారింపఁగా జీవునకును, శరీరమునకు పరస్పర శత్రుత్వమే గలదు.

క. పెక్కు ఘటంబుల లోపల

నొక్కగ గనమున్న భంగిని గొగీదనువులలో
నొక్కటి యయాత్మ నిలుచు
న్నిక్కముగా దీని దెలియ, నేరుపు వలయున్. ౨౬౬

తా. కుండలన్నిటి యందును నున్నయాకాశము [అవకాశము] ఎటుల నొకటియో అట్లేయాత్మలన్నిటి యందున్నయాత్మ యొక్కటియేయని తలంచవలెను.

క. అంగము గనలేదంగిత
దంగము గనునంగి రెండున్ నటమీదటి యా
త్మాంగన లేదా యాత్ముం
డంగము నాయంగి గాంచున్ సంద్రాత్మ విదుల్. ౨౬౭

తా. ఈయడమను శరీరము లోపల జీవుని గ్గాంచ లేదుగాని జీవుడు మాత్రము శరీరమును దెలిసికొనును. ఈశరీరము- జీవుడును వారిపై నున్నయాత్మ [పరమాత్మ] నుగాంచనేరవు. ఆపరమాత్ముడు మాత్రము- జీవుని శరీరమును జూచునని యాత్మవేత్తల ందురు.

వ. కావున. ౨౬౮

క. నిత్యుండు దేహియెప్పుడున
నిత్యము దేహంబయును మనీషుల్ నిత్యా
నిత్యములు నిశ్చయించుట
యత్యనుపమ మగు విరక్తిన్ యదివో జగతిన్. ౨౬౯

తా. కాబట్టి దేహినిత్యుడనియు, దేహము నిత్యమనియు నిశ్చయించుటయే విరక్తియన బడును.

క. ఈ దేహంబు స్వతంత్రము
గాదట ధనధాన్య గేహ కరితురగ గ్రా
మాదులవి స్వతంత్రములే
యేదియు ననురక్తి సేయన్ నేలాధరణిన్. ౨౭౦

తా. ఈదేహమే స్థిరముగానుండ కుండిన ధనగృహాదులుస్థిరముగానుండునా?ఉండవు. కావునదీని యందను రాగంబు వహించుట నిష్ఫలము.

వ. మఱియును. ౨౭౧

## * ధనాది నిరాకరణము. *

మ. పరతత్త్వార్థము సమ్ముఖంబునఁ గడుం బ్రత్యక్షమై యుండఁగాఁ
గరమర్థిం గబళింప నేరక, ధనాకాంక్షన్ ధరిత్రీతలం
బరయుంగా నిధి శంకఁ ద్రవ్వుదురు ప్రాణాయాసంబునుం బొంది య
స్థిరమాపత్ప్రద మౌటెఱుంగరు జనుల్ చింతింపనా విత్తముల్.

తా. పరతత్త్వమను ధనముతన యెదుట సాక్షాత్కరింపగా దానిని, ననుభవించనేరక ధనాశచేత మహాప్రయాసము నిధులుగల వని త్రవ్వుదురు. అయ్యో! ఆ విత్తము— చంచలమును, ఆపదల కాలయమునని యెరుఁగలేరుగదా?

సీ. కల్లకూరిమి చూపి కలధనం బెల్లను
మెల్లన చేఁదికొను మెలపు గల్గి
రతికేళిఁ జొక్కించి భ్రమయించి నిష్ఠలు
బూడిదఁ గలుగునైన పుణియుగలిగి
ప్రణయ కలహమునఁ బాసి మానం బెల్ల
నేలత్రోఁ గలిపెడి నేర్పుగలిగి
కులశీల విద్యాదులను గుణములఁ బెడఁబాపి
జముపురంబున కేగు జాడఁ జూపి
తే. గీ. తారు గాని వారును బోలెఁ దగిలి నగుచు
మాయరూపుల నానందు మగువ పొందుఁ
దగిలి చెడుదురు మూఢులెంతయును ముక్తి
కాంత దగిలిన సుఖవంకల గలదె యొందు. ౨౬౩

తా. ఏకాంతామణి కపటపుఁ బ్రేమను గనపరచి తన దగ్గరనున్న ధనమంతయు గ్రహించునో, ఏయువతి, కులము– శీలము– విద్యను వశింపజేసి యమధర్మరాజు పురంబునకేగు మార్గము చూపునో, ఏవనితారత్నము రతికేళి యందు సుక్కించి నిష్ఠలనన్నిటిని బూడిదెలో గల్పునో, ఏనారీవతంసము ప్రణయ కలహము నభినయించి తనగౌరవము నంతయు నశింప జేయునో, ఎవతుణి యనేకవిధముల బాధించియు తానుగానటుల నభినయించునో, అట్టిమాయారూపము గలవేశ్యాంగన యందురక్తి గలిగి మూఢులు సుఖింప దలతురు

గాని విచారింపగాముక్తి కాంతాసంగమము నందు గల సుఖ మందు లేశమును లేదుసుమీ ౨౭౪

వ. అదియుగాక.

క. గణికా జనసంయోగ
ప్రణయోత్సాహాంత బిందు పతన సుఖంబా
క్షణమాత్రము ముక్తిసతీ
ప్రణయ సుఖంబ చలిత ప్రభావం బరయన్, ౨౭౫

తా. మఱియు గణికాజన సంయోగమున సుఖంబు బిందుపతన పర్యంతమే గాని ముక్త్యంగనా సుఖమెల్లపుడుగలుగునుసుమీ?

*స్రగ్ధర*

అనృతంబుల్ పల్కఁడేవిద్యల బరిణతుఁడే యప్రమత్తుండయేస
జ్జన బంధు వ్రాతసంరక్షణపరుఁడే సుజ్ఞానియే సిద్ధలింగా
ర్చన నిష్ఠుండేని సత్పాత్రికుఁడతఁడ కదా ప్రాతిగానిట్లుగాదే
జను సేదుర్మార్గ బేరాసఁ దగుల నెపుడున్ జ్ఞానమన్నట్టుగల్గన్.

తా. ఎవండ సత్యము పల్కడో విద్యలందు బరిపూర్ణుడో ప్రమాద రహితుడో స జ్జనులను బంధువులను రక్షింపునో, జ్ఞానియో, లింగార్చ నాపరతంత్రుడో, అతడే సత్పాత్రుడు.సుజ్ఞాన ముండియు, పేరాసచేదుర్మార్గ సేవింప ననర్హుము సుమీ?

* బంధునింద *

క. తనుముక్తి పురికి నరుగం
గనికని బంధించి జమునికడకుం దమతో
డనకొని పోయెడి బాంధవ
జనముల కడనుండ జనునె సత్పురుషులకున్. ౨౭౭

తా. తానుముక్తి పురికి పోదగిన వాడైనను, తనను సమయాను రాగములచే బంధించి యముని పట్టణమునకు దీసికొనిపోయెడిబంధువులయొద్ద సత్పురుషులకునిలువదగదు.

చ. శరుగడు బిన్న వీవకట కాలము వోయెనె యింత లోనసె

క్కుడు వ్రతనిష్ఠలం దనువుఁ గొందల పెట్టెద వేటికంచు నే
ర్పడ బ్రియ బోధ సేయుచునుఁ బంధులబోలె సుశీలుఁ జేరి పొ
రుమగక యెల్ల కాలమునుఁ నుమ్మెత్త కాయలు దిన్నవార్గదా. ౨౭౮

తా. కొడుకా నాయనా, నీవుచిన్న వాడవు ఇంత చిన్న తనము నందే నీకీవ్రతములెందుకు? నిష్ఠలెందుకు వ్యర్థముగా శరీరమేల కష్టపెట్టెదవు. అనిబంధువులబోలె వచింతురు కాని, వారు, ఉమ్మెత్త కాయల నిత్యము దిన్న పిచ్చివారు గదా!

క. కాలము పోయెనె యింతట
నేలా యీనిష్ఠల నెపుఁ హీనమతులు దా
రాలోకింపఁగ మృత్యువు
పాలఁబడక యుండఁ బూటఁ పడఁజాలుదు రే. ౨౭౯

తా. కాలమింతలో యేమిపోయినది. ఇప్పుడప్పుడే యీనిష్ఠ లెందుకని పల్కుమహీనులు చావ కుండ జామీనీయఁ గలరా?

క. ఘనసంసారాంబుధిలో
మునిఁగించుచు వెడలనీకఁ మూఁగుచు మాయా
ఘనులగు బాంధవు లేటికి
జననుత శివయోగ బంధుఁ సంగము గలుగన్. ౨౮౦

తా. నిరంతరము సంసార సముద్రమునఁబడి తాము మునుగుట యేగాక యితరుల గూడముంచెడి యాబంధుకోటి యున్నను లేకున్నను నొకటియే యని తలంచి శివబంధుకోటి నాశ్రయింపుము.

తే. గీ. కామరోషాది గుణములఁ కథలు చెవుల
కింపుగాఁ జెప్పుచునుఁ బయఁలీడఁ జేసి
నెరయ దుర్మార్గమునఁ బెట్టుఁ నీచసఖులు
చిత్తమను శాంత సఖునకుఁ వత్తురెట్టు. ౨౮౧

తా. కామాది దోషములు గలవారి సత్కథలనే చెవులకు నింపుగా వచించు దుర్మార్గమున జిత్తమును ప్రవేశపెట్టెడి స్నేహితులు శాంత సఖునితో సమాను లగుదురా?

*లయ్యగాహి.*

మొత్తములు గట్టి తగుః భృత్యులును జుట్టములు
నత్తికొని యుందురుః నిత్యమును మర్త్యుల్
విత్తబహుళంబయినః యత్తఱిన యొక్క యెడ
విత్తమెడ ప్రేల్పడునుః దత్తరముతో దా
నొత్తుకొని నీనుకడః కొత్తుమన నేటికని
రిత్తలును నగ్గలునుః నెత్తికొని యుండం
జిత్తమున సంతతముః నత్తలము నొందుటకు
నుత్తములు చూచిమెఱః మెత్తురె ధరిత్రిన్. ౪౪౨

తా. ధనమున్నంతవరకు చుట్టములు- భృత్యులు గుంపులుగూడి వసింతురు. ఆధనము వ్యయమైనచో, వీరిలో నొక్కరును దగ్గరకు జేరనీయరు ధనము లియ్యరు ఆట్టిసమయమున వారుచేయు పరిహాసముల నాలకించి విషాదము నొందునట్టి హీనుల నుత్తములు చూచి మెచ్చికొందురా?

శా. ఏవారైనను చారలే మనుపుమైః హింపంగ నెవ్వారికిం
జావా మాన్పఁగ లేరు వారు పిదపఁః జాఁదోడు రానైన లే
రావేగంబున దోడఁజచ్చిననుః గర్మాయత్తులై యన్యలో
కావాసంబున కేగుచుండుదురు తత్వ్యంబౌతయుం జూడఁగన్. ౪౪౩

తా. ఎవరైనను గానిండు. వారుచావును మాన్పలేరు. పోనిండు చచ్చుటకు తోడగూడ రానేరరు. ఒకవేళ జచ్చినను పూర్వకృత సుకృతిదుష్కృతాను సారముగలోకాంతరమున కేగుదురు గాని తనలోకమునకు రానేరరు.

వ. కావున.

క. ఈ త్రయిని బుత్రమిత్రక
ళత్రాదులకుం దొలఁగ వ లయునటుగాదే
జిత్రంబనఁగ జలాంబుజ
పత్రస్థితి నుండవలయుః బ్రాజ్ఞుఁడు పేర్మిన్. ౪౪౪

తా. కాఁబట్టి పుత్రమిత్ర కళత్రాదు లందలి మోహంబు నైనా వదల వలయును. లేదా కమలంబు నందలి జలబిందువువలె నంటియు నంటకయు నైనా బుద్ధిమంతుడు సంచరించ వలయును.

క. నెట్టన విధాత్రు కృతమునఁ
గట్టిన యీయింట నుండఁ గలుగద నిన్ఁదాఁ
గిట్టిన యింట న్మానవుఁ
డెట్టో? తనకుండ గలుగు నీమహి లోనన్. ౨౮౬

తా. బ్రహ్మదేవుడు కట్టినయీయింటి లోనే తానుండక లేచి పోవుచుండగా తాను గట్టిన యింటిలో మానవుం డుండు దునను కొనుట యెంత వెఱ్ఱియో విచారించుము.

సీ. నిత్యభాగ్యోపేత నిజవధూలావణ్య
సరసులఁ గ్రీడింప దొరకెనేని
ఎల్లెడఁ జల్లని సొల్లంపు బంధు సం
ఘముతోడ భుజియింపఁ గలిగెనేని
రణవేళలను వితరణ వేళలను జగ
ద్విదితకీర్తిస్థితి వెలిసెనేని
వేదాంత విద్యాప్రవీణులరప్పించి
యుచిత కథాగోష్ఠి నుండెనేని

తే. గీ. అనుభవించుట యొప్పును ఐహికంబు
నట్లు సిద్ధింప దేనిం దునందుఁ జెడక
మానవుఁడు సద్గురుస్వామి మతము నమ్మి
విడువఁదగు నీచసంసార మిడుమనక. ౨౮౭

తా. తన యదృష్టవశమున చక్కని భార్య లభించినచో, ప్రతిదినము బంధుసంఘముతో భుజింపగల్గినచో, యుద్ధమందేమి? దాతృత్వమందేమి? యెక్కువకీర్తి ప్రతిష్ఠల సార్జింపగల్గినచో, వేదాంత వేత్తలను బిలిపించి వారితో బ్రహ్మవిచారము చేయగల్గినచో- ఐహిక భోగంబు లేయైనను భవించవలెను. లేనిచో ఇందు నందుఁ జెడక నీచమగు సంసారమును వదలవలయును సుమా?

వి. ఐహిక భోగంబులను భవించినను వేదాంతులతో నిరంతరము మెలగుచు- తామరమీఁది నీటిబిందువువలె సంసారంబున నున్నచో ముక్తి గలుగునని కవియభిప్రాయము.

క. జననీ జనకుల నతివలఁ
దనయుల ధనధాన్యములను దలవెండ్రుకలన్
వినుతాంబరముల విడిచెన
మనుటలు సంగంబు విడుచు టది గాదెందున్. ౨౮౮

తా. కొందఱు దుర్మతులు- తల్లిదండ్రులతో బనిలేదు. భార్యతో బనిలేదు పుత్రులతో బనిలేదు. దివ్యాంబరముతో బనిలేదు దివ్యశిరోజంబులతో బనిలేదు. అనివీటినన్నిటిని వదిలిపెట్టవలతురు గానియిదియును రాగమును విడుచుట గాదు.

క. తోడన యీయుక్తులు గెడ
గూడవు విజ్ఞానులది యగుం బొమ్మనిలోఁ
గూడదు బహిఃప్రసంగము
వీడుట మానవుని మాయ వీడుట యగునే. ౨౮౯

తా. విజ్ఞానులివియన్నియుండినను నాత్మయందే నన్యసింతురు. బహిఃప్రసంగములు వీడినంత మాత్రమున మానవుని మాయను విడుచుట యగునా? కానేరదు.

తే. గీ. సరసనాంతర మానస సంగములను
గణఁగి విడునక బాహ్య సంగంబు విడుచు
నేని ఫలమట్టి దగునేని నిహము మున్నె
లేదు కైవల్య పదమును లేదు నిజము. ౨౯౦

తా. మానసప్రేమను బిడువక బాహ్యవస్తుప్రేమ విడిచినను ఫలము కూడ నట్టిదియే యగును. అట్టివానికైహికము లేదు. ఆముష్మిక మంతకముందే లేదుసుమా?

సంగత్రయజుగుప్స.

———*———

శా. సంగంబంతయు వీడినారమని తేజంబార నంతర్మన
స్సంగత్యాగము సేయనేరక వనస్థానప్రవేశంబు సే

యోఁగాఁ (జూచు విహీన బుద్ధి కదిగే! హాంబట్ల యంతర్మన
స్సంగత్యాగము గల్గెనేని విపిన! స్థానంబె యా గేహమున్. ౨౯-౧

తా. మేము సంగమంతయును విడిచితిమి. అని మనస్సన్న్యాసము సేయనేరక, వానప్రస్థాశ్రమమును కొందరు ప్రవేశింతురు. కానియదియు గృహములో సమానమే. అంతస్సంగ త్యాగము గల్గినవానికి గృహమే యరణ్యమగును. ౨౯-౨

వ. అదియుం గాక.

ఆ. వె. మొదలు మూఁడు సం! గములు గల్గియడవిలో
నున్న నేమి యింట! నున్న నేమి
మొదలు మూఁడు సం! గములు లేక యడవిలో
నున్న నేమి యింట నున్న నేమి. ౨౯-౩

తా. మఱియును- సంగత్రయములున్న జనుడు, అడవిలోనున్న నేమి? యింటియందున్న నేమి? సంగముల మూడిటిని వదలినవాడింటిలో నున్న నేమి?యడవియందున్న నేమి? ఏమియును ప్రయోజనము లేదు. రెండు నొక్కటియే యని భావము. ౨౯-౪

వ. త్రివిధ సంగత్యాగం బెట్టిదనిన.

తా. సంగత్రయమును బరిత్యజించుట యెట్టిదన

క. చింతింప కొంకింత యాఁదన
యంతరము నఁదగుల కునికి! యారయ నదియో
యంతస్సంగము విడుచుట
యింతయు (జాలదె విముక్తి! యిన్నియు నేలా. ౨౯-౫

తా. తనయంత రంగమునకులో కడకుండుటయే యంత స్సంగము విడుచుట. అది యొకటియే ముక్తికి మార్గము గాదా? ఇతరములతో బనియేమి.

క. సరిబాహ్యా భ్యంతరములఁ
దిరుగు మనసు నొక్కచో స్థిరము పఱిచియు
వ్వేరవున లీనము సేయుట
యరయ మనస్సంగము దుగ్గుటవి వోజగతిన్. ౨౯-౬

తా. బాహ్యసంజమి? లోపలియేమి? అనేకప్రదేశములు తిరుగుచున్న మనస్సును

నొక్కచో నిలిపినచో మనస్సంగమును బరిత్యజించినటు లేయనితలంచుము.

సీ. పుత్రమిత్ర కళత్రము మున బాంధవులదా స
దా సీజనుల ధనధాన్యములను
గోసమూహంబుల భాసితగృహముల
క్షేత్రంబులను దేహకృత్యములను
వేదశాస్త్ర పురాణ వివిధాగమ స్మృతి
భారతాది మహాప్రబంధములను
యజ్ఞంబులను దీర్ఘయాత్రల జపతపో
వ్యాపారముల న్నాశ్రమాదికముల

తే. గీ. విడిచిసంపదాపదలను ల్లెడగృహశ్మ
శాన భూముల శీతలోష్ణముల యందు
వినుతి పరిభవముల సమవృత్తినునికి
బాహ్య సంగ పరిత్యాగ భావమయ్యె. ౨౭౭

తా. పుత్రులను, మిత్రులను, కళత్రములను దాసదాసీజనంబులను గోవులను గృహములను, తీర్థయాత్రలను జపతపంబులను, వేదశాస్త్ర పురాణాదులను- ఆశ్రమాదులను విడిచి సంపత్తునందును ఆపత్తునందును, గృహమందును, కల్లకాటి యందును, స్తుతియందును తిరస్కారమందును శీతోష్ణముల యందును సమానముగా నుండుటయే బాహ్యసంగపరిత్యాగ మనబడును.

వ. మఱియును. ౨౭౮

క. సద్గురుకృప సుజ్ఞానము
హృద్గతి దీపించుచున్న నేలా చదువుల్
సద్గురు కృపసుజ్ఞానము
హృద్గతి దీపింపకున్న నేలాచదువుల్. ౨౭౯

తా. సద్గురు ప్రసాదమున జ్ఞానము హృదయ కమలమున ప్రకాశింపు చున్న చో చదువు లెందుకు? సద్గురు ప్రసాదమునతత్వ జ్ఞానము గల్గనిచో చదువులతో నేమిప్రయోజనము రెండువిధముల వ్యర్థమనియే భావము.

తే. గీ. ఒడలు పడయిల్లు సంతృప్తిఁ జెడని లక్ష్మి
యమల సద్విద్య యనుకూల మైనభార్య
లనుచు నిస్సంగమతి సంగతి నాత్మసుఖము
నొందియున్న బహిస్సంగ ముడుగు టిదియె. ౩౦౦

తా. శరీరమే పడియిల్లు. సంతృప్తియే లక్ష్మి. సద్విద్యయే యనుకూలమైనభార్య. యనిఁ దలంచి యాత్మసుఖము నొంది యుండుటయే బహిస్సంగపరిత్యాగము.

క. కావున సంగత్రయమును
భావంబున విడిచి గురుకృపఁ బాగరి మముతో
సేవింపుచు వర్తించిన
జీవన్ముక్తత్వ మిదియె చింతింపంగన్. ౩౦౧

తా. గురుప్రసాదమున సంగత్రయంబును లోనవిడిచి ప్రవర్తించుటయే జీవన్ముక్తి యనఁబడును.

క. ఈ సంసారము లోఁగల
యేసుఖమును దుఃఖమునకు నింతయు వెలితే
యీ సంసారము విడిచిన
నేసుఖమును నాసుఖంబు నెనగాదెంచన్. ౩౦౨

తా. సంసారమున గలయే సుఖమైనను దుఃఖమునకు తుల్యమగునది కాదు. అనఁగా సుఖముకంటె దుఃఖమే యెక్కువ. సంసారము విడిచినచోఁ గలుఁగెడి సుఖంబు నను నే సుఖము సమానము గాదు.

సీ. విద్యార్థియై మదిఁ వేధించి కలిగిన
విద్యాధికులఁ గని విసివి విసివి
ధనములు పార్జింపఁ దలపోసి కలిగిన
ధనరక్షణమునకై తలరి తలరి
కులభామ లేమికిఁ బలవించి కలిగిన
ననుకూల గాకున్న నలసి యలసి
సంతతి లేమికిఁ జింతించి కలిగినఁ

గొడ్డుగాని సుతులచేఁ గుంది కుంది

తే. గీ. లేమిమోలయు దుఃఖమౌఁ లేమి కంటెఁ
గలిమి నిసుమడి దుఃఖమైఁ గానుపడఁగఁ
దాపమును బొంద కెపుడు నిర్ద్వంద్వవృత్తిఁ
బరఁగు వాఁడు పరబ్రహ్మపదవిఁ బొందు. ౩౧౩

తా. తానెంతవిద్య సాధించినను, ధనకంటె నధికులఁ గాంచి విచారపడక దప్పదు. తానుధనము నెంతో కష్టమున సాధించినను దానికంటె మునకు విచారపడక దప్పదు. తానుకులకాంతను వివాహమాడినను, అనుకూలవతి గానిచో శోకింపకదప్పదు. సంతానము లేకుండునపుడు చింతించి యెటులనో గలిగిన సంతానములోఁ దృప్తి నొందుటకు వీలు లేక తనకొడుకు బుద్ధవాఁడైన దుఃఖింపక తప్పదు. దారిద్ర్యము దుఃఖము. దానికంటె సంపదయే యెక్కువ దుఃఖము. ఎట్టి తాపమునను భరించక సుఖదుఃఖములందు సమానంబుగా నుండువాఁడే పరబ్రహ్మపదవిని బొందును.

క. తొలఁగి మమత పూరిపుచ్చుకం
దగిలిన నది బంధకారకం బని తథ్యం
బుగ "నమమ" యనుచు సర్వము
తెగవిడిచిన బరమ సుఖమునఁ దిరమై యుండు బుధుల్. ౩౧౪

తా. మమత్వము గడ్డిపరకయంతయున్నను, నయ్యది బంధమునకే కారణమగును. దానికాదని యంతయును విడిచినవాఁడే సుఖంబు నొందును.

* ఆశ్వాసాంతము. *

శా. వేదాంతామ్నాయ శాస్త్రవాక్య పటలీ విఖ్యాత తత్త్వార్థసం
వేదిత్వామలిన స్వభావ హృదయా విఖ్యాత సంవర్ధితా
భేదజ్ఞాన మహోజ్జ్వలానిలసఖ స్ఫీత ప్రభా దగ్ధనా
నాదోపాకర ఘోర సంసృతి నిదాఘ స్థాన కర్మాటవీ. ౩౧౫

తా. సంతతము వేదాంత విచారణ చేత, నిర్మలమైన హృదయము గల వాఁడా! తద్విచారమున గలిగిన లింగైక్యజ్ఞానాగ్ని చేదహింపబడిన సంసారారణ్యముగలవాఁడా!

క. అసమ శివజ్ఞాన సునా

శస పరిపూరిత హృదయ రసః స్థిరతరమా
నస కమల మధుకరీకృత
కుసుమ శరారాతి మూర్తి గురు శుభమూర్తీ. ౩౦౭

తా. అనుపమానమగు శివజ్ఞానము చేత నిండింపబడిన హృదయము కమల మందు నివ
సించిన ఈశ్వరుడు గలవాడా!

మాలిని. విగత దురితజాలా విద్వదాత్మానుకూలా
త్రిగుణ హరణలీలా దివ్యశోభాలవాలా
సగుణ భజనలోలా శైవధర్మానుపాలా
నిగమ మహిత శీలా నిర్గుణ జ్ఞానమూలా. ౩౦౮

తా. దోషరహితుడును, విద్వాంసులకు గల్పవృక్షమును, త్రిగుణ రహితుడవును,
సగుణారాధనా సక్తి గలవాడవును, శైవధర్మముల పరిపాలించువాడవును నిర్గుణజ్ఞానమున
కు మూలమును, నగు నో సాకారా రాధ్యా! (క్రియనిస్వీకరింతుము)

గద్య.

ఇది శ్రీగురు చెన్నసదాశివ యోగీంద్ర పదారవింద మధుకరాయమా
ననిరంతర శివభక్తి సమాధాన కౌలనియాది మూలనామాత్య పుత్ర
అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతి సుముఖ కవిజనమిత్ర సరస కవిత్వ
రచిత ప్రభావ గణపతి దేవ ప్రణీతంబైన శివయోగసారం
బునందు నుత్తరభాగంబున ప్రథమాశ్వాసము.

గద్య.

గురుచెన్న సదాశివయోగి శిష్యుడును, శివభక్తి సహితుడును, కౌలనియాదిమూలనమంత్రి
పుత్రుడును, ఇతరదేవతా స్తుతిపరాఙ్ముఖుడును శివస్తుతి పరతంత్రుడు
ను, కవిజన మిత్రుడును, సరసక విశారద నాటకలుడునునగు
గణపతి దేవునిచే రచింపబడిన శివయోగ సారోత్తర భా
గమునందు ప్రథమాశ్వాసము సంపూర్ణము.



తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ౨ | ౨౦ | రంబబు | రండంబు |
| ౩ | ౨ | మమున | మమును |
| ౬ | ౨౪ | లకు | లను |
| ౧౪ | ౩౪ | చిందుట | చించుటనే |
| ౧౫ | ౨౧ | నిధ్యా | నిధ్యాన |
| ౨౨ | ౨౨ | జమ | జనను |
| ౩౬ | ౧౯ | అజ్ఞా | ఆజ్ఞా |
| | ౨౨ | లవు. మాయేయ మలమనగా పాప | లవు. పాప |
| | ౨౫ | మబమన | మలము లనియబన |
| | | అణవ | ఆణవ |
| ౪౦ | ౧౧ | టేగ | టిగ |
| ౪౮ | ౧౬ | ప్రకృతిపురుషులుకళా | ప్రకృతికళా |
| | ౧౭ | స్మానల | స్మనీశివు |
| | ౧౮ | మించివె | పైనవె |
| ౫౨ | ౩ | బైంప | బైందవ |
| | ౨౦ | రబం | రంబ |
| ౫౪ | ౩ | తమై | తేము |
| ౫౭ | ౧౫ | యకోలువా | యుముగలవా |
| | ౨౦ | నిధి | నివి |
| ౬౦ | ౧౭ | వివనము | వివరణము |
| ౬౧ | ౧ | ముమ | ములు |
| | ౨౦ | అని | అనగా |
| ౬౨ | ౩ | సందు | నందు |
| | ౮ | డగుట | డగుటచే |
| | ౧౯ | పుట్టి | పుట్టి |
| ౬౩ | ౧ | లేదు. ఇందుకో | లేదు. పుత్రులు పెట్టు యారాధానాదికము; పితరులకు జెందవనుటలో |
| | ౧౬ | మైని | మైన |

# గ్రంథమాల యందు ముందు ప్రకటింపఁబడు గ్రంథరత్నములు



1 శివయోగసారము ౨ వ సంపుటము కొలనియాది గణ
2 " ౩ వ సంపుటము పతి దేవరచితము
3 " ౪ వ సంపుటము "
4 శివరహస్య ఖండము. యుద్ధకాండము కోడూరు వెంకటా చలకవి ప్రణీతము
5 బసవ విజయము ... తుమ్మలపల్లి నాగభూషణకవి
6 లింగధారణ దీపిక ... మల్లికార్జున పండితారాధ్యు
7 ... ల భవానీ శంకరాధ్యులు
8 శివజ్ఞాన శేఖరము ... ఘంటనా మాత్యుఁడు
9 కాళహస్తీశవిలాసము ... ... కాళహస్తీశ్వరుడు
10 మల్లికార్జున పండితారాధ్య చరిత్ర సంస్కృతము
11 నందికేశ్వర పురాణము
12 శివరహస్య ఖండము సంస్కృతము వ్యాస మహర్షి ప్రణీతము అ సురకాండ, వీరమహేంద్ర కాండ, యుద్ధకాండ, దేవకాండ, దక్ష కాండ, ఉపదేశకాండలు
13 శైవసిద్ధాంత దర్శిని ౨వ సంపుటము ౩వ సంపుటము
14 విష్ణుకృత మహిమ్న స్తోత్రముసవ్యాఖ్యానము మల్లికార్జున పండితా రాధ్యుల వీరనారాధ్యులు.
15 బసవ పురాణము సంస్కృతము వ్యాస ప్రణీతము

ఈ గ్రంథము లచ్చుబడుటకు నారాధ్యు లందరు తాముతప్పక చందా దారులుగాఁ జేరియు తమ మిత్రులను తమశిష్యులను జేర్చియు మాకు ప్రోత్సాహ మొసంగుదు రని నమ్ముచున్నారము.

స్థాపితము. 1925

శ్రీశివాయ గురవేనమః.

చందా సం॥ రు ౪
ప్రతికతో సం॥ ౪

# శైవ పరిచారిణీ గ్రంథమాల

ఇందు అముద్రితములు అనుపమానములు, అమృతమయములు ఆనంద ప్రదములునగు నాలుగు గ్రంథ రత్నములు ముద్రింప బడును.

## నియమములు.

1 సంవత్సరమునకు ౨00 పేజీలకు దక్కువ లేని శైవధర్మ బోధకములగు నాలుగు గ్రంథములు 3 నెలలకు 1 చొప్పున ప్రకటించి పంపబడును.

2 గ్రంథమాలకు నియమింపబడిన చందా ౪-0-0 లు ప్రతిసంవత్సరము బయలు వెడలు మొదటి గ్రంథముతోడనే చందా దారులు చెల్లించవలసి యుందురు.

3 శాశ్వత చందా దారుల- అభిమానుల, పోషకుల, ప్రధాన పోషకుల, రాజపోషకుల నామములు ప్రతి గ్రంథమునను ముద్రింపబడును. కేవలము చందాదారుల నామములు ప్రకటింపబడవు.

4 గ్రంథమాలకు చందాదారులు ౪-0-0 అభిమానులు ౧౨-0-0 పోషకులు ౨౫-0-0 ప్రధాన పోషకులు ౫౦-0-0 రాజ పోషకులు ౧౦౦-0-0 నీయవలసి యుందురు.

5 శాశ్వత చందాదారులు రు ౫౦-0-0 అభిమానులు ౧౦౦-0-0 పోషకులు ౨౫౦-0-0 ప్రధానపోషకులు ౫౦౦-0-0 రాజపోషకులు ౧౦౦౦-0-0 మొత్తముగా నొసంగవలెను. శాశ్వత చందా దారులొకసారిచ్చిన తరిగి వారెప్పుడు చందానీయ నవసరము లేదు. గ్రంథముల బంపు చుందుము.

6 ఇతరులకు రు ౧-0-0 వెలకు నొసంగు గ్రంథము మా శాశ్వత చందాదారులకు 0-౮-0 కిని చందాదారులకు 0-౧౨-0 కును యీయబడును.

7 గ్రంథమాలా చందా దారులకు పత్రిక గూడ కావలసినచో పోష్టుచార్జీలకై 0-౮-0 పంపిన నుచితముగా బడయగలరు.